# సాహితీ మూర్తులు - స్ఫూర్తులు

(సాహిత్య వ్యాసాలు)



డా॥ దార్ల వెంకటేశ్వరరావు

***Sahiti Murthulu-Spoorthulu*** *(Essays on Literary Criticism)*

**by Dr. Darla Venkateswara Rao**
AssociateProfessor,
Department of Telugu, School of Humanities,
University of Hyderabad (Central University),
Hyderabad-500 046., India

First Edition: January, 2015

Copies: 500
Price: Rs. 100

**ISBN : 978-81-908963-4-4**

The Book has been published with the Financial Assistance under the UGC-Unassigned Grants given by the
**University of Hyderabad**

**Books available at :**
Visalanadhra, Navo daya, Prajasakti Book House, Hyderabad and Leading Book Stalls
www.kinige.org, www.avkf.org
www.vrdarla.blogspot.in

For Communication :
**Dr. M.Manju Sree,** Lecutrer in Telugu,
B 202, Sai Cluster Apartment, Sivajinagar Colony
Near Railway Station, Behind: Petrolbunk, Seri Lingampally,
Hyderabad -500 019., Ph: 09989628049, E mail: vrdarla@gmail.com

**Dr. Darla Ravi Kumar,** Telugu Pandit,
Cheyyeru Agraharam, Via: Anathavaram (S.O.),
East Godavari Dist-533 222. Andhra Pradesh, India

**Published** by : Society & Education Trust, Hyderabad
www.societyandeducation.org
Cover Design: P.V.V.S. KiranKuamar

Printed at : Cahrita Impressions, Hyderabad. Ph: 040-27678411

# అంకితం



రాయడంలో, మాట్లాడ్డంలో నాకు ప్రేరకులై
నన్నెంతగానో ప్రోత్సహించే గురువుగారు
ప్రముఖ విమర్శకులు డా॥ద్వానాశాస్త్రిగార్కి
వినయంతో... ప్రేమపూర్వకంగా ...

– డా॥దార్ల వెంకటేశ్వరరావు

# మెచ్చుకోలు

**– డా॥ ద్వానాశాస్త్రి,**
1-1-428, గాంధీనగర్,
హైదరాబాదు-500080,
ఫోను: 09849293376

మంచి గురువు లభించడం ఎంత అదృష్టమో మంచి శిష్యుడు లభించడమూ అంతే అదృష్టం.మంచి గురువు ఎప్పుడూ శిష్యుడు తనను మించి అభివృద్ధి చెందాలని కోరుకుంటాడు. కోరుకోవాలి కూడా!

దార్ల వెంకటేశ్వరరావు నా శిష్యుడని చెప్పుకోవడం నా అదృష్టం. ఎంతోమంది శిష్యులున్నా కొద్దిమంది మాత్రమే గురువుని గుర్తుంచుకుంటారు. ఇంటర్మీడియెట్ నుంచి ఇవాల్టి అసోసియేటు ప్రొఫెసరు వరకు అతడు అధిరోహించిన విజయ సోపానాలకు నేను ప్రత్యక్ష సాక్షిని.

దార్ల సోదరుడు, సోదరి కూడా నా శిష్యులవ్వడం మరింత ఆనందదాయకం. ఈ పుస్తకాన్ని దార్ల నాకు అంకితమివ్వడమనేది కేవలం కృతజ్ఞతా భావం మాత్రమే. నావల్ల అతనికే ప్రయోజనం లేదు. శిష్యవాత్సల్యంతోనే దీనిని అంకితంగా తీసుకుంటున్నాను. తిక్కనకు కేతనలాగా, నాకు దార్ల వెంకటేశ్వరరావు... అనుకుంటూ... అతని దినదినాభివృద్ధిని కోరుకొంటున్నాను.

**– ద్వానాశాస్త్రి**

# ఫేస్ బుక్

**–ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

దార్ల ఒక మంచి చదువరి, బ్లాగరి. తన మునివేళ్ళను ఆధునిక విజ్ఞానశాస్త్రంలో ముంచి తెలుగు సాహిత్యానికి తిలకం దిద్దుతున్న నెటిజను. ఇవన్నీ మించి నాకు సహవ్రతుడూ, సహృదయుడూనూ. నిజాయితీ ఉన్న సాహితీకృషీవలుడు. ఈ మాట ఎందుకంటున్నానంటే– సెమినార్లు సెమినార్లంటూ అప్పటికప్పుడు ఒంటికాలిపై గాలిపేపర్లు పోగేసి డొల్ల సెషన్లలో తుస్సు తుస్సుమనిపించే వారి కంటే వెయ్యిరెట్లు నయం దార్ల. సివిల్సుకు ప్రిపేరయ్యే కుర్రాడిలా పుస్తకం పుస్తకం పోగేసి అక్షరం అక్షరం రాజేసి సంప్రదాయబద్ధంగా పత్రాన్ని వండుతాడు. ఈ మాటలు నిజమని సాహితీమూర్తులూ స్ఫూర్తులూ అనే పరిశోధన, విమర్శ వ్యాసాల పుస్తకంలో ఏ వ్యాసాన్ని పలకరించినా చెప్తాయి.

దార్ల వెంకటేశ్వరరావు వర్తమాన సాహిత్యంతో కలిసి క్రమం తప్పక నడుస్తున్న విమర్శకుడు. ఆ కృషినీ ఈ మధ్య తెలుగు విశ్వవిద్యాలయం గుర్తించింది. ఉత్తమ విమర్శకుడి పురస్కారమూ సమర్పించింది. నేను ఎప్పుడూ చెప్తూ ఉంటాను. *ఏదైనా ఒక స్పెషలైజేషను ఎంచుకో. అన్నింటిలోనూ (శక్తిలేకుండా) తగుదునమ్మా అని వేలు పెట్టకు. ఆ రంగంలో చేతికి అందని లోతుల్ని స్పృశించు. మూలాల్ని పట్టుకో. నీ శక్తి ఏదైనా ఎంత ఉన్నా సర్వమూ దానికే ఒడ్డు. నీ కృషి ఫలిస్తుంది. ఆ ఫలాన్ని లోకం ఎప్పటికో ఒకప్పుడు గుర్తిస్తుంది. గుర్తించి తీరుతుంది.* సరిగ్గా ఇదే చేశాడు దార్ల. విమర్శరంగం ఎంచుకున్నాడు అందులోనే కృషి చేస్తున్నాడు. ఒక్కో మెట్టూ ఎక్కుతున్నాడు. శుభోజ్జయం.

విషయసంకలనంబు విజ్ఞానమా! 'ఇటుక ఆమ వేరు ఇల్లు వేరు' అన్నారు. ఇది సంకలన గ్రంథాల విషయంలో. ఇప్పటి విమర్శకులు తమ వ్యాసాలను కొంత సంకలన గ్రంథాల మాదిరిగానూ తయారు చేయాలి. ఎందుకంటే సాహిత్యంలో బాగా విస్తృతమైన అంశాలను మనం పరిశోధనకు స్వీకరించినప్పుడు ఇది తప్పదు. కావలసిన ముడి పదార్థం మొత్తాన్నీ ఒకచోట సమీకరించి పెట్టడమూ ఒక పరిశోధనే. దానికీ టెక్నికాలిటీస్ ఉన్నాయి. ఒకేసారూప్యమూ, స్వాభావ్యమూ కల అంశాలను క్రోడీకరించాలి. అదే చేశాడు దార్ల ఈ వ్యాస సంపుటిలో. సాహిత్యంలో ఏదో ఒక ప్రక్రియలో విశిష్టంగా సేవలందించిన సాహితీమూర్తుల్ని స్వీకరించాడు వ్యాసవిషయాలుగా. అయితే కేవలం వారి గురించి చెప్పి విడిచి పెడితే నిజంగా.... అది విజ్ఞాన సర్వస్వంలాగా బయోడేటావరకే పరిమితమయ్యేది. ఒక వైపు ఈ సాహిత్యమూర్తుల జీవన రేఖను పరిచయం చేస్తూనే... మరోవైపు వారు చేసిన కృషినీ సాహిత్య స్ఫూర్తినీ విశ్లేషించటం ఈ వ్యాస సంపుటికి గుండెకాయ.

విమర్శరంగంలోని వివిధపార్శ్వాలను ఈపుస్తకం తడిమిందనడానికి వ్యాసాలలోని వైవిధ్యమూ విమర్శలోని గాఢత నిదర్శనలు. అంతరార్థ రామాయణంపై రాసినపెయ్యేటి లక్ష్మీకాంతమ్మగారిని లోకానికి పరిచయం చేశాడు. తరిగొండ వెంగమాంబ, బండారు అచ్చమాంబ రచనలలోని కవితా మాధుర్యాన్నీ, స్త్రీ చైతన్యాన్ని తూకం వేశాడు. గురజాడ కవిత్వంలోని సంస్కరణ దృక్పథం, గిడుగు భాషా, సామాజిక దృక్పథం... వంటి వ్యాసాలు మనల్ని పునరాలోచనలో పడవేస్తాయి. ఆధునిక కవిత్వం, ఆధునిక సాహిత్య ప్రక్రియలు, కళాతత్త్వశాస్త్రం, అంతర్జాలం....ఇలా విషయ వైవిధ్యంతో కూడిన వ్యాసాలు సాహితీ విద్యార్థులకు చక్కగా పాఠం చెప్తున్నట్లుగా సరళమైన భాషలో అందించటం విశేషం. దార్లలోని విద్యార్థిమిత్ర విమర్శకుడిని అభినందిస్తున్నాను.

అత్యాధునికమైన సాహిత్య విమర్శ సూత్రాలూ, సిద్ధాంతాలూ గమనించి ఆ దృష్టికోణంతో దార్ల ఈ వ్యాసాలను రచించినట్లు స్పష్టంగా చెప్పగలను.

అస్తిత్వవాద భావజాలాన్ని బలమైన కంఠస్వరంగా విన్పిస్తున్న వారిలో దార్ల కూడా ఒకరు. సామాజిక భాషా సాహిత్యాల అభివృద్ధికి తీసుకోవలసిన చర్యలూ, వాటి ఆచరణలూ మొదలైన వాటిపట్ల స్పష్టమైన చిత్రం ఉంది దార్ల దృష్టిలో. ఆ చిత్రాన్నే ఇక్కడ ఆవిష్కరించాడు. ఈ చిత్రం అందరి మన్ననల్నీ పొందాలనీ...ఒక విమర్శకుడిగా దార్ల వెంకటేశ్వరరావు పడుతున్న శ్రమనీ తపననీ చేస్తున్న కృషినీ లోకం మరోసారి గుర్తిస్తుందని నేను అభిలషిస్తున్నాను. ఈ వ్యాస సంపుటిలోని వ్యాసాలన్నీ సదస్సుల కోసం రాసినవే. సదస్సు ముగిసిన పిదప, ఆ వ్యాసంపై వచ్చిన అభిప్రాయాలను క్రోడీకరించి, విమర్శలను పున: సమీక్షించి పత్రాన్ని మళ్ళీ సిద్ధం చేయటం నిజాయితీకల పత్ర సమర్పకుడు చేయవలసిన పని. ఈ వ్యాసాలన్నీ ఇలా చేసినవేనని ఆ వ్యాసాలలో కన్పించే నిఖార్సయిన రిసెర్చి మెథడాలజీ చెప్పకనే చెప్తుంది. ఈ విషయంలో మాత్రం విద్యార్థులు- విద్యార్థులే కాదు కొందరైనా అధ్యాపకులూ దార్లని చూసి నేర్చుకోవాలని నా అభిప్రాయం. సీరియస్ గా సాహిత్యవిమర్శ, పరిశోధన రంగాలలో పని చేసే వారికీ, సాహిత్య విద్యార్థులకీ ఈ పుస్తకం ఒక "ఫేస్ బుక్" వంటిదని విన్నవించు కొంటూ- పాఠకులకు స్వాగతం పలుకుతున్నాను. దార్ల వారిని అభినందిస్తున్నాను.

మీ

***బేతవోలు రామబ్రహ్మం***

07-04-2014

# కృతజ్ఞతలు

సాధారణంగా సాహిత్యం సమాజానికి దర్పణంగా నిలుస్తుందంటారు. అంతేకాకుండా ఆ సామాజిక పరిస్థితుల్ని బట్టి ఆ సాహిత్యంలో వస్తు,రూపాలు కూడా రూపొందుతాయి. తెలుగు సాహిత్యం దీనికి భిన్నమైందేమీకాదు. ఈ దిశగానే తెలుగులో కవులు, రచయితలు తమ రచనల్ని సృజనీకరిస్తున్నారు.

సమాజంలో జరుగుతున్న అనేక సంఘటనలకు ప్రతిస్పందించే కవులు, రచయితలు తమ అనుభవాలను, అనుభూతులను, తమ ఆలోచనలను తమకిష్టమైన ప్రక్రియల్లో అభివ్యక్తీకరిస్తుంటారు. వాటిలో వ్యక్తమైన కొంతమంది ఆలోచనలు సమకాలీన సమాజానికి మార్గదర్శనం చేస్తే, మరికొన్ని ఆలోచనలు ప్రజల్ని తర్వాత కాలంలోనూ ప్రభావితం చేయవచ్చు. ఈదృష్టితో తెలుగు సాహితీమూర్తుల కృషిని గమనిస్తే భిన్న మనస్తత్వాలతో కనిపిస్తారు. తాము పుట్టి పెరిగిన వాతావరణానికి అనుగుణంగానే తమ జీవితాల్ని తీర్చిదిద్దుకున్న వాళ్ళు కొందరైతే, దానికి భిన్నంగా ఆలోచించి, జీవించిన వాళ్ళు మరికొందరు ఉన్నారు. సాహిత్యమే ఊపిరిగా బతుకుతూ అనేకప్రయోగాలు చేసి సాహిత్యంలో నూతనత్వానికి మార్గం వేసినవాళ్ళున్నారు. తమ వృత్తి వేరైనా, ప్రవృత్తిగా మొదలైన రచనావ్యాసాంగం ఆ తర్వాత కాలంలో ఎందరికో స్ఫూర్తిదాయకంగా నిలుస్తోంది.

కొంతమంది వ్యక్తులుగా స్ఫూర్తిదాయకంగా నిలుస్తుంటే, మరికొంతమంది వారి భావాల ప్రభావం మనపై విస్తృతంగా కనిపిస్తుంది. ఇలాంటి వ్యక్తుల గురించి వివిధ సందర్భాల్లో రాసిన పరిశోధన పత్రాలు, సీమీక్షలు, వ్యాసాల్ని ఒక పుస్తకంగా తీసుకొచ్చే ప్రయత్నంతో వెలువడుతున్నదే ఈ పుస్తకం. సమాజాన్నీ, సాహిత్యాన్ని తమదైన దృష్టికోణంతో పరిశీలించే పద్ధతినీ, కావ్య పరమార్థాన్ని అవగాహన చేసుకునే విధానాన్ని పరిశోధకులు, విమర్శకులు, విద్యార్థులు గమనించడానికి ఈ వ్యాసాలు ఉపకరిస్తాయనుకుంటున్నాను.

దీనిలో అత్యధికంగా వివిధ సదస్సుల్లో పాల్గొని సమర్పించిన పరిశోధన పత్రాలే.కానీ, కొన్ని వ్యాసాలు సదస్సుల్లో సమర్పించినవి కాదు. విద్యార్థులకు ఉపయోగపడే అంశాలుగా భావించి అప్పుడప్పుడు రాసినవి కొన్ని ఉన్నాయి. వాటిని కూడా దీనిలో చేర్చాను. వివిధ సదస్సుల్లో పాల్గొని నా భావాలను విద్యార్థులు, పరిశోధకులతో పంచుకోవడానికి అవకాశం కలిగించిన సదస్సుల నిర్వాహకులకు నా కృతజ్ఞతలు.

పుస్తకాన్ని ప్రచురించుకోవడానికి ఆర్థికసహాయం చేసిన యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్ వారికి, ఈ వ్యాసాలను పరిశీలించి గ్రాంటుకి సిఫారసు చేసిన ఆచార్య బన్న అయిలయ్య (కాకతీయ విశ్వవిద్యాలయం), ఆచార్య ఎం.గోనా నాయక్ (ఉస్మానియా విశ్వవిద్యాలయం)గార్లకు ప్రత్యేకకృతజ్ఞతలు.పుస్తకానికి 'సాహితీమూర్తులు-స్ఫూర్తులు' పేరు సూచించి, నన్ను వెన్నుతట్టి ప్రోత్సహించేలా నాలుగు మంచిమాటలు రాసిన పండిత పరిశోధకులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికీ, వ్యాసాలను చదివి విలువైన సూచనలు చేసిన ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు ఘట్టమరాజు అశ్వత్థనారాయణగార్కి, పుస్తకాన్ని అంకితం తీసుకోవడానికి తమ సమ్మతిని తెలిపిన మా గురువుగారు డా॥ ద్వానాశాస్త్రిగార్కి ప్రత్యేక ధన్యవాదాలు.అన్ని వేళల కనిపెట్టుకొని ఉండే నా జీవితభాగస్వామి డా॥ మంజుశ్రీకీ, నా కుటుంబ సభ్యులకీ, పుస్తకాన్ని ప్రచురించిన సొసైటీ అండ్ ఎడ్యుకేషన్ ట్రస్టు నిర్వాహకులు కిరణ్,రవికుమార్,శివరామ్‌లకు, పుస్తకాన్ని అందంగా ముద్రించిన చరిత ఇంప్రెషన్స్ వారికీ, లే ఔట్ లో సహకరించిన భాగ్యలక్ష్మిగార్కి, అన్ని వేళలా సహకరించే మా విద్యార్థులు బి.ఉమేష్, చంద్రమౌళిలకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

**- డా॥ దార్ల వెంకటేశ్వరరావు**

# విషయసూచిక

# పెయ్యేటి లక్ష్మీకాంతమ్మ గారి అంతరార్థ రామాయణం - విశేషాలు

"శ్రీరామ" అనే నామం విన్నా, అన్నా, రాసినా పుణ్యమని భావించే భక్తులెంతో మంది ఉన్నారు. అలాగే రామాయణాన్ని రాసి, తమ జన్మలను చరితార్థం చేసుకోవాలని భావించిన వాళ్ళూ ఎంతోమంది ఉన్నారు. అలాంటి వారిలో శ్రీమతి పెయ్యేటి లక్ష్మీకాంతమ్మగారొకరు. ఆమె గేయ రూపంలో "అంతరార్థ రామాయణం" పేరుతో ఒక రామాయణాన్ని రాశారు. రామయణంలోని కథలను గేయ రూపంలో చిన్న చిన్న కథలుగా చెప్తూనే ఆ కథల్లోని అంతరార్థాన్ని వివరించే ప్రయత్నం చేశారు.

శ్రీమతి పెయ్యేటి లక్ష్మీకాంతమ్మ గారికి "ముక్తికాంత" అనే బిరుదు ఉంది. శ్రీవత్స గోత్రానికి చెందిన శ్రీమతి లక్కరాజు సుందరి, సీతారామయ్యల పుత్రిక. ఆమె పుట్టిన తేదీ విషయంలో స్పష్టత లేదు. కానీ, "*అంతరార్థ రామాయణం*" లోని ఆంతంగిక ఆధారాలను అనుసరించి ఆమె 1950 (వికృతి నామ) సంవత్సరంలో స్వర్గస్థులయినట్లు మాత్రం తెలుస్తుంది. ఆమె జీవించి ఉండగా ఈ కావ్యం ముద్రితం కాలేదు. ఆమె మరణానంతరం మనవరాలు శ్రీమతి ఆత్రేయపురపు లక్ష్మీసుందరీ జ్ఞానప్రసూనాంబగారు చొరవ తీసుకొని దాన్ని 1982లో ప్రచురించారు. జ్ఞాన ప్రసూనాంబ గారికి స్వయంగా సంస్కృతాంధ్ర సాహిత్యాలలో ప్రావీణ్యం ఉన్నా, గ్రంథ పరిష్కారానికి వివిధ పండితుల సహకారాన్ని కూడా తీసుకున్నారు. ఈ కావ్య పరిష్కరణకు శ్రీమతి ముట్నూరి సీతామహాలక్ష్మమ్మ, చిలుకూరి వీరభద్రశాస్త్రిగార్లు సహకరించినట్లు తన కృతజ్ఞతలలో పేర్కొన్నారు.

శ్రీమతి పెయ్యేటి లక్ష్మీకాంతమ్మగారు అంతరార్థ రామాయణంతో పాటు వివిధ పురాణేతిహాసాలను, వాటిలోని అంతరార్థాలనూ వివరిస్తూ వివిధ కావ్యాలను గానం చేసేవారు. అంతరార్థ రామాయణంలో పేర్కొన్న వివరాల ప్రకారం ఆమె ఆరు రచనలను చేసినట్లు తెలుస్తుంది. 1. అంతరార్థ నరకాసురవధ 2. అంతరార్థ రుక్మిణీ

కల్యాణం 3. అంతరార్థ గజేంద్ర మోక్షం 4. అంతరార్థ సాగర మథనం 5. వచన భగవద్గీత 6. లాలి పాటలు.

## అంతరార్థ రామాయణం కావ్యవిశేషాలు:

1) "అంతరార్థమున కాధారభూతమై!
అవని అంతా నిండుగా వెలుగులు
విరజిమ్మ చిమ్మచీకటులు చెదిరిపోవ
ఓ గజాననా నీకు నమస్కారశతములు" అంటూవిఘ్నేశ్వర స్తుతితో ఈ కావ్యాన్ని ప్రారంభించారు.

2) ఇతర రామాయణాల వలే కాకుండా, అంటే బాలకాండ, అయోధ్య కాండ, అరణ్యకాండ, కిష్కింధకాండ, సుందరకాండ, యుద్ధకాండ, ఉత్తరకాండ అనే భాగాలుగా కావ్యాన్ని విభజించలేదు. చిన్న చిన్న కథా భాగాలుగానే కావ్యాన్నంతా రూపొందించారు. దశరథుని వృత్తాంతం, శ్రీరామ జననం, సీతాకన్యల జననం, – విశ్వామిత్రుడనెడి విశ్వాసశర్మ రాక, జ్ఞానవివేకంబులు మునివెంట వెడలుట, తాటకయను భ్రాంతీ దేవియు, సుబాహువను దుర్గుణ పుంజంబుల వధ, అహల్యా దేవి శాపవిమోచనం, అహంకార ధనుర్భంగం, అయోధ్య ప్రవేశం... ... మొదలైన శీర్షికలుగా ఈ కావ్య విభజన జరిగింది.

3) ఈ కావ్యంలోనూ వాల్మీకి రామాయణ కథనే మూలంగా గ్రహించినా, ఇతర రామాయణాల్లోని కొన్ని కల్పితాంశాలను కూడా ఈ అంతరార్థ రామాయణంలో తీసుకున్నారు. ఉదాహరణకు అహల్యా శాపవిమోచనం ఘట్టాన్ని చూసినట్లైతే, వాల్మీకి రామాయణంలో లేకపోయినా, అది మొల్ల రామాయణంతో బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది.

4) కావ్యమంతా గాన యోగ్యమైన శైలిలో కొనసాగింది. కావ్య రచన ద్విపద, మంజరి, కీర్తనలతో వర్ణించారు.

5) అంతరార్థాన్ని వివరిస్తున్నా, శ్రీరాముని కథను సంపూర్ణంగా వినిపించే ప్రయత్నమే కావ్యమంతా కనిపిస్తుంది.

6) వేదాలు, ఉపనిషత్తులు, యోగ శాస్త్రాది విషయాలను ఆధారంగా చేసుకొని రామాయణ అంతరార్థాన్ని వివరించారు.

7) రామాయణాన్ని ఎవరు రాసినా, ఏ విధంగా వర్ణించినా సాధారణంగా శ్రీరాముని

మాహాత్మ్యమే అందులోనూ ప్రతిఫలించటం జరుగుతుంది. అంతరార్థ రామాయణం కూడా అలాగే కొనసాగింది. అయితే ఈ కావ్యంలో కథను వివరిస్తూనే, మానవుని జీవాత్మ – పరమాత్మల స్వరూపాన్ని వివరించే మార్గంలో ఈ రచన కొనసాగింది. మరో విశేషమేమిటంటే, శ్రీరాముని ప్రస్తావన వచ్చినప్పుడల్లా అనేక విశేషాలతో ప్రస్తుతించారు. ఈ రచనా విధానం వల్ల పాఠకుని లేదా శ్రోతను శ్రీరాముని పైనే కేంద్రీకరించేటట్లు చేయగలిగే అవకాశం ఉంది.

8) అంతరార్థాన్ని వివరించడంలో ఆయా పాత్రలను అన్వయించడంలో కొంత గందరగోళం కనిపిస్తుంది. అందువల్ల పాఠకులు లేదా శ్రోతలు గందరగోళానికి గురయ్యే అవకాశం లేకపోలేదు.

9) మానవ జీవితంలోని పరమార్థాన్ని గ్రహించి, తదనుగుణమైన జీవనాన్ని కొనసాగించి, జీవాత్మ – పరమాత్మలో లీనమవ్వడంతో "ముక్తి" లభిస్తుందని చెప్పడానికి "రామాయణం"ఆవిర్భవించిందని వివరించటమే లక్ష్యంగా ఈ కావ్య రచన కొనసాగింది. వీటిలో ముఖ్యమైన వాటిని ఇక్కడ వివరించే ప్రయత్నం చేస్తాను.

## ఉపనిషత్తుల్లో రామ ప్రస్తావన – అంతరార్థవివరణ:

మానవుని మానసిక ప్రవృత్తులను వివరించడంలో వేదాలు, ఉపనిషత్తులు ఎన్నో లోతైన ఆలోచనలను అందించాయి. అథర్వణ వేదాంతర్గతమగు 'రామ రహస్యోపనిషత్తు'లో శ్రీరాముని తత్త్వము గురించి అడిగిన సనక సనందాది యోగీశ్వరులు, ఇతర ఋషీశ్వరులకు హనుమంతుడిలా వివరిస్తాడు.

"... ఈసర్వ తత్త్వాలలో తారక బ్రహ్మ తత్త్వము ఉత్తమమైనది. రాముడే పర బ్రహ్మ, రాముడే పరమ తపము, రాముడే పరమతత్త్వము. . రాముడే తారకబ్రహ్మ"

*"వాయు పుత్రుని, విఘ్నేశ్వరుని, సరస్వతిని, దుర్గాదేవిని, క్షేత్ర పాలకుని, సూర్యుని, చంద్రుని, నారాయణుని, నరసింహుని, వాయు దేవుని వరాహుని వీరందరునూ మరియు మాతా సహితులగు సీతమ్మను, లక్ష్మణుని, శత్రుఘ్నుని, భరతుని, విభీషణుని, సుగ్రీవుని, అంగదుని, జాంబవంతుని – ఈ తెలిపిన అందరును శ్రీరామునికి అంగములని తెలిసికొనవలెను. అంగములు లేకుంటే రాముడు విఘ్నకరుడు"* అనే వివరణ కనిపిస్తుంది ఆత్మ వివిధ రూపాలలో కనిపించడమే

దీనిలోని అంతరార్థం. ఇంచుమించు ఇలాంటి భావాలనే శ్రీమతి పెయ్యేటి లక్ష్మీకాంతమ్మగారు తన "అంతరార్థ రామాయణం"లో వర్ణించారు. "దశరథుని వృత్తాంతం"తో అంతరార్థ రామాయణం కథ ప్రారంభమవుతూ ఇలా వర్ణితమయ్యింది...

*"ఇంద్రియంబులనెడి ఇంపైన గుర్రములు!*
*కాయమనే రథము కడువేడ్కతోను*
*పంచ కోశాపురి పరగ వర్ణింప!*
*వశముకాదు గద వసుధలోపల!!*
*సందు గొందులు సరస సావిళ్ళు!*
*వింత వింత మేలు కట్ల మరియుండె*
*ఇళా పింగళ వీధులింపుతో గలవు!*
*సుషుమ్న పురమున కే సూటిజాపునుగ!!*
*నయము మీరగ నవ ద్వారములు గలవు!*
*నాథుడై దశరథుడు పాలించుచుండె*
*దశేంద్రియములు తా పాలనము సేయ!*
*నా దశరథునకు నాత్మ రాజనెడి !!*
*నామంబు చేకూరె న్యాయానుసరణి!*
*మగువలు ముగ్గురు కలరు రాజుకు!!*
*నివృత్తి, ప్రవృత్తి, భక్తియనెడి! కౌసల్య,*
*కైక సుమిత్ర సుదతులు !!"*

ఈ వర్ణనలో మానవుని దేహం, మనసులకు సంబంధించిన విషయాలే రామ కథగా రూపొందిందనే ఆలోచన కలుగుతుంది. "దాశరథి (రాముడు) ఎంత అంతర్ముఖుడో, ఇంద్రియ నిగ్రహం కలవాడో దశముఖుడంతగా బహిర్ముఖుడు, ఇంద్రియలోలుడు. ఒక్క మాటలో చెప్పాలంటే దశ దిశలకూ బహిర్ముఖమైన ఇంద్రియ చాపల్యానికి లంకేశ్వరుడు సంకేతం.

*"దశముఖుడంటే కుడి వైపు ఐదు తలలు, ఎడమ వైపు ఐదు తలలుండి ఒకే మెడకాయ ఉన్న విచిత్ర పురుషుడు కాదు. ఇక్కడ ముఖ్యంగా చెప్పవలసిందేమిటి అంటే రావణుని ఇంద్రియ లోలుత దశ దిశా పరివ్యాప్తములైన వని అర్థం.* " అని ముదివేడు ప్రభాకరరావుగారు వ్యాఖ్యానించటం కూడా రామాయణంలో ఇలాంటి

ఒక అంతరార్థాన్ని నిరూపించే ప్రయత్నమే ఆయనా చేశారనిపిస్తుంది ఆయనే అయోధ్య అంటే ఏమిటో వివరిస్తూ ఇలా వ్యాఖ్యానించారు.

*''మనలో ఏ సత్యం నిత్యమూ జాగృతమవుతూ ఉంటుందో, ఏ స్వచ్ఛ స్ఫాటికమైన అంత:కరణం ఆత్మానూభూతిగా జీవుని అనుభవంలో కసిస్తున్న వికసిస్తుందో అదేరామతత్త్వం - ఆత్మా రాముడంటే అతడే. మనలోని ఈ ఆధ్యాత్మిక సారం బాహ్యంగా ఆకృతి ధరిస్తే ఎలా ఉంటుందంటే, దశరథుని కుమారుడైన దాశరధి వలే ఉంటుంది. ఈ దాశరథి దశేంద్రియాలను జయించిన వాడు"*

*"దాశరథియైన దాశరథి మనలో అవతరించవలెనన్నా ఉన్నా లేక లోకంలో చక్షుర్గోచరం కావాలన్నా ఆ ప్రదేశం "అయోధ్య" కావాలి. యుద్ధమంటే సంఘర్షణ. అయోధ్య అంటే సంఘర్షణ రహితమైనది.*

*ఎక్కడ సర్వేంద్రియ సంఘర్షణలు బాహ్యాభ్యంతరంగా శమించి ప్రశాంత వాతావరణం నెలకొని ఉంటుందో అదే "అయోధ్య" అన బడుతుంది. అటువంటి అయోధ్యను పరిపాలించడానికి ఆత్మనిగ్రహం గలవాడే అన్నివిధాలా అర్హుడు. రాముడు ఎటువంటి వాడంటే స్వాహంకారం, భౌతిక భోగాలు జీవితంలో శాంతినీ సమాధానాన్ని సమకూర్చవని చక్కగా తెలిసిన వాడు"* అని అన్నారు.

విశ్వామిత్రుడు యజ్ఞం కామశర్మ, దుర్గుణ చేస్తుంటే కామశర్మ, భ్రాంతిదేవి ఆటంకం పరుస్తున్నారని రచయిత్రి వివరించారు. దశరథుడు ఆందోళన పడతాడు. కొడుకుని పంపించటానికి వెనుకాడినపుడు - వశిష్ట మహర్షి ఇలా చెప్పారట. నరుడనినీ పుత్రుణ్ణి భ్రమిస్తున్నావు. అది పురుషుడు, అమర తేజశ్శీలి. మీరు అతిథి కశ్యపులు మీ తపస్సుకి మెచ్చి "భూభారహరణార్థం రాముడు పుట్టెనయ్య భూవర ! భావ వినాశి రాముడనగ భవ్య చరిత " అని చెపుతాడు. అంతేకాదు...

"శంఖు చక్రంబులు రెండు భరత శతృఘ్నులు

శేషుడు సుమి లక్ష్మణుడు జగము మెచ్చన్" అని చెప్పి,

"జనకపురంలో యోగమాయ జానికై జన్మించెను" అని చెపుతాడు. రాముడు యాగ రక్షణకు వెళ్ళి, తాటకి అనే భ్రాంతీదేవిని, సుబాహువను దుర్గుణాలను వధిస్తాడు. ఆ తరువాత మరీచుడనే కామాన్ని అణిచివేస్తాడు. అహంకార ధనుర్భంగం చేసి జానకిని రాముడు వివాహమాడతాడు. అహల్య అనేది క్షమాదేవి. ఆమెకి రాముని పాద ధూళితో శాప విముక్తి కలుగుతుంది. ఇలా కొనసాగింది ఈ రామాయణం.

## ఆత్మ పరమాత్మ తత్త్వము:

ఆత్మ పరమాత్మల తత్త్వాన్ని తేల్చడం అంత సులభం కాదు. ఈవిషయంలో యోగులు, మహర్షులు ఎంతో మంది వివరించే ప్రయత్నం చేశారు. "ముక్తికి మెట్లు" అనే గ్రంథంలో వేదుల సూర్యనారాయణ శాస్త్రి గారిలా వివరించారు. "*కర్మ బద్ధమైన ఆత్మ "జీవాత్మ"అనబడతాడు. కర్మ విముక్తుడైన జీవుడు "పరమాత్మ"అనబడతాడు. "సుగుణంగా ఉన్న జీవుణ్ణి ప్రకృతిగానూ, అందున్న నిర్గుణ పరమాత్మను పురుషుణ్ణిగాను గ్రంథాలు పేర్కొంటున్నాయి"* అని అన్నారు.

"పురమంటే దేహం. పురుషుడంటే పురంలో ఉండేది "ఆత్మ" అని అర్థం. ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి అనే దేహంలోని. అందులో బుద్ధిని నడిపించే శక్తి ఆత్మది. "అందుకనే కఠోపనిత్ లో దేహం గురించిన చర్చ కొంత కనిపిస్తుంది. దీని సారాంశాన్ని చూస్తే ఆత్మ, రథి శరీరం, రథం, బుద్ధి, సారథి, మనస్సు, పగ్గం, ఇంద్రియాలు, గుర్రాలు, విషయాలు, మార్గం అని స్పష్టమవుంది. ఈ భావాలను వివరించటంలో రచయిత్రి చాలా వరకూ కృతకృత్యురాలైయ్యారు. అయినా మరింత స్పష్టంగా వివరిస్తే బాగుండేదనిపిస్తుంది.

అందువల్లనే వాల్మీకి మహర్షి మొదలు కొని నేటి వరకు వస్తున్న ఏ రామాయణాన్ని చదువుతున్నా, వింటున్నా ఏదో ఒక మాధుర్యం కలుగుతుంది. వాటిలో ఏదో అంతరార్థం వినిపిస్తూనే ఉంటుంది. కానీ "అది" "ఇదే" అని చెప్పడం అంత సులువు కాదు. ప్రతి వాళ్ళూ రామాయణాన్ని చదవాలి. దానిలోని అంతరార్థాన్ని అర్థం చేసుకోవాలి. అంటే ఉత్తమ జీవితాన్ని జీవించాలి. దానికి మానవునిగా జన్మించిన ప్రతి ఒక్కరూ తమ దేహాన్ని, మనసుని, ఇంద్రియాల్ని తమ ఆధీనంలో ఉంచుకోవటానికి నిరంతరం సాధన చేయాలి. మనం జీవిస్తూనే మన కర్మను మనం నిర్వర్తించాలని రామాయణం బోధిస్తుంది.

*"శరీరంలో త్వక్(చర్మం) చక్షు, శ్రోత్ర, ఘ్రాణ, జిహ్వేంద్రియములనే పంచ జ్ఞానేంద్రియాల యొక్కయూ మనస్సు యొక్కయూ "నేను నాది" అనే భావం యొక్క క్రియా కలాపాల్ని జరిపించే దానికి మనోమయ కోశం అని పేరు. పదార్థాల యొక్క వైవిధ్యములైన స్వరూపము యొక్క పరిజ్ఞానం, దీని యొక్క ప్రత్యేక లక్షణంగా తెలిసికోవాలి. ఇది ప్రాణకోశంతో ముడిపడి విజృంభిస్తూ ఉంటుంది. దీనిలో కలిగే "నేను నాది" అనే భావాలు ప్రశాంతిని నాశనం చేస్తూ ఉంటాయి. అహం, లేక "నేను" అనేదానికి సంబంధించిన దేహం "నాది" లేక "మమ" అనే భావం. ఈ రెండు అహంకార మమకార కార్యాలే "లోపల ఉండేది "నాది" అనేది. బైట*

ఉండేది నేను” అని ఆయన వివరించడంలో కొంత లోతైన విశ్లేషణ కనిపిస్తుంది.

*“ఈ జీవించే శరీరం నీకు సాధనం మాత్రమే అనుకోవాలి. కాని, అది నేనే అనుకోవడం కూడదు. నేను ఈ శరీరం కంటే విభిన్నుడనైయ్యే ఉన్నాను అనే అనుభవాన్ని నీవు పొంది ఉండాలి. నీ వాహనాన్ని నీపనులు జరుపుకోవడం కోసం చక్కగా నీవు ఎప్పటికప్పుడు శుభ్రపరిచి మలినం లేకుండా ఉంచుకొన్నట్లుగానే ఈ శరీరాన్ని కూడా నీలోని జన్మ వాసనలన్నింటినీ నాశనం చేసి మరణాంతంలో నీకు కైవల్యాన్ని (ముక్తిని) సమకూర్చేందుకు పరిశుద్ధ ఆహారవిహారాల నియమంతో శుభ్రపరచి ఉంచుకొనే ఉండాలి. నీ లక్ష్యం సిద్ధించే వరకు దానిని అలక్ష్యం చెయ్యకూడదని కూడాగ్రహించాలి“* అని వివరించారు. ఇలా వివరించిన డా॥వేదుల సూర్యనారాయణ శాస్త్రి గారు కూడా అంతరార్ధ రామాయణాన్ని రాసినట్లు వారి గ్రంథాలను బట్టి తెలుస్తుంది. శ్రీమతి పెయ్యేటి లక్ష్మీకాంతమ్మ గారి రామాయణంలోని అంతరార్థాన్ని నాకు అర్థమైనంత వరకూ సారాంశంలో ఇలా అర్థం చేసుకోవచ్చునిపించింది.

రాముడు - ఆత్మారాముడు, (జ్ఞానపరిపూర్ణుడు), లక్ష్మణుడు- జితేంద్రియుడు (ఇంద్రియాలను జయించిన వాడు), భరతుడు-పరిపూర్ణ వైరాగ్యుడు (తనకు రాజ్యం వచ్చినా రాజ్యం పాలించలేదు. యోగిగా జీవించాడు), శత్రుఘ్నుడు “అరిషడ్వర్గములను (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యా దులను) శత్రువులను జయించిన వాడు. సీత- శాంతికి, సహనానికి, క్షమకు, పవిత్రతకూ ప్రతీక, తాటకిని భ్రాంతిగానూ, మంథరను దుర్బుద్ధిగానూ, శూర్పణఖను తృష్ణగానూ, జటాయువును ధర్మస్వరూపుడు గానూ, ఆంజనేయుడు- సత్సాంగత్యం, రావణాసురుడు - రవ్వంత సేపు ఈశ్వరధ్యానం కలవాడే కానీ అజ్ఞానంగలవాడు గానూ ఈ రామాయణంలో అంతరార్థాన్ని తత్త్వపరంగా వివరించే ప్రయత్నం చేశారనుకుంటున్నాను.

లంకను శంక రూపంగానూ, రావణుణ్ణి అజ్ఞాన రూపుడుగాను ఆ పాత్రల్లోని అంతరార్థాన్ని రచయిత్రి వర్ణించారు. “జన్మ రాహిత్యం కల్గడమే మోక్షం” ఆ మోక్షాన్ని కలిగించడానికి అవతరించిన మహాత్ముడే శ్రీరాముడు. అలాంటి శ్రీరాముడేప్రతి మానవునిలోనూ దేహం, మనసు, దశేంద్రియాలు, అరిషడ్వవర్గాల రూపంలో వివిధ మానసిక ప్రవృత్తుల్లో ఉంటారు. ఎప్పుడైతే జ్ఞానం ప్రకాశిస్తుందో అప్పుడు అతడు పరమాత్మలో ఐక్యమవుతాడు. అజ్ఞాని కూడ జ్ఞాని అవుతాడు. పరమాత్మను చేరతాడు.

అలా చేరే మార్గాలను వివరించేదే రామాయణం. ఇదే ప్రధానంగా రామాయణం లోని అంతరార్థం!

**ఆధార గ్రంథాలు:**


1. ప్రభాకర రావు, ముదివేడు. *వాల్మీకివిశ్వనాథరామకథానుశీలము*, జ్ఞాన ప్రసూన మాలిక ప్రచురణలు, ఎస్ వి, యూనివర్శిటి క్యాంపస్, తిరుపతి: 1993.
2. లక్ష్మీకాంతమ్మ, పెయ్యేటి. *అంతరార్థరామాయణం*, అత్రేయపురపు లక్ష్మీసుందరి జ్ఞానప్రసూనాంబ, త్యాగరాజు భవనము, నర్సాపురము:1982.
3. సత్యనారాయణగుప్త, విద్వాన్ గర్రె. *ఉపనిషత్ కల్పతరువు* (మూడు భాగాలు), (సంగ్రహ కర్త), ప్రార్థనా గాన ప్రచార సంఘం, విజయవాడ :1997.
4. సూర్య నారాయణశాస్త్రి, వేదుల. *ముక్తిమెట్లు.* గంగాధర పబ్లికేషన్, విజయవాడ :1987


***– (భావవీణ మాసపత్రిక, మార్చి, 2009)***

# తరిగొండ వేంగమాంబ కవితావైశిష్ట్యం

మాతృశ్రీ తరిగొండవేంగమాంబ కవిత్వంలోని విశిష్టతను అలంకారాలు, ధ్వని, వ్యాకరణాది అంశాలను ప్రమాణంగా చేసుకొని సమన్వయించి నిర్ణయించడం కంటే, ఆమె భగవంతుని పట్ల భవ్యకవితావేశంతో వ్యక్తీకరించి ప్రభావాన్ని గుర్తిస్తే సమంజసంగా ఉంటుందేమో! భావవాదాశ్రిత తెలుగు కవులంతా ఇంచుమించు దైవప్రేరణతోనే కవిత్వం రాసినట్లు చెప్పుకున్నారు. అందులో కవయిత్రులు కూడా ఉన్నారు. మొల్ల (క్రీ. శ. 16 శతాబ్ది) గోపవరపు శ్రీకంఠమల్లేశ్వరుని వరం వల్ల కవిత్వాన్ని చెప్తున్నానని ప్రకటించింది. అలాగే- తరిగొండ వేంగమాంబ కూడా తాను గురువుల దగ్గర విద్యాభ్యాసం చేయలేదనీ, నృసింహస్వామి వరం వల్లనే తాను కవిత్వం చెప్పగలుగుతున్నానని "వేంకటాచల మాహాత్మ్యం"లో చెప్పుకుంది. ఈ దృష్టితో తరిగొండవేంగమాంబ కవితా వైశిష్ట్యాన్ని వివరించే ప్రయత్నం చేస్తాను.

మాతృశ్రీ తరిగొండవేంగమాంబ గురించి ఈ సదస్సు జరుగుతుంది. అందువల్ల ఇప్పటికే ఈమె జీవిత విశేషాలను వివరించినవారున్నారు. అయితే ఒకవేళ ఈవ్యాసాన్ని మాత్రమే విడిగా చదువుకున్నా ఈమె కవితా వైశిష్ట్యాన్ని గురించి వివరించడానికి వీలుగా ఈమె జీవితరేఖలను సంక్షిప్తంగా వివరిస్తాను.

శ్రీకానాల కృష్ణయ్య, శ్రీమతిమంగమాంబ దంపతులకు లేకలేక పుట్టిన బిడ్డే వెంగమ్మ. ఈమె పేరే తర్వాత కాలంలో వెంగమాంబగా, తరిగొండ వేంగమాంబగా ప్రసిద్ధిచెందింది. ఈమె క్రీ. శ. 1730-35 ప్రాంతంలో జన్మించి, క్రీ. శ. 1817లో మరణించిందని ఆమె రచనలపై పరిశోధన చేసిన ఆచార్య కె. జె. కృష్ణమూర్తి (మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ కృతుల పరిశీలనము, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి, 2008, తొలిప్రచురణ: 1983) అభిప్రాయపడ్డారు. అంతేకాకుండా "తెలుగు మీరాబాయి" గాను, (అదే, పుట:11) ప్రహ్లాదుని

అవతారంగాను (పుట:14) ఆమెను కృష్ణమూర్తిగారు అభివర్ణించారు. వేంగమాంబ గురించి కృష్ణమూర్తిగారి పరిశోధనలో కింది విషయాలు స్పష్టమవుతున్నాయి. ఆంజనేయుని సన్నిధిలో కూర్చొని తిరుపతి వేంకటేశ్వరస్వామిని ధ్యానించేది. (పుట:17), వేంకటేశ్వరస్వామి తనకు ప్రత్యక్షమై తనను తిరుపతి రమ్మన్నట్లు భావించి, తిరుపతి వెళ్ళిపోయింది. తిరుపతిలో తూర్పు మాడవీధి చివర పూరిగుడిసెను ఆమె నివాసానికి ఇవ్వడంతో పాటు స్వామివారి పాకశాల నుండి వకుళామాలిక పేరుతో పడిభియ్యాన్ని పంపేవారు (పుట:17).

తిరుపతిలో శ్రీవేంకటేశ్వరక్షేత్రంలోనే ఉంటూ భక్తిరచనలు చేస్తున్న ఈమె భక్తితత్పరతను, మాహాత్మ్యాన్నీ, నిష్ఠనూ గమనించిన తాళ్ళపాకపెదతిరుమలాచార్యుల వంశీయులు ఉత్తరమాడవీధిలో తమ గృహానికి దగ్గర్లోనే చిన్న యిల్లునిచ్చారు. తాళ్ళపాక వంశీయులతో పరిచయం ఏర్పడ్డం వల్ల వారి రచనల ప్రభావం వేంగమాంబ రచనలపై పడింది. ఇది తాళ్ళపాక తిమ్మక్క రాసిన *"సుభద్రాకళ్యాణం"* కావ్యాన్నీ, వేంగమాంబ రాసిన *"రమాపరిణయం"* (ద్విపదకావ్యం)లను తులనాత్మకంగా పరిశీలిస్తే తెలుస్తుంది. తిరుమలలో ఉండగా పక్క ఇంటి వారి బాధ పడలేక తుంబురుకోన వెళ్ళి కొన్నాళ్ళు అక్కడ తపస్సు చేసుకొని, అక్కడే తనువు చాలించిందని, అక్కడ ఉండగానే "చెంచునాటకం" అనే యక్షగానం రాసిందని కొంతమంది అభిప్రాయపడుతున్నారు.

మరికొంతమంది కథనం ప్రకారం తుంబురుకోన నుండి మళ్ళీ ఈమె మాహాత్మ్యాన్ని తెలుసుకొని ప్రజలు తిరుమలకు తీసుకొచ్చారనీ, ఈమెకు అక్కడ మళ్ళీ సంప్రదాయ పూజారి వర్గం నుండి హేళనలు ఎదురైయ్యాయని చెప్తారు. స్వామివారికి సాయంత్రం ఏకాంతసేవానంతరం కర్పూరహారతిని వేంగమాంబ అందించేదనీ ఐతిహ్యం. అయితే, సనాతన పూజారులు ఈమెను హేళన చేసేవారనీ అందువల్ల ఒకరోజు గృహంలోనే ఈమె ఉండిపోతే, ఆ ఇంటిదగ్గరకొచ్చేసరికి ఇక స్వామివారి రథం కదల్లేదనీ, దానితో ఈమె వచ్చి హారతి ఇచ్చిన తర్వాతనే రథం కదిలిందనీ చెప్తారు. స్వామివారికి వేంగమాంబ చేసే కర్పూరహారతి ఫలితంగానే నేటికీ "ముత్యాలహారతి", "తరిగొండవారి హారతి" పేర్లతో ఆ సేవ కొనసాగుతుందని జనశ్రుతి (పుట: 25). తన పుట్టిన ఊరులోని కులదైవం తరిగొండలక్ష్మీనృసింహస్వామి వారితో తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారిని అభేదభావంతో పూజించడమే కాకుండా, ప్రతియేడాదీ వైశాఖ శుద్ధ చతుర్దశినాటి నుండి పదిరోజుల పాటు నృసింహ జయంతిని

జరిపించేదని (పుట:25) కూడా పరిశోధనలు వివరిస్తున్నాయి. ఇన్ని విశిష్టతలు గల వేంగమాంబ కవిత్వాన్ని కేవలం వ్యాకరణాది అంశాలతో పరిశీలించడం కంటే ఆధ్యాత్మిక సౌందర్య దృష్టికోణం నుండి ఈమె కవితాసౌందర్యాన్ని వివరించుకోవాలి.

*"నా చిననాట నోనామాలు నైన నా*
*చార్యుల చెంత నేజదువలేదు*
*పరుగు ఛందస్సులో బది బద్యములనైన*
*నిక్కంబుగా నేను నేరలేదు*
*లలి కావ్య నాటకాలంకారశాస్త్రముల్*
*వీనులైనను వినగలేదు*
*పూర్వేతిహాస విస్ఫురితాంధ్ర సత్కృతుల్*
*శోధించి వరుసగ జూడలేదు*
*చేరి తరికుండపురి నారసింహదేవు*
*డానతిచ్చిన రీతిగ నే నిమిత్త*
*మాత్రమున బల్కుదును స్వసామర్థ్య మివ్వ*
*దరయ నించుక మేని నాయందు లేదు"*

అని శ్రీవేంకటాచల మాహాత్మ్యము, (1. అ 21 వ)' లో స్పష్టంగా వేంగమాంబ రాసుకుంది. భక్తిపారవశ్యంతో వర్ణించినప్పటికీ వేంగమాంబ తన రచనల్లో శృంగార వర్ణనలకు దూరంగానే ఉంది. వేంగమాంబ మొత్తం పద్దెనిమిదికృతులను రాసినట్లు పరిశోధకులు వివరించారు. ఆ రచనలు కొన్నింటిలో యోగశాస్త్రాంశాలను కూడా వేంగమాంబ వివరించింది. *రాజయోగసారము, రమాపరిణయము, వేంకటాచల మాహాత్మ్యము, వాసిష్ఠ రామాయణము* అనే రచనలన్నీ వస్తుతత్త్వాన్ని బట్టి చూస్తే ఆధ్యాత్మికకావ్యాలని పరిశోధకులు వర్గీకరించారు (కృష్ణమూర్తి, 2008: 72). వీటితో పాటు ఈమెరాసిన తత్త్వకీర్తనలు కూడా ఈ వర్గానికే చెందుతాయి. ఈమె ఇతర రచనల్లో వేదాంతంతో కూడిన భక్తితత్పరత వ్యక్తమవుతుంది. *తరిగొండ నృసింహ శతకము*లో "వితరణముగా మీరిపుడు వేడ్కను వాక్కునిచ్చినంతలో శతకముగా చెప్పెదను సద్గురుస్వామి కటాక్షమేర్పడన్" అని అనడంలో కూడా ఆమె భగవంతుని కృపతోనే కవిత్వం చెప్తున్నట్లు స్పష్టమవుతుంది. ఇదంతా "అతులితమైన మీ పదవినందున్ తలచి" రాస్తున్నట్లు ఆ శతకాన్ని వర్ణించింది. మోక్షాన్ని ఆశించి రాసిన రచన ఇది. దీనిలో మరొక పద్యంలో వేదాంతాన్ని మార్మికంగా వర్ణించి

'హంస'ను గుర్తించమంటుంది వేంగమాంబ.

*"కొలకుల మధ్యమందునొక కోమలియున్నది దానిలోపలన్*
*సలలిత వహ్నిమండలము చంద్రదివాకరమండలంబులున్*
*అలవడ నాఱు చక్రములకావల నందొక సారసంబులోన్*
*కులుకుచు నుండు హంస తరిగొండ నృసింహా! దయాపయోనిధీ!!"*

(తరిగొండనృసింహశతకము, 47 పద్యం)

ఈ పద్యంలో 'యోగసారాంశం' అంతా నిక్షిప్తం చేసినట్లు వర్ణించింది. మోక్షానికి గల వివిధ దశలను అన్వేషించుకుంటూపోతే గాని మోక్షమనే హంసను చేరుకోలేమంటుంది. తిరుమల వెళ్ళిన తర్వాత రాసిన తొలి కావ్యంగా "పారిజాతాపహరణము"ను పరిశోధకులు పేర్కొంటున్నారు. దీనికే "విష్ణు పారిజాతము" అనే నామాంతరం కూడా ఉంది. అలాగే ప్రాచుర్యంలోకి వచ్చింది. మొల్ల వర్ణించిన శ్రీరాముని వర్ణనలాగే వేంగమాంబ ఈ కృతిలో ఒకపద్యంలో శ్రీకృష్ణుణ్ణి వర్ణించింది.

*"నీలనీరదమునుబోలు దేహమువాడు*
*రమణీయహేమాంబరంబు వాడు*
*తేటైన పింఛ కిరీటము గలవాడు*
*నవరత్నమయభూషణముల వాడు*
*వనమాలికాయుక్త వక్షస్థలము వాడు*
*ముసిముసి నవ్వుల మోమువాడు*
*కమలోపంబులౌ కన్నులు గలవాడు*
*చొక్కించి కాంతల జూచువాడు*
*మోహనంబైన ముద్దు కెమ్మోవి వాడు*
*చెల్వమ్మున వేణునాదమ్ము జేయువాడు*
*ధీరుడై యెప్పు డిచ్చట తిరుగు వాడు*
*జూటు విటకాడు నన్నేలు నీటుకాడు"*

ఈ పద్యంలో శ్రీకృష్ణుని స్వరూపం మన కళ్ళముందు సాక్షాత్కరించేలా వర్ణించింది కవయిత్రి. అయితే, దీన్ని చదువుతుంటే చాలా మందికి మొల్ల రాసిన రామాయణంలోని శ్రీరాముని వర్ణన గుర్తుకు రావడం సహజం. దీన్ని ఆ పద్యానికి అనుకరణగానే వేంగమాంబపై పరిశోధన చేసిన కృష్ణమూర్తి పేర్కొన్నా (పుట: 120),

'సంవాదిన్యో మేధావినా బుద్ధయ:" అనే పెద్దల మాటను బట్టి ఒకేరకమైన ఆలోచనలు మేధావులైన వారికి కలగవచ్చు కూడా. ఒకవేళ నిజంగా మొల్ల పద్యాన్నే అనుకరిరంచినప్పటికీ వేంగమాంబ కవిత్వానికి అది సుగుణమే అవుతుంది.

తన జీవితమంతా దైవసన్నిధిలోనే గడిపిన వేంగమాంబ, తన ప్రతి పదం, పద్యం, కావ్యం అన్నీ భగత్ తత్త్వాన్ని ప్రతిపాదించేవిధంగానే వర్ణించింది. ఈమె రచనలను చదువుకొనేవాళ్ళు భగవంతునితా ఈమె పొందిన తాదాత్మ్య స్థితితో మమేకం కావడానికి ఉపయోగపడతాయి. ఆ దిశగానే ఆమె భవ్యకవితావేశాన్నిఅర్థం చేసుకోవాలి. అందువల్ల వేంగమాంబ భగత్సన్నిధిని తన కవితాసాధనంగా మార్చుకుందని, అదే ఈమె కవితా వైశిష్ట్యమని గుర్తిస్తే బాగుంటుందేమో!

**ఆధారాలు:**

కె. జె. కృష్ణమూర్తి, మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ కృతుల పరిశీలనము, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి, 2008, తొలిప్రచురణ:1983

***(మాతృశ్రీ తరిగొండవేంగమాంబ సాహితీవైభవం-2013 (జాతీయసదస్సు సంచిక, ప్రచురణ, సిల్వర్ జూబ్లీ కళాశాల, కర్నూలు.***

# గురజాడ కవిత్వం-సంస్కరణ దృక్పథం

గురజాడ అప్పారావు (1862-1915) జననం తెలుగుసాహిత్యానికి అరుణోదయం వంటిదనీ, కందుకూరి సాంఘిక విప్లవాన్నీ, గిడుగు భాషావిప్లవాన్నీ తనలో సమన్వయించుకొని, సరికొత్త సాహిత్య విప్లవాన్ని లేవనెత్తిన నవయుగవైతాళికుడని విమర్శకుల (సినారె, 1989:195 ) అభిప్రాయం. గురజాడ రాసిన రచనలకంటే, ఆయనసాహిత్యంపై వచ్చిన విమర్శలు, పరిశోధనల పుటలే ఎక్కువగా ఉంటాయంటే అతిశయోక్తి కాదేమో. ఇంచుమించు ప్రతి ప్రముఖ తెలుగుసాహితీవేత్తా ఏదొకసందర్భంలో గురజాడ సాహిత్యాన్ని ప్రస్తావించకుండా ఉండరనుకుంటున్నాను. ఆయన రచనల్లో ప్రస్తావించిన సమస్యల ప్రభావం అటువంటిది.

గురజాడ పుట్టకముందునుండే మనదేశంలోను, మనరాష్ట్రంలోను సంస్కరించుకోవాల్సిన అనేక సమస్యలున్నాయి. పాలకులు, వారినాశ్రయించుకొని సృజనసాహిత్యాన్ని సృష్టించినవాళ్ళూ వర్ణాశ్రమధర్మాలపేరుతోవాటిని అవిచ్ఛిన్నంగా కొనసాగిస్తూనే వచ్చారు. తెలుగుసాహిత్యం వరకే చూసినా కుల, మతాల ప్రస్తావన లేకుండా సాహిత్య సృజనజరగలేదు. శివకవులు, అన్నమయ్య, వీరబ్రహ్మేంద్రస్వామి, వేమన వంటివాళ్ళు సాహిత్యంలో కొన్ని ఆధిపత్యధోరణుల్ని ప్రశ్నిస్తూ, సంస్కరణభావాల్ని కోరుకున్నా, అవన్నీ భావవాద పరిధుల్ని దాటే ప్రయత్నం మాత్రం చేయలేదు. వీరిలో వేమనను కొంత భిన్నంగా అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉంది. ఆ భావజాల పరిణామం గురజాడలో మరింత అభ్యుదయస్థాయిలో కనిపిస్తుంది.

సాహిత్య రచన కోసం గురజాడ కేటాయించింది తక్కువసమయమే అయినప్పటికీ ఆయన రాసిన రచనల్లోని భాష, భావజాలాల వల్ల ఆధునిక సాహిత్యానికి యుగకర్త అని ఆయన్ని ప్రశంసించేలా చేశాయి. గురజాడ ఒకవైపు ఆస్థానంలో ఉద్యోగిగా విధులు నిర్వర్తిస్తూనే మరొకవైపు సృజనాత్మకసాహిత్యాన్ని

అందించారు. అయినా ఆయన సాహిత్యం ఇంచుమించు ఆధునిక సాహిత్యానికి మార్గాన్నేర్పరిచిందనవచ్చు. అందుకే చాలామంది ఆయన్ని ఆధునిక సాహిత్యానికి యుగకర్తగా భావిస్తున్నారు. గురజాడరచనా ప్రభావం వల్ల ముందుగా తెలుగుసాహిత్యంలో అభ్యుదయసాహిత్యం రావాల్సి ఉన్నా భావకవిత్వం తర్వాతనే అభ్యుదయకవిత్వం వచ్చింది. అంటే అప్పటికింకా సంప్రదాయసాహిత్య ప్రభావం గాఢంగానే ఉంది. అందువల్లనే కొన్ని మార్పులతో భావకవిత్వం రాగలిగింది. దానిలో కొద్దిగా భావనవ్యత కనిపించినా, రూపంలో పద్యసంప్రదాయమే అత్యధికంగా కనిపిస్తుంది. దీన్ని రాయప్రోలు, నాయని తదితరుల సాహిత్యంలో చూడొచ్చు. పాశ్చాత్య ప్రభావం భావకవిత్వంపై ఉన్నా, అది కూడా పరోక్షంగా అనువాదరచనలుగానే కొనసాగింది. కానీ, గురజాడ సృజనాత్మకరచనాప్రభావం వచనరచనల సృష్టికి, తద్వారా సాహిత్యంలో వాస్తవికతకు మార్గాన్నేర్పరిచింది. ఇది తెలుగు సాహిత్యపరిణామంలో గురజాడ రచనల వల్ల వచ్చిన సాహిత్య సంస్కరణ. గురజాడ పేరు చెప్పగానే కన్యాశుల్కం (1892) నాటకాన్ని విస్మరించలేం. అందులో భాషావిప్లవంతో పాటు అనేకాంశాలు చర్చలోకి వచ్చాయి. అవన్నీ ప్రత్యక్షంగా సామాన్య ప్రజలందరికీ చెందకపోయినా, దాని ప్రభావం వల్ల తర్వాత వచ్చిన సాహిత్యంలో సామాన్య ప్రజల్ని వస్తువులుగా స్వీకరించడానికి కారణమైంది.

గురజాడ చేపట్టిన ఏ సాహిత్యప్రక్రియల్ని తీసుకున్నా సంస్కరణ భావజాలం స్పష్టంగా కనిపిస్తుంది. ఆంగ్ల కవిత్వం, సంప్రదాయప్రభావ కవిత్వం, సంస్కరణాత్మకభావజాల కవిత్వంగా గురజాడ కవిత్వాన్ని మూడురకాలుగా విభజించుకునేవీలుంది. కుక్క, *చంద్రహాస, సారంగధర* మొదలైనవన్నీ గురజాడ ఆంగ్లంలో రాసినవి. వీటిలో *సారంగధర* (1883) మాత్రమే లభిస్తుంది. దీన్ని ముత్యాలసరాల ఛందస్సులోనే రాంభట్ల కృష్ణమూర్తి తెలుగులోకి అనువదించారు. గురజాడకు సంప్రదాయకవిత్వం రాయడం చేతకాక దానికి భిన్నమైన కవిత్వం రాస్తున్నారనే ప్రచారాన్ని తిప్పికొట్టడానికి *'సుభద్ర'* కావ్యాన్ని సంప్రదాయపద్ధతిలో రాశారని (సెట్టి ఈశ్వరరావు, *గురజాడరచనలు*, కవితల సంపుటం, 1991: 120 (వి. వి. తొలి ప్రచురణ, 1984) పరిశోధకుల అభిప్రాయం. కవిత్వంలో ఇవన్నీ గురజాడ ప్రతిభాపాటవాల్ని తెలిపే ఒకపార్శ్వాన్ని చూపిస్తుంటే మిగతా కవిత్వమంతా ప్రధానంగా ఆయనలోని అభ్యుదయ భావజాలాన్ని వెల్లడిస్తుంది. అభ్యుదయభావాల్లో సంస్కరణభావజాలం ఒకటి. తనకాలం నాటి సమాజంలో ఉన్న సనాతనభావజాలం వల్ల అత్యధిక సంఖ్యలో

ఉండి కూడా బలహీనవర్గాలై జీవిస్తున్న వారిపక్షాన నిలబడి, వారి అభ్యున్నతికోసం తనకున్న పరిధిలో సాహిత్య సృజనచేయడం గొప్ప విషయంగానే భావించాలి. ఈ విషయంలో ప్రతిరచయితకున్నట్లే గురజాడకు కూడా కొన్ని పరిధులు, పరిమితులు ఉన్నాయనీ గుర్తించాలి. సంఘ సంస్కరణ భావాలు: వ్యవస్థలో కొన్ని లోపాలుగా కనిపించేవాటిని సరిదిద్దడమే సంస్కరణ. అది సమాజంలో వివిధ రకాలుగా కనిపిస్తాయి. అవి మతం, కులం, లింగం, ప్రాంతం, భాష మొదలైన పేర్లతో జరిగే ఆధిక్యతగానో, అణచివేతగానో ఉండవచ్చు. వీటి వల్ల కష్టనష్టాలను వివరించి, వాటిని సరిదిద్దడమే సంఘసంస్కరణ అని పిలవవచ్చు. ఈ సంఘసంస్కరణోద్యమంలో తెలుగుసాహితీవేత్తలు కూడా తమ రచనల ద్వారా పాలుపంచుకున్నారు. అలాంటి వారిలో కందుకూరి వీరేశలింగం, గిడుగు రామ్మూర్తి తదితరులతో పాటు గురజాడ కృషి ఎంతగానో ఉంది. సమాజంలో వస్తున్న మార్పుల్ని గుర్తించడమే కాకుండా, ఆ మార్పుల్ని వేగవంతం చేశాడని విమర్శకులు (డి. చంద్రశేఖరరెడ్డి, సంఘసంస్కరణ కవిత్వం, రజతోత్సవసంచిక, 43:1988) అన్నారు.

## కులాధిక్యతను నిరసించడం:

వర్ణం, కులం వేర్వేరు అర్థాల్లో తీసుకునే అవకాశం ఉన్నా, మన తెలుగు సాహిత్యంలో ఈ రెండింటినీ పెద్దవ్యత్యాసంతో ప్రయోగించలేదు. గురజాడ అప్పారావు వర్ణాధిక్యతను నిరసించడమంటే, కులాధిక్యతను నిరసించడంగానే భావించాలి. కులభేదాలు ఉండకూడదనేది గురజాడ దృష్టి. అక్కడితో ఆగిపోకుండా, కులాంతర వివాహాలు చేసుకోవడం ద్వారా కులభేదాలు లేకుండా కలిసి మెలిసి జీవించవచ్చనే ఆలోచన కూడా గురజాడలో కనిపిస్తుంది. దీన్ని సమన్వయిస్తూ 'లవణరాజుకల' (1911) కథాగేయాన్ని రాశారు. లవణరాజుకథకు మూలం *వాశిష్ఠరామాయణం.* అందులో తాత్త్వికార్థంలో లవణరాజుకథ కనిపిస్తుంది. (సినారె, 1989:235-240) గురజాడ దీన్ని సమకాలీన సమాజాన్ని ప్రతిఫలించేటట్లు సంస్కరణభావాలతో లౌకికార్థంలో వర్ణించారు. క్రీ.శ. 18, 19 శతాబ్దాలు భారతదేశంలో దళితులకు ఉష: కిరణాలు ప్రసరించిన కాలాలు. ఇటువంటి భావాలనే ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగానైనా గురజాడ తనకవిత్వంలో వర్ణించారు.

***"వెలుగునీటను గ్రుంకె చుక్కలు***
***చదల చీకటి కదలబారెను;***

*యెక్కడనొ ఒకచెట్టుచాటున*
*నొక్క కోకిల పలుకసాగెను*
*మేలుకొలుపుల కోడికూసెను*
*విరులు కన్నులు విచ్చి చూసెను;*
*ఉండి, ఉడిగియు, ఆకులాడగ*

కొసరెనోయన గాలివీచెను" (ముత్యాలసరాలు) దీన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే, చుక్కలు అస్తమించడం, చీకటివెళ్ళిపోవడం మొదలవడంతోపాటు మేలుకొలుపుల కోడి కూసిందట! ఇది దళితుల కోసమేనని ప్రత్యక్షంగా చెప్పకపోయినా, వారికి రాబోయే కొత్తవెలుగులలోకాన్ని ప్రవచిస్తున్నట్లుగానే ఉంది. గాంధీజీ హరిజనోద్ధరణను ప్రారంభించకముందే గురజాడ 'లవణరాజుకల' (1911) లో వర్ణధర్మం అధర్మ ధర్మం' అన్నారు.

*"మలినదేహుల మాలలనుచును*
*మలినచిత్తుల కధిక కులముల*
*నెలవొసంగిన వర్ణ ధర్మమ*
*ధర్మ ధర్మంబే"*
*"మంచిచెడ్డల మనుజులందున*
*ఎంచిచూడగ రెండె కులములు*
*మంచియన్నది మాలయైతే*
*మాలనే అగుదున్"*

గురజాడ మతాన్ని ప్రేమించడం కంటే, మనిషిని ప్రేమించాలనే బోధించారు. 1909 మే 21 వతేదీన మునిసుబ్రహ్మణ్యం గారికి రాసిన లేఖలో మానవుని ప్రేమించటమే గొప్పప్రేమ అని తన అభిప్రాయాన్ని తెలిపారు. దీనిలో మంచియన్నది మాలయైతే అనే పాదాల్ని దళితసాహితీవేత్తలు (కత్తి పద్మారావు,) వ్యాఖ్యానిస్తూ గురజాడ దళితులతో మమేకం కాలేకపోయాడనే భావాన్ని వ్యక్తం చేశారు. కానీ, "మంచి అయితేనేమాలను అవుతాననేది" గురజాడ ఉద్దేశం కాకపోచ్చు. మతసంస్కరణకాదు, మతం నశిస్తుందనే విప్లవభావాలు "మనిషి" అనే గేయంలో–

*'మనిషి చేసే రాయి రప్పకి*
*మహిమ కలదని సాగి మొక్కుతు*
*మనుషులంటే రాయిరప్పల*

***కన్న కనిష్టం***
***గాను చూస్తావేల బేలా?***
***దేవుడెక్కడో దాగెనంటూ***
***కొండకోనల వెతుకులాడే***
***వేలా?"***

అని ప్రశ్నించడంలో గురజాడ మతం మానవుల మధ్య సహృదయవాతావరణాన్ని పెంచేలా ఉండాలి తప్ప, ఆధిక్యాన్ని ప్రదర్శించేలా ఉండకూడదనే ఉదాత్త భావాలున్నాయి. "ముత్యాలసరములు" లో –

***"యెల్లలోకములొక్క యిల్లై***
***వర్ణభేదము లెల్ల కల్లై***
***వేల నెరుగని ప్రేమబంధము***
***వేడుకలు కురియ...***
***మతములన్నియు మాసిపోవును...***
***జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును"***

అని ప్రవచించారు. మతాలన్నీ మాసిపోవడమనేది సామాన్యమైన మాటకాదు. అది ఏ మతమైనా మతం మత్తువంటిదే. మనిషిని భౌతికదృష్టికి అతీతం చేస్తుంది. ఈలోకంలో భౌతిక అవసరాలన్నీ తాత్కాలికాలనీ, శాశ్వతమైనవన్నీ మరోలోకంలో ఉంటాయని భావవాద దృష్టిని అలవాటు చేస్తుంది. ఇది క్రమేపీ మూఢత్వం వైపు పయనించేటట్లు చేస్తుంది. శాస్త్రీయతను నిరాకరించి, దానికి కూడా దైవమే కారణమంటుంది. దైవం, మతం పేరుతో ప్రజల్ని మూఢత్వం వైపు నడిపిస్తూ యుగయుగాలుగా కొన్నివర్గాల వాళ్ళు దోపిడీచేస్తున్నారు. ఈ దోపిడీ నుండి బయటపడాలంటే మతం పేరుతో జరిగే మూఢత్వం పోవాలి. అది శాస్త్రసాంకేతిక విజ్ఞానం వల్లనే సాధ్యమౌతుంది. అది భవిష్యత్తులో జరిగి తీరుతుందనీ, అప్పుడు మతం మాసిపోతుందని ప్రజలు నిజమైన మనుషులుగా జీవించే కాలం ఒకటి వస్తుందని ఆకాంక్షించాడు గురజాడ. అందుకనే 'గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్" అనకుండా ' రాబోయేకాలమే గొప్పదనే స్పృహను కల్గించడంలో ఆశావహ, అభ్యుదయ దృక్పథం కనిపిస్తుంది.

గురజాడ ఈ భావాలన్నీ కేవలం నినాదాలుగానో, నిస్సారంగానో చెప్పలేదు. గొప్పకళాత్మకంగా, సత్యనిష్ఠతో అందరికీ అనుభవంలోకి వచ్చేటట్లు వర్ణించారు.

అందుకనే "*గురజాడ తన కాలానికన్నా చాలా ముందున్నవారు. గిడుగువారి వ్యావహారిక వాదాన్నీ, కందుకూరి, రఘుపతిగారల సంఘసంస్కరణ దీక్షనూ జీర్ణించుకొని గేయం, కథానిక, నాటకం ఇత్యాది ఎన్నోసాహిత్య ప్రక్రియలను పండించాడని, ఈయనలో కాల్పనికత, వాస్తవికత రెండూ రెండుపాయలుగా సంగమించాయని, సమకాలీన సమాజాన్ని సవిమర్శకంగానూ, సృజనాత్మకంగానూ, కళాత్మకంగానూ, వాస్తవికతను ఆధారంగా చేసుకొని సౌందర్యవిలువలను కాపాడుకొంటూ సాహిత్య సృష్టిచేశాడని విమర్శకులు* (కంచెనపల్లి చినవెంకటరామారావు, 2005:74, తొలిముద్రణ, 1982)) వ్యాఖ్యానించారు.

**ఆధారగ్రంథాలు:**


1. ఈశ్వరరావు, సెట్టి. *గురజాడరచనలు (*కవితల సంపుటం), హైదరాబాద్: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1991. (తొలి ప్రచురణ, 1984)
2. చంద్రశేఖరరెడ్డి, డి. *సంఘసంస్కరణ కవిత్వం (వ్యాసం), రజత రంజని (ఈశతాబ్ది సాహిత్య దర్పణం).* కె. కె. మీనన్. (సంపా). హైదరాబాద్: రంజని రజతోత్సవ సంఘం, 1988.
3. చిన వెంకట రామారావు, కంచెనపల్లి. *ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్నధోరణులు.* (సంపా) కె. కె. రంగనాథాచార్యులు. హైదరాబాద్: ఆంధ్రసారస్వత పరిషత్తు, 2005. తొలిముద్రణ, 1982.
4. చిన్నారావు, యాగాటి. *దళిత ఉద్యమ చరిత్ర (1900-1950).* (తెలుగు అనువాదం: ప్రభాకర్ మందార). హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 2007.
5. నారాయణ రెడ్డి, సి. *ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు: ప్రయోగములు.* హైదరాబాద్: విశాలాంధ్ర పబ్లిషింగ్ 1989. (తొలిముద్రణ, 1967)
6. శాంసన్, పిల్లి. *దళితసాహిత్య చరిత్ర.* గుంటూరు: స్వీయ ప్రచురణ, 2000.
7. *ప్రజాసాహితి (మాసపత్రిక), గురజాడ 150వ జయంతి ప్రత్యేక సంచిక* (ఆగస్టు -సెప్టెంబరు, 2012), విజయవాడ: జనసాహితి, 2012.


***

***(తెలుగు అధ్యయన శాఖ, కాకతీయవిశ్వవిద్యాలయం, వరంగల్లు వారు 15-09-2012 వ తేదీన నిర్వహించిన "గురజాడ జీవిత దృక్పథం - సాహిత్యం" అనే జాతీయ సదస్సులో సమర్పించిన పత్రం)***

# గుర్రం జాషువా జీవితం–సాహిత్యం

ఆధునిక ప్రసిద్ధ తెలుగుకవుల్లో జాషువా ఒకరు. ఆయన అసలు పేరు "జాషువ" అయినప్పటికీ, ఉచ్ఛారణా సౌలభ్యం కోసం "జాషువా" అని పిలుస్తుంటారు. ఆయన తన పేరుని "జాషువ"అనే రాసుకునేవాడు. భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందు పుట్టిన జాషువా, స్వాతంత్ర్యానికి ముందూ, స్వాతంత్ర్యానంతర పరిస్థితులను కూడా గమనించినవాడు. సమాజం తక్కువ కులంగా భావించే మాదిగ కులంలో పుట్టినందువల్ల, కుల, మత వివక్షలను రెండింటినీ అనుభవించిన కవి. ఈ రెండు వివక్షలూ తోడైతే పేదరికం సహజంగానే తాండవిస్తుండటం వల్ల జాషువా పేదరికాన్ని అనుభవించాడు. కులం, పేదరికం రెండింటినీ ఎదుర్కొన్నా, అవి తన జీవితంలో సహనాన్ని పెంచాయంటాడు. భారతదేశంలో ప్రవేశించిన క్రైస్తవం పేదలను, కులవివక్షను ఎదుర్కొంటున్న వాళ్ళనీ దగ్గరకు చేర్చుకోవడం వల్ల జాషువా కుటుంబం కూడా క్రైస్తవానికి దగ్గరై చదువుకొని, ఉపాధ్యాయుడిగా ఉద్యోగం చేశాడు. అయితే కాలక్రమంలో క్రైస్తవంలో కనిపించే వివక్షను కూడా ఆయన ప్రశ్నించిన హేతువాదిగా కూడా కనిపిస్తాడు.

జాషువా జీవించిన కాలం నాటి హిందు, క్రైస్తవమత సమాజాల్లోని అనేకలోపాల్ని తన రచనల్లో వర్ణించాడు. తాను గమనించిన సమకాలీన సమాజాన్ని తన కవిత్వంలో భద్రపరచగలిగాడు. పుట్టిన కులం వల్ల వివక్షను ఎదుర్కొన్నా, ఆదరించిన క్రైస్తవ మతాధిక్యాన్ని నిరూపించాలనే అత్యుత్సాహంతో గానీ, ఇతర కులాలను, ఇతర మతాలను ద్వేషించాలనీ గానీ అనుకోలేదు. తాను పుట్టి పెరిగిన కుల, మతాలకు చెందకపోయినా మానవత్వాన్ని ప్రబోధించినవాళ్ళందరినీ తన కావ్యాల్లో వర్ణించాడు. దేశానికి స్వాతంత్ర్య సారథిగా గాంధీజీని అభివర్ణించాడు. దేశభక్తులుగా నేతాజీ, జిన్నా మొదలైనవారిని కీర్తించాడు. దేశాన్నీ, రాష్ట్రాన్నీ ప్రశంసిస్తూ అనేక పద్యాల్లో

వర్ణించాడు. కుల, మతాల వల్ల వివక్షను ఎదుర్కొన్నా, పేదరికం వెంటాడినా వాటన్నింటినీ జయిస్తూ విశ్వమానవుడిగా ఎదగడమెలాగో తన సాహిత్యం ద్వారా వివరించిన గొప్పసాహితీవేత్తగా ప్రసిద్ధిపొందాడు.

## జీవితం - తల్లిదండ్రుల వారసత్వం

గుర్రం వీరయ్య, లింగమాంబలకు 1895 సెప్టెంబరు 28వతేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని గుంటూరుజిల్లా వినుకొండలో జాషువా జన్మించాడు ఆయన పుట్టిన తేదీ విషయంలో సాహితీవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. జాషువా అక్టోబరు 28వ తేదీన జన్మించారని కొంతమంది, సెప్టెంబరు 28 అని మరికొంతమంది అభిప్రాయపడ్డారు. మధునాపంతుల సత్యనారాయణ, తిరుమలరామచంద్ర, మలయశ్రీ మొదలైనవారు జాషువా అక్టోబరులో జన్మించాడనీ, దివాకర్ల వేంకటావధాని, ఎండ్లూరి సుధాకర్, హేమలతా లవణం మొదలైన వారు జాషువా సెప్టెంబరులో జన్మించాడనీ పేర్కొన్నారు. దీన్ని చర్చి రికార్డులు, ఇతర ఆధారాలతో ఎండ్లూరి సుధాకర్ జాషువా స్వీయకథ "నాకథ" పై చేసిన పరిశోధనలో జాషువా పుట్టిన నెల అక్టోబరు కాదనీ, సెప్టెంబరు అవుతుందనీ నిర్ణయించారు.

జాషువా తల్లి మాదిగ కులానికి చెందినామె. ఈ కులస్థుల కంటే కొంచెం అగ్రవర్ణంగా భావించే యాదవకులానికి చెందినవాడు తండ్రి వీరయ్య. వీరి కులంతో పాటు మతాలు కూడా వేర్వేరు. తల్లి క్రైస్తవురాలు, తండ్రి హిందువుడు. విచిత్రమేమిటంటే నాటి మాదిగల కుల కట్టుబాట్లు వల్ల గానీ, పెళ్ళిచేసుకొని వదిలేయకుండా సామాజిక భద్రతకోసం గానీ వీరయ్యను క్రైస్తవమతాచారాల ప్రకారమే లింగమాంబను వివాహం చేసుకోవాలని కులపెద్దలు పట్టుబట్టారు. లింగమాంబపై గల ప్రేమానురాగాల వల్ల హిందూసమాజం నుండి బయటపడి, క్రైస్తవుడిగా బాప్తిజం పొంది ఆమెను క్రైస్తవాచారాల ప్రకారమే వివాహం చేసుకున్నాడు. ఈ వివాహం జరిగేనాటికి భారతదేశం కుల, మత వివక్షలతో అట్టుడికిపోతోంది. కానీ, అప్పటికే జోతిరావు పూలే (1827-1890) ఇ. వి. రామ స్వామినాయకర్ (1879-1973), స్వామినారాయణ గురు (1855-1928), డా. బి. ఆర్. అంబేద్కర్ (1891-1956) మొదలైన వారి భావాలు భారతీయ సమాజంలో కొత్త ఆలోచనలు రేకెత్తిస్తున్నాయి. వీటితోపాటు ఆంధ్రప్రదేశ్ లో సంఘసంస్కరణలు జరుగుతున్నాయి. గుర్రం వీరయ్యపై ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈ భావాల ప్రభావం కూడా తోడై

కుల, మతాంతర వివాహం చేసుకొనేలా ప్రేరేపించి ఉండొచ్చుని పరిశోధకుల అభిప్రాయం జాషువా సాహిత్యనేపథ్యానికి ఈ ఉద్యమాల ప్రభావం ఉండే అవకాశం ఉందని విమర్శకులు కూడా వ్యాఖ్యానించారు.

## సమాజంలో క్రైస్తవమతప్రభావం:

జాషువా తండ్రి హిందువైనప్పటికీ, నాటి సమాజం ఆయన్ని కుల బాహ్యుడిగానే పరిగణించింది. భారతదేశంలో అప్పుడప్పుడే విస్తరిస్తున్న క్రైస్తవమతం ముందుగా బ్రాహ్మణకుటుంబాల వారినే క్రైస్తవులుగా చేసినప్పటికీ తక్కువకులాలుగా భావించే వారినే క్రైస్తవం అత్యధికంగా ఆకర్షించింది. తమని మనుషులుగా గుర్తించి, ప్రేమాభిమానాలతో ఆదరించిందని భావించిన చాలామంది మాల, మాదిగ తదితర కిందికులాలుగా పరిగణింపబడేవాళ్ళంతా క్రైస్తవులుగా మారిపోయారు తొలినాళ్ళలో క్రైస్తవ మత ప్రార్థనలు అత్యధికంగా నిమ్నజాతుల వారి మధ్యే జరిగేవని డా. గుజ్జర్లమూడి కృపాచారి తన సిద్ధాంత గ్రంథం “తెలుగు సాహిత్యానికి క్రైస్తవులసేవ”లో వివరించారు.

కింది కులస్థులు, పేదవాళ్ళే అత్యధికంగా క్రైస్తవులుగా మారేవారనడానికి గల కారణాలు ఎమ్మారొషాంబు క్లొ 1899లో రాసిన *while sewing Sandals or Tales of A Telugu Pariah Tribe* పేరుతో రాసిన గ్రంథం లో మరింత వివరంగా కనిపిస్తున్నాయి. దీనిలో 1876-78 సంవత్సరాల్లో ఆంధ్రరాష్ట్రంలో ప్రజలు, ముఖ్యంగా మాల, మాదిగలు క్రైస్తవంలోకి వెళ్ళడానికి గల నాటి పరిస్థితులను వివరించారు. ఆంధ్రప్రాంతంలో తీవ్రమైన కరువు కాటకాల్లో ప్రజలు జీవిస్తున్నారు. మాదిగ, మాలలు మరింత దయనీయమైన స్థితిలో ఉన్నారు. ఈ పరిస్థితుల్లో బకింగ్‌హామ్ కాల్వ నిర్మాణాన్ని ఒంగోలు క్రైస్తవ మిషనరీ కాంట్రాక్ట్ చేపట్టింది. ఆపనులు చేయడానికి వారికి అవకాశం కల్పించి ఆకలి తీర్చడంతో పాటు మానవత్వంతో ఆదరించింది. ఈ ప్రభావాలన్నింటి వల్లా1878 జూలై 3 తారీఖున 2,222 మంది ఒకేరోజు క్రైస్తవులుగా బాప్తిజం పొందారని ఆగ్రంథంలో ఎమ్మారొషాంబు క్లొ పేర్కొన్నారు.

సమాజ పరిస్థితి ఇలా ఉంటే సనాతన హిందువులు తమకోసం మాత్రమే ప్రత్యేకంగా నాటక ప్రదర్శనలను ఏర్పాటు చేసుకొని ఆనందిస్తుండేవారు. ఒకవేళ ఆ నాటకాలను చూడాలనుకుని టిక్కెట్టు కొనుక్కున్నప్పటికీ మాదిగ, మాలలకు

ప్రవేశాన్ని నిరాకరించేవారనీ, ఆ విషయాన్ని తెలియజేయడానికి ముందుగానే ఊళ్ళో దండోరా కూడా వేయించే వారని జాషువా కుమార్తె హేమలతావలణం రాసిన కింది మాటలు స్పష్టం చేస్తున్నాయి. "*ఊరిలో నాటకం వేస్తున్నారు. అంటరానివారికి ప్రవేశం లేదు" అంటూ దప్పువాడు అరచి చెబుతున్నాడు. అయినా చిన్నతనపు కుతూహలం కొద్దీ నాటకశాలకు వెళ్ళి (జాషువా) టిక్కెట్లు కొనబోయాడు. అంతలో ఒకరు నీవు అంటరానివాడివి రాకూడదంటూ ఈసడించారు*" ఈ సంఘటన నాటి దళితుల సామాజిక స్థితికి నిదర్శనంగా నిలుస్తుంది. అటువంటి సంఘటలనల వల్లనే దళితులు అనేకమంది క్రైస్తవులుగా మతమార్పిడులకు గురైయ్యేవారని 1871, 1931 మధ్యకాలంలో మద్రాసు ప్రెసిడెన్సీలో గల తెలుగు ప్రాంతాల వారి గణాంకాలను పరిశీలిస్తే స్పష్టమవుతుంది. 1871లో 29,402 మంది క్రైస్తవులుగా మారితే, ఆ సంఖ్య 1931 నాటికి 6,74,826 మందికి పెరిగింది. వీటిలో మాల, మాదిగలే అత్యధికులు ఉండే అవకాశం ఉంది. అందువల్లనే క్రైస్తవమతాన్ని మాల, మాదిగల మతంగా కూడా పిలిచేవారని తెలుస్తుంది.

## జాషువా జీవితంపై క్రైస్తవ ప్రభావం– కవిత్వాభిలాష:

జాషువా తండ్రి వీరయ్య క్రైస్తవుడిగా జీవితాన్ని ప్రారంభించిన తర్వాత పాస్టరు శిక్షణపొంది, వినుకొండలో పాస్టరుగా పనిచేశాడు. ఆ క్రైస్తవ జీవితం కూడా జాషువాపై తీవ్రంగానే ప్రభావాన్ని చూపింది. ఆ ప్రభావం వల్ల జాషువా తర్వాత కాలంలో "దావీదు చరిత్ర" (1920), క్రీస్తుచరిత్ర (1963) వంటి రచనలను వర్ణించాడు. జాషువా క్రైస్తవ కుటుంబంలో పుట్టి పెరిగినా కేవలం బైబిలు కథలనే కాకుండా భారత, రామాయణాది కావ్యేతివృత్తాలకు సంబంధించిన రచనలనేకం చేశాడు. దీని గురించి జాషువా కూతురు హేమలతా లవణం ఇలా రాశారు "ఆనందం నుండి, దు:ఖం నుండి కవిత వస్తుంది కొందరికి. నాన్నగారి వ్యధిత హృదయం నుండి కవిత్వం పెల్లుబికింది. భావ ప్రకటనకు తనవద్ద తగినంత భాష లేదు. పురాణేతిహాసాలలో తెలుగుభాష వుంది. అది చదవడం ప్రారంభించారు. క్రైస్తవులు ఉగ్రులైనారు. జాషువా హిందువైపోతున్నాడన్నారు. ఆయనపై అభియోగం తెచ్చి చర్చీలలో చర్చకు పెట్టారు మతాధికారులు "జాషువాకి కవిత్వం పట్ల ఆసక్తి, దాన్నిరాయాలంటే పదవిజ్ఞానంతో పాటు, తన భావనాప్రపంచాన్ని విస్తరించుకోవడానికి చేసిన ప్రయత్నంలో భాగంగానే క్రైస్తవేతర సాహిత్యాన్ని

చదివేవాడని హేమలతా లవణం గారి పైనపేర్కొన్న మాటల వల్ల తెలుస్తుంది. ఒకవేళ క్రైస్తవులెవరైనా క్రైస్తవేతర సాహిత్యాన్ని చదివితే ఏదొక నెపంతో వాళ్ళని బయటకు వెళ్ళగొట్టేవారని కూడా అర్థమవుతుంది. అటువంటి సామాజిక పరిస్థితులలో జాషువా సాహిత్యం పుట్టుకొచ్చింది.

**జాషువా స్వీయకథా కావ్యం "నా కథ"**

స్వీయకథ "నాకథ"లో జాషువా తన జీవితఘట్టాలను "నాకథ" పేరుతో మూడు భాగాలుగా ఛందోబద్ధపద్యాల్లో వర్ణించుకున్నప్పటికీ, దాన్నొక కావ్యంగా తీర్చిదిద్దారు. ఆయన జీవించిన కాలంలోనే ఆ మూడు భాగాలు వరుసగా1950, 1962, 1966 సంవత్సరాల్లో ప్రచురితమైయ్యాయి. జాషువా రాసుకున్న "నాకథ'ను పరిశీలిస్తే ఆయన బాల్యమంతా కులవివక్షకు గురైనట్లు తెలుస్తుంది. విద్యార్థిజీవితం కూడా అస్తవ్యస్తంగానే కొనసాగినట్లు, చదువుకంటే ప్రకృతితో మమేకమై పశుపక్ష్యాదులతో ఆడిపాడాలనే కుతూహలం తనకు ఎక్కువగా ఉన్నట్లు ఆయనే కింది విధంగా వర్ణించుకున్నాడు.

*"గేదెలు గాయగబోవు బాలకులతో క్రీడింపగా నెంచి, మ*
*ర్యాదా భంగభయంబునన్, జనని కాదంచు న్నివారించినన్*
*ఏదోరీతి ననుజ్ఞ నందుకొని, నీ శృంగారపుందోటలో*
*గేదెల్ కాచితి కొన్ని నాళ్ళనురక్తిన్ కొంటెకోణంగినై"*

(జాషువ, నాకథ – ప్రథమ భాగం)

జాషువా తన బాల్య స్నేహితులతో ఆడిపాడాలనే కుతూహలంతో పశువుల్ని కాయడానికి కూడా ఏదొకనెపంతో వెళ్ళి ఆడుకొనేవాడని ఈ పద్యం వల్ల స్పష్టమవుతుంది. చదువుని ఎగ్గొట్టి ఇలా తిరగడం వల్ల సరిగ్గా చదువుకోలేకపోయాననీ, ఉపాధ్యాయులు తనను గట్టిగా కొట్టేవారనీ కింది పద్యంలో చెప్పుకున్నాడు.

*"ఎదుగని గొఱ్ఱెతోకవలె నేడులు పూండ్లు వయస్సు వచ్చినన్*
*బదలక రామచిల్క చదువుల్ బలికించెడు పాఠశాలలో*
*జదివితి నేను నాదు ననుజన్మునితో మునుపయ్యవార్ల బె*
*ట్టిదమగు వేపబెత్తము నటింపని తావులు లేవు వీపునన్"*

(జాషువ, నాకథ – ప్రథమ భాగం)

అయినప్పటికీ ఆరోజుల్ని స్వర్గతుల్యంగానే భావించుకున్నాడు జాషువ. అవి నేటి బాలలకు కూడా అందుతున్నాయో లేదో అంటూ తను ఆడిపాడిన ఊరుని స్వర్గసీమగానే సంబోధిస్తూ ఇలావర్ణించాడు కవి.

*"ప్రకృతి స్వర్గముగా రచించినది నా పాలారు ప్రాయాన చిం*

*తకు లోన్గాక బజారు బాలకులతో నానా విధానాసున కే*
*ళికలలం దేలుచు సంచరించితిని తల్లీ! నేటి చిన్నారి బా*
*లకు లా రంగ మలంకరింత్రుగద కాలస్వామి హోమీ పయిన్"*

(జాషువ, నాకథ – ప్రథమ భాగం)

తనని మరచినా, తాను వినుకొండను మరిచిపోలేనని "నాకథ" తొలి పద్యంలోనే చెప్పుకున్న కవి, నేటికీ ఇంకా ఆ కులప్రభావం కొనసాగుతూ మాల, మాదిగలను అంటరాని వాళ్ళుగానే చూస్తున్నా, వాళ్ళు అలాగే దయనీయంగా జీవిస్తున్నారా? నాటికీ నేటికీ మార్పులేమైనా ఒచ్చాయో, లేదో" అనే వేదన కొన్నాళ్ళ తర్వాత రాసుకున్న కింది పద్యంలో కనిపిస్తుంది.

*"మాదిగ, మాలలని మ*
*ర్యాదల కాస్పదములేని యభిదలతో సం*
*బోధింప బలుకు దీనులు*
*పేదలు సుఖమున్నవారె? వినుకొండపురీ"*

(జాషువ, నాకథ – ప్రథమ భాగం)

వినుకొండలోని మిషన్ పాఠశాలలో జాషువా ప్రాథమిక విద్యను పూర్తిచేశాడు. 1906–1909 మధ్యకాలంలో జాషువా ఉన్నత విద్యను అభ్యసించాడు. తర్వాత బాపట్లలోని అమెరికన్ బాప్టిస్టు మిషన్ హయ్యర్ గ్రేడు టీచరు ట్రైనింగు పాఠశాల్లో ఉపాధ్యాయశిక్షణ పొందాడు. ఆ తర్వాత ఉభయభాషాప్రవీణుడై బడిపంతులుగా ఉద్యోగం చేశాడు. నాటి సమాజంలో క్రైస్తవమతబోధనలు వేగవంతంగా జరుగుతున్నక్రమంలో వాళ్ళ యాజమాన్యంలోనే అనేకపాఠశాలలు నిర్వహణ కూడా జరిగేది. ఆ పాఠశాల్లో హిందూమతగ్రంథాలు లేదా ఆ సాహిత్యాన్నీ ఎవరూ చదవకూడదనే నిబంధనలు కూడా ఉండేవి. ఆ పాఠశాల్లో ఉద్యోగం చేస్తున్న జాషువా హిందూమత ప్రభావ సాహిత్యాన్ని చదువుతున్నాడని తెలిసింది. జాషువా ప్రణయకలాపాలు చేస్తున్నాడనే నెపంపెట్టి యాజమాన్యం ఆ బడిపంతులు ఉద్యోగం నుండి తొలగించిందని ఆయన కుమార్తె "మానాన్నగారు" గ్రంథంలో పేర్కొన్నారు.

ఆ తర్వాత ఆయన బతకడం కోసం రకరకాల ఉద్యోగాలు చేయాల్సి వచ్చింది. మూకీ సినిమాలకు వ్యాఖ్యాతగా పనిచేశాడు. యాజమాన్యం ఇస్తానన్న జీతం కూడా ఇవ్వకపోవడంతో ఆ ఉద్యోగాన్ని మానేసి, రాజమండ్రిలోనే బడిపంతులు ఉద్యోగంలో చేరాడు. ఆ సందర్భంలో తోలేటి వేంకటసుబ్బారావుతో పరిచయం ఏర్పడ్డం,

సాయంకాలం సమయంలో ఇద్దరూ గోదావరితీరంలో విహరిస్తూ ఒకరునొకరు ఆశువుగా పద్యాలల్లుకునేవారు. ఆ పరిచయంతోనే రాజమండ్రిలోని చింతామణి నాటకమండలి యజమాని సత్యవోలు గున్నేశ్వరరావుని కలుసుకున్నాడు జాషువా. జాషువాలోని సాహిత్యాభిలాషను, ప్రతిభను గమనించిన గున్నేశ్వరరావు తన నాటకమండలిలో రచయితగా చేర్చుకున్నారు.

జాషువా రాజమండ్రిలో 1916 నుండి 1919 వరకు ఉన్న కాలంలో "శ్రీరుక్మిణీపరిణయం" నాటకం రాసినా, తర్వాత గుంటూరు వెళ్ళిపోయి లూథరన్ టీచర్ ట్రైనింగ్ పాఠశాల్లో తెలుగు పండితునిగా ఉద్యోగంలో చేరాడు. అప్పుడు మళ్ళీ ఆ నాటకానికి మెరుగులు దిద్ది ముద్రణవేసినట్లు జాషువా రాసుకున్నాడు. ఆ విధంగా పుట్టిపెరిగిన వినుకొండ దగ్గర్లోని గుంటూరుకే మళ్ళీ వచ్చినా తన ఉద్యోగాన్వేషణలో తిరిగిన ప్రాంతాలు, పరిచయాలు ఆయన జీవితంలో కొత్త ఆలోచనలను కలిగించగలిగాయని "నాకథ"లో వర్ణించుకున్నాడు. ఒకవైపు కుటుంబం గడవాలి. అందుకు ఏదొక ఉద్యోగం చేయాలి. మరొకవైపు జాషువాకి సాహిత్యం పట్ల అమితమైన ఆసక్తి ఉండటం వల్ల అవధానాలు చేయాలని తపన పడేవాడు. ఆరోజుల్లో తిరుపతి వేంకటకవుల, వేంకటపార్వతీశకవుల జంటకవిత్వం ఆంధ్రదేశాన్ని ఒక ఊపు ఊపింది. ఆ ప్రభావంతో తానూ జంటకవిత్వం రాయాలనుకున్నాడు. తన చిన్ననాటి కవిమిత్రుడు దీపాల పిచ్చయ్యశాస్త్రితో కలిసి కవిత్వం రాయాలనుకున్నా సరిగ్గా కుదరలేదని ఆయనే చెప్పుకున్నాడు.

***"నాపేరు ముందునిల్పం***
***బాపం బదియేమొ జాషువా పిచ్చులగున్***
***నాపేరు చివర నిల్పిన***
***శాపం బిడినట్లు పిచ్చి జాష్వాలయ్యేన్"***

(జాషువ, నాకథ - ప్రథమ భాగం)

ఇద్దరిపేర్లు కుదరకపోవడంతో ఆ ప్రయత్నం విరమించుకొన్నానని చెప్పుకున్నా, జాషువా కవిత్వం రాయడం మాత్రం ఆపలేదు. అనేక కావ్యాలు, ఖండకావ్యాలు రాశాడు. అవన్నీ ఛందోబద్ధ పద్యాలు కావడం ఒక విశేషం. పద్యం అంటే జాషువాకి ఎంతో అభిమానం. ఛందోబద్ధంగా రాయగలగడమే నిజమైన కవిత్వం అని నమ్మిన కవి.

**జాషువ రచనలు :**

జాషువా రచనలలో పద్యకావ్యాలు, నాటకాలు, నవలలు, పద్యఖండికలుగా విభజించుకునే అవకాశం ఉంది. *స్వప్నకథ-అనాథ (1930-31), పిరదౌసి (1932), గబ్బిలం (1941, 1946), కాందిశీకుడు (1943), ముంటాజమహలు (1944), ఖండకావ్యం-1 (1945), ఖండకావ్యం-2 (1945), ఖండకావ్యం-3 (1945), నేతాజీ, చిన్నానాయకుడు(1948), బాపూజీ (1948), స్వయంవరం (1950) ఖండకావ్యం-4 (1952), ఖండకావ్యం-5 (1953), రాష్ట్రపూజ (1953), కొత్తలోకం (1957), ఖండకావ్యం-6 (1962), నాకథ మూడుభాగాలు (1950, 1962, 1966), ముసాఫరులు (1963), క్రీస్తుచరిత్ర (1963), ఖండకావ్యం-7 (1966), నాగార్జునసాగర్ (1966). ఇవన్నీ ప్రధానంగా ఛందోబద్ధ పద్యాలతో కూడిన ఖండకావ్యాలు. ఆయన రాసిన నాటకాల్లో రుక్మిణీ కల్యాణం (1923), చిదానంద ప్రభాతం (1921), ధ్రువవిజయం (1925) మీరాబాయి (1947) తెరచాటు (1946) ప్రచురితం కాగా, హిమధామార్కధర పరిణయం (1914-1916), కన్యకాపరమేశ్వరి (1914 -16), మదాలస (1919), దావీదుచరిత్ర (1920)* అముద్రిత రచనలుగా తెలుస్తుంది.

జాషువారచనలను ప్రస్తుతం, విశాలాంధ్ర ప్రచురణ సంస్థవారు నాలుగు సంపుటాల్లో ప్రచురించారు. 1వ సంపుటిగా గబ్బిలం, 2వసంపుటిగా స్వప్నకథ, పిరదౌసి, ముంటాజుమహలు, కాందిశీకుడు, బాపూజీ, నేతాజి, 3వసంపుటిగా స్వయంవరం, కొత్తలోకం, క్రీస్తుచరిత్ర, ముసాఫరులు, నాకథ (మూడుభాగాలు), నాగార్జునసాగర్, 4వసంపుటిగా ఖండకావ్యాలన్నీ ప్రచురించారు. వీటిలో "స్వప్నకథ-అనాథ (1930-31) లను విశాలాంధ్రవారు స్వప్నకథను ఒక ఆశ్వాసంగాను, రెండవ ఆశ్వాసం అనాథగాను ప్రచురించారు. దీన్ని సింగరాజు లక్ష్మీకళావతీదేవికి అంకితమిచ్చారు. తల్లిదండ్రులను పోగొట్టుకున్న ఒక పేద రెడ్డి కూతురు కథ ఈ కావ్యంలో వర్ణించాడు కవి. ఈమెను సాలెస్త్రీ పెంచుతుంది. లోకంలో అనేక కష్టనష్టాలకు గురై విషాదంతో స్వర్గానికి చేరుకుంటుంది. అస్పృశ్యత, దారిద్ర్యాల వల్ల ఒక మాలెత వీధులపాలైన కథ "అనాథ. " ఈ *"అనాథ" ఒక ప్రాంతానికో, ఒకదేశానికో పరిమితం కాదు. అన్ని దేశాలలోను, అంటే పేదదేశాలోనూ ఆర్థికంగా చితికిపోయిన ప్రాంతాలలోనూ కనపడుతుంది. "అనాధ" భౌతికంగా కన్పించే ఒక స్త్రీమూర్తి మాత్రమేకాదు. ఆ నాటి సమాజానికి ఒక ప్రతీకగా జాషువా భావించాడ*"ని

ఎండ్లూరి సుధాకర్ వ్యాఖ్యానించారు.

**పిరదౌసి (1932):**

పిరదౌసి కావ్యం జాషువాని సాహితీలోకం గుర్తించేటట్లు చేసిందని విమర్శకులు అభిప్రాయపడ్డారు. ఇది నాలుగు ఆశ్వాసాల కావ్యం. విశాలాంధ్ర వారు దీన్ని మూడు ఆశ్వాసాలుగానే ప్రచురించారు. దీన్ని సింగరాజు లక్ష్మీనారాయణ గారికి అంకితం చేశారు. ఇది తొలిసారిగా 1932లో రాశాడు. గజనీమహమ్మదు భారతదేశంపై 18 సార్లు దండయాత్రలు చేశాడని చరిత్రకారులు కూడా చెప్తుంటారు. ఆ దండయాత్రలను విజయయాత్రలుగా వర్ణిస్తూ తమ రాజవంశీయుల చరిత్రను రాయమని గజనీమహమ్మదు, ప్రసిద్ధపారశీక కవి పిరదౌసిని అడుగుతాడు. ఒక్కొక్కపద్యానికీ ఒక్కొక్క బంగారు నాణాలు ఇస్తానని నమ్మబలుకుతాడు.

*"ఒక్కొక్క పద్దియంబున*
*కొక్కొక్క బంగారు రూక యొసుగెదను కవీ!*
*మక్కా మసీదు తోడని*
*వక్కాణించెన్ మహాసభా మధ్యమునన్"*

(పిరదౌసి – జాషువా)

రాజాజ్ఞను అనుసరించి పిరదౌసి ముప్పదియేండ్లు శ్రమించి మంచిమంచి శబ్దార్థాలతో "షానామా" కావ్యాన్ని 60వేల పద్యాలతో పూర్తిచేస్తాడు. దాన్ని చదివిన రాజు, ఆస్థానంలోని పండితుల సూచనలకు ప్రభావితుడై బంగారు నాణాలకు బదులు వెండినాణాలిస్తాడు. రాజు ఆడిన మాట తప్పినందుకు పిరదౌసి ఆ వెండినాణాలను తిరస్కరిస్తూ లేఖ రాస్తాడు. అది చదివి రాజు ఉగ్రుడౌతాడు. పిరదౌసిని పట్టి చంపమని ఆజ్ఞాపిస్తాడు. అది తెలిసిన కవి రాజ్యం వదిలి పారిపోతాడు. తనజీవితంలో ఇంక సంతోషమనేదే లేదని భావిస్తాడు.

*" ఇంక విషాదగీతములకే మిగిలెన్ రసహీనమై మషీ*
*పంకం నాకలమ్మున భాగ్యుండనైతి వయ:పటుత్వమున్*
*గ్రుంకె శరీరమందలము కొన్నది వార్ధక భూత మీ నిరా*
*శాంకిత బాష్పముల్ఫలము లైనవి ముప్పదియేండ్ల సేవకున్ "*

(పిరదౌసి – జాషువా)

మార్గ మధ్యలో అనేక కష్టనష్టాలకు గురవుతాడు. కొన్నాళ్ళ తర్వాత మసీదుపై

పిరదౌసి రాసిన పద్యాన్ని రాజు చదువుతాడు. తన తప్పు తెలుసుకున్న రాజు చివరికి మళ్ళీ బంగారు నాణాలను పిరదౌసి ఇంటికి పంపిస్తాడు. కానీ, కవి కూతురు వాటిని తీసుకోదు. ఎన్నాళ్ళో బతకాల్సిన తన తండ్రిని చంపిన బంగారం తనకొద్దని తిరస్కరిస్తుంది. ఈ కావ్యం పిరదౌసి వేదనతో జాషువా వేదనను పోల్చవచ్చునని విమర్శకులు భావిస్తున్నారు.

పిరదౌసి కావ్యం అనేకసంవత్సరాల పాటు ఇంటర్మీడియెట్, డిగ్రీస్థాయిల్లో పాఠ్యాంశంగా నిర్ణయింపబడింది. పిరదౌసి కావ్యంలో కవి– కవిత్వం రాసేటప్పుడు ఎలాంటి వేదనకు గురౌతుంటాడనే విషయాలను హృద్యంగా వర్ణించారు. కావ్య శాస్త్ర విషయాలను ఎన్నింటినో ఈ కావ్యంలో గ్రహించే వీలుంది. ఈ కావ్యంలో ఆణిముత్యాల వంటి పద్యాలెన్నో ఉన్నాయి. గజనీమహ్మదు నోటితో కవిగొప్పతనాన్ని జాషువా ఇలా వర్ణించాడు.

*"కవిని కన్నతల్లి గర్భంబు ధన్యంబు*
*కృతిని జెందువాడు మృతుడు గాడు*
*పెరుగు దోట కూర విఖ్యాత పురుషులు*
*కవిని వ్యర్థ జీవిగా దలంత్రు.*

(పిరదౌసి– జాషువా)

పిరదౌసి తన శ్రమనంతా ధారపోసి కావ్యం రాస్తే, అది తననే తినేసే బెబ్బులిలా మారిందంటూ మసీదుపై ఒక పద్యాన్ని రాసినట్లు జాషువా వర్ణించిన పద్యం పిరదౌసి కావ్యహృదయాన్ని అంతటినీ వివరించేలా ఉంది.

*"ముత్యముల కిక్కయైన సముద్రముననుు*
*బెక్కు మాఱులు మున్కలు వేసినాడ*
*భాగ్యహీనుడ ముత్యమ్ము వడయనయితి*
*వనధి నను మ్రింగనోరు విచ్చినది తుదకు. "*

(పిరదౌసి– జాషువా)

పిరదౌసి కావ్యం జాషువా సృజనశీలతనీ, పాండిత్యాన్నీ, సహృదయతనూ ముప్పేటలా ఆవిష్కరించగలిగే ఉత్తమకావ్యం. జాషువా రాసిన రచనలన్నింటిలోను తనజీవితంతో ముడిపడిన అనేకసంఘటలు ముడిపడిఉన్నాయనడం సమంజసంగా ఉంటుంది. ఆయన పద్యాల్ని చదువుతున్న పాఠకులకు, వింటున్న శ్రోతలకు ఆ పద్యాల్లో తీయని బాధ ఏదో హృదయాన్ని మెలిపెడుతుంది. అపారమైన భావుకతతో

పాటు అంతర్లీనంగా కవి జీవనవేదనేదో పలుకుతుంది. అందుకే జాషువారచనలపై పరిశోధన చేసిన వాళ్ళిలా వ్యాఖ్యానించారు. "*జాషువా జీవితం, కవిత్వం వేరు వేరు కాదు. కవిత్వమే జీవితంగాను, జీవితమే కవిత్వం గాను మలుచుకున్నాడు. జీవితాన్ని పోరాటంగానూ, ఆయుధంగానూ భావించాడు. దుర్భరమైన దారిద్ర్యం బాధించినా, భయంకరమైన అంటరానితనం వేధించినా జాషువా జీవితంతో రాజీపడి, పరిస్థితులకు లొంగిపోయి బానిసగా బతకలేదు*"

**ముంటాజమహలు (1944):**

భారతదేశానికి మరింతకీర్తితెచ్చిన వాటిలో ముంతాజుమహలు ఒకటి. దీన్ని దర్శించిన తర్వాత జాషువా తన అనుభూతిని రంగరించి రాసిన కావ్యం. దీన్ని తన మాతృమూర్తి లింగమాంబకు అంకితమిస్తూ ఇలా వర్ణించాడు కవి.

***"నీవు బ్రతికియుండ నీవాంఛితార్థముల్***
***దీర్చు శక్తి లేక దిగులు పడితి***
***వేయి నగలకన్న వెలగల్గు కృతి భూష***
***నంపుచుంటి స్వీకరింపు మమ్మ"***

అని ఎంతో ఆర్ద్రంగా అంకితమిచ్చాడు. అయితే, తన మాతృమూర్తికి ఈ కావ్యాన్ని అంకితమివ్వాలనుకుంటున్నట్లు, ప్రచురించుకోవడానికి ఆర్థిక సహాయం చేయమని తిక్కవరపు రామిరెడ్డిగార్ని అడిగితే, సహృదయంతో అంగీకరించారని కవి చెప్పుకోవడమే కాకుండా, ఆయనను నవరత్నాలలో ప్రశంసించాడు కవి. తాజమహలు సౌందర్యాన్ని చూసిన తర్వాత, ఆ ఆవేశమే తననీ కావ్యం రాసేలా చేసిందనీ, రసపోషణ కోసం ఒక పిచ్చివాని పాత్రను ప్రవేశపెట్టినట్లు ప్రవేశికలో కవి ప్రకటించాడు. తాజమహలు నిర్మాణంలో ఆంధ్రులు కూడా ఉన్నారని, ఆ విధంగా తాజమహలు నిర్మాణంలో ఆంధ్రుల పాత్ర కూడా ఉందని పేర్కొన్నాడు. షాజహాన్-ముంతాజ్ బేగంల పరస్పర ప్రేమాభిమానాల్ని, అవి తాజ్ మహల్‌గా రూపొందిన తీరుని కవి రమణీయంగా వర్ణించాడు. వారిరువురూ ఎలా ఉండేవారో ఊహిస్తూ ఇలా వర్ణించాడు కవి.

***"ఆ సతీ పతుల గాఢాశ్లేషముల నుండి***
***జారిపోయిన నిమేషంబు లేదు***
***ఆ దంపతులకు నాహ్లాదంబు గూర్పక***
***తొలుగిన వెన్నెల తునక లేదు***

*ఆ ప్రేమజీవుల యనురాగ వృద్ధికై*
*రుత మొనర్పని పరభృతము లేదు*
*ఆ శుభాకృతుల నెయ్యంపు ముద్దుల చేత*
*తీపి కెక్కని ద్రాక్ష తీగ లేదు*
*అవధి లేనివారి యానంద కేళికి*
*దోడుపడని పూలదోట లేదు*
*వారి కూర్మి పెంపు వలచి వర్ణన జేసి*

సుప్రసిద్ధి గనని సుకవి లేదు" (ముంటాజుమహలు) ఇది కేవలం షాజహాను–ముంతాజుల మధ్య ఉండే ప్రేమానురాగాలే కాదు, ప్రతీ భార్యా భర్తా మధ్య ఉండవలసిన అనురాగబంధాన్ని తెలుపుతున్నట్లుందీ పద్యం. అంత అనురాగంతో ఉండటం వల్లనే ప్రపంచ వింతల్లో ఒకటిగా గుర్తింపుపొందేటట్లు ఆ పాలరాతి భవనాన్ని నిర్మించాడు రాజు. దీన్ని ఇలా వర్ణించాడు కవి.

*"ఏ వన్నె గల తీవె కే పచ్చ సవరింప*
*జెలువాఱునో దాని చిలికి జేసి*
*ఏ పుష్పదళమున కే పుష్యరాగంబు*
*సరిపోవునో దాని సంఘటించి*
*ఏ కిసాలంబున కే కెంపు జోడింప*
*కొమరారునో దాని కూర్పు జేసి*
*ఏ గులాబీ మొగ్గ కే రవ్వ బదిగింప*
*నందగించునొ దాని నతుకు బెట్టి*
*ప్రకృతి సిద్ధమైన వన్నెతో వన్నెకు*
*చెలిమి గలిపి భావముల నిమిడ్చి*
*చలువరాతి ఫలకములు దీర్చసాగిరి*
*చిత్రచిత్ర గతుల శిల్పి వరులు"*

(ముంటాజుమహలు) ముంతాజ్ మహలు చూసిన వాళ్ళకు ఆ పాలరాతి కట్టడంలో కనిపించే చిత్రాలునేటికీ రంగుపోకుండామెరవడం, గోడలపై తీర్చిదిద్దిన శిల్పవిన్యాసాలు అద్భుతం అనిపిస్తాయి. వీటిని కవి ఈ పద్యంలో అద్భుతంగా వర్ణించాడు. ముంటాజుమహలు కావ్యం షాజహానులోని కళాతృష్ణను మాత్రమే కాకుండా, ఆయన పాలనలో మతవిద్వేషాలను తగ్గించిన తీరుతెన్నులను, కవులకు

లభించిన ఆదరణనూ, అలాగే ముంతాజ్ మహల్ లోని కరుణాంతరంగాన్నీ చక్కగా వర్ణించాడు కవి.

**బాపూజీ (1948):**

సమాజం శాంతియుతంగా ఉండాలనీ, శాంతి అహింసలను నమ్మిన జాషువా ఆ సిద్ధాంతాలను ప్రచారం చేసిన గాంధీజీ పట్ల అచెంచల మైన అభిమానాన్ని ప్రదర్శించాడు. గాంధీజీని "మహర్షి" అని సంబోధిస్తూ ఈ కావ్యాన్ని "బాపూజీ" అనే పేరుతో రాశాడు. బాపూజీ అంటే తండ్రి అని అర్థం. భారతజాతీయోద్యమంలో నాడు గాంధీజీ అంతటి పేరు ప్రఖ్యాతులను పొందాడు. కవి జాషువాకీ గాంధీజీ పట్ల అంతే గౌరవ మర్యాదలున్నాయి. గాంధీజీ అనుయాయిగా పేరు పొందిన తిక్కవరపు రామిరెడ్డిగారికి ఈ కృతిని అంకితమిచ్చాడు. గాంధీజీని హత్యచేసిన వెంటనే రాలిన అశ్రుకణాలతో ఈ కావ్యాన్ని వర్ణించినట్లు కవి ప్రకటించాడు. దీనిలో రాసిన పద్యాలు గాంధీజీని హత్య చేసిన తర్వాత కవి హృదయవేదన పొంగి ప్రవహించినట్లుంటాయి. గాంధీజీ భారత స్వాతంత్ర్య రథసారధిగా ఆయన చేసిన కృషిని ఈ కావ్యంలో వర్ణించాడు కవి. బ్రిటీష్ వారితో చర్చలు, భారతదేశంలో కుల, మత విద్వేషాలు సమసిపోవడానికి చేసిన ప్రయత్నాలు, జిన్నాతో రాయబారం మొదలైన అనేకాంశాలను దీనిలో వర్ణించాడు. గాంధీజీని "భారతమునిప్రవరుడు", నిరుపేదల బాంధవుడుగా అభివర్ణించాడు.

*"భరతవర్షంబీను వజ్రాల ధనరాశి*
*తూకంబునకు పెచ్చుదూగువాడు*
*మూడు మూర్తుల దయాభూతి ప్రత్యంగాన*
*తాండవించెడు పవిత్రస్వరూపి*
*పదివేలయేండ్ల లోపల ధరాదేవత*
*కనియెఱుంగని జగన్మునివరుండు*
*అనుగు దమ్ములు కోరుకొను స్వరాజ్యార్థమై*
*పస్తుండి శుష్కించు పండుముసలి*
*గోచిపాత కట్టుకొని జాతి మానంబు*
*నిలిపినట్టి ఖదరు నేతగాడు*
*విశ్వసామరస్య విజ్ఞాన సంధాత*

కామిత ప్రదాత, గాంధితాత. (బాపూజీ– జాషువా). అంతేకాదు, దినకరుడుగా, మహాపురుషుడుగా, ప్రత్యక్షదైవంగా గాంధీజీని అభివర్ణించాడు. భారత స్వాతంత్ర్యోద్యమంలో అగ్నికణంలా ఎగిసిపడిన దేశభక్తుడు నేతాజీ. అతడి గురించి కావ్యం రాయకుండా ఉండలేకపోయానని ప్రకటించి, నేతాజీ పేరుతో ఈ కావ్యాన్ని రాశారు. అప్పటికే చనిపోయిన తన తండ్రికి ఈ కావ్యాన్ని అంకితమిస్తున్నానని ప్రకటించాడు జాషువా. దీనిలో నేతాజీ జీవిత ఘట్టాలను వర్ణించినా, కవి సమకాలీన సమాజస్థితిగతులతో పాటు, కుల, మత ప్రభావాన్నీ, కవుల స్పందనలను వర్ణించాడు. గాంధీజీ ప్రేమించినంతగా, ఆయన ఆశించిన సంస్కరణోద్యమాన్ని ప్రజలు నిజంగా అందుకోలేకపోతున్నారనే ఆవేదన కూడా కనిపిస్తుంది.

***"తొలుతన్ గాంధి ఫకీరు మాకు భగవంతుండంచు పూజించి, భ***
***క్తులలో గొందరు పంచమోద్ధరణమున్ దూషించుచున్నారు నిం***
***దలు నీలాలు సృజించి, యీ కఱకు సంతానంబు నా కడ్పునం***

దగుల్నాటి నటించుచున్న యది మాయా నాట్య కౌశల్యమై" (నేతాజీ –జాషువా)

జాషువా రాసిన "రాష్ట్రపూజ" ఆంధ్రపదేశ్ అవతరణ సందర్భంగా రాసిన కావ్యం. దీనిలో పొట్టిశ్రీరాములు, టంగుటూరి ప్రకాశం పంతులు మొదలైన నాయకుల సేవలను ప్రస్తుతించారు. ఆంధ్రాభిమానం కనిపిస్తుంది. "కొత్తలోకము"లో కవి అంత: బహిసంఘర్షణ కనిపిస్తుంది. జాషువాని చాలామంది హేతువాదిగా, నాస్తికునిగా వర్ణించినా ఈ కావ్యాన్ని బట్టి ఆస్తికుడుగానే గుర్తించగలుగుతాం.

***"ఉన్నావో లేవోయని***
***తన్నుకొనుట కన్న నభ్రతలమున నెందో***
***యున్నావనుకొనుటే నా***
***కన్నిట శుభమని తలంతు నద్భుత చరితా" (కొత్తలోకము–జాషువా)***

"ముసాఫరులు" తాత్త్వికభావాలకు సంబంధించిన కావ్యం. "ముసాఫిర్" అనే ఉర్దూ భాషాపదానికి "ప్రయాణికుడు" అని అర్థం. మానవపరిణామ సారాంశాన్ని ఈ కావ్యంలో వర్ణించాడు కవి. "మరణించిన ప్రాణం ఆకాశం(పరం) వైపుకీ, అవతరించనున్న కొత్తప్రాణం భూమి (ఇహం) మీదికి వచ్చే సన్నివేశంలో ఇహపరాల యాత్రలో సంభాషించే ఆ రెండు ప్రాణాత్మల తాత్త్విక సంభాషణే ఈ కావ్యంగా రూపొందిందని ప్రముఖ విమర్శకుడు ఎండ్లూరి సుధాకర్ అభిప్రాయం. జాషువాసాహిత్యపరిణామాన్ని పట్టుకోగలిగిన కావ్యంగా కూడా దీన్నే పరిశోధకులు వ్యాఖ్యానించారు.

జాషువాకు పేరు ప్రఖ్యాతులు తెచ్చిన వాటిలో *"భరతమాత్మ", "గిజిగాడు", "సాలీడు", "రాజరాజు", "శ్మశానవాటిక", శిశువు, తెలుగు తల్లి, భారతవీరుడు, లైకా, వీరచానమ్మ* మొదలైన ఖండికలు చెప్పుకోదగినవి. ఇవన్నీ ఖండకావ్యాల సంపుటిగా ప్రచురించారు. ఇవన్నీ 7 ఖండకావ్యసంపుటులుగా తొలుత ప్రచురించినా, తర్వాత విశాలాంధ్ర ప్రచురణాలయం వారు ఒకే సంపుటి (నాల్గవ సంపుటి) గా ప్రచురించారు.

"ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేకదా" అని చేమకూరి వేంకటకవి అన్నప్పటికీ, తనకి మాత్రం సమకాలము వారి ఆదరణ లభించిందని ఖండకావ్యసంపుటి మొదటిభాగం పదకొండో కూర్పులో జాషువా ప్రకటించాడు. భరతమాత శీర్షికతో జాషువా రాసిన పద్యం తెలుగుసాహిత్యంలో ఆణిముత్యం వంటిది.

***"సగరమాంధాతాది షట్చక్రవర్తుల***
***యంకసీమల నిల్చినట్టి సాధ్వి,***
***కమలనాభుని వేణుగాన సుధాంబుధి,***
***మునిగితేలిన పరిపూత దేహ,***
***కాళిదాసాది సత్కవికుమారులు గాంచి***
***కీర్తినందిన పెద్ద గేహస్తురాలు***
***బుద్ధాది మునిజనంబుల తపంబున మోద***
***బాష్పముల్విడిచిన భక్తురాలు***
***సింధు, గంగానదీ క్షీరమెపుడు***
***గురిసి బిడ్డలు బోషించు కొనుచు నున్న***
***పచ్చిబాలింతరాలు మా భరతమాత***
***మాతలకు మాత, సకల సంపత్సమేత" (భరతమాత- జాషువా)***

జాషువా రచనలన్నీ ఆణిముత్యాల వంటివే. అయినప్పటికీ ఆయన రాసిన పిరదౌసి కావ్యం ఆయన్ని సాహితీలోకం గుర్తించేలా చేసిందని కొత్తపల్లి పున్నయ్య వ్యాఖ్యానించారు. పిరదౌసి కావ్యంలో జాషువా రసహృదయం పొంగిపొర్లింది. తన జీవిత చరిత్రను కావ్యంగా వర్ణించమని, కావ్యం పూర్తయిన తర్వాత రాజు మోసం చేయడమే దీనిలో ఇతివృత్తమైనప్పటికీ, జాషువా తన జీవితం తొలిరోజుల్లో ఎదుర్కొన్న సంఘటనలు గుర్తుకొచ్చేలా ఈ కావ్యంలో కొన్ని వర్ణనలున్నాయి. రాజమండ్రిలో

మూకీ సినిమాలకు వాచకుడు (వ్యాఖ్యాత)గా పనిచేసినప్పుడు జీతం ఇచ్చేవారు కాదని, భోజనం మాత్రం పెట్టేవారని జాషువా గురించి రాస్తూ హేమలతా లవణం వివరించారు. బహుశా ఆ జీవిత ఘట్టాలేవో పిరదౌసి కావ్యరచనలో అంతర్భాగమై ఉంటాయి. బంగారు నాణాలు ఇస్తానన్న రాజు, వెండి నాణాలివ్వడం, వాటిని కవి తిరస్కరించడం వంటి వర్ణనలన్నీ కవిజీవితాన్నీ, మోసపూరిత సమాజాన్ని తెలుపుతున్నాయి. కదులుతున్న బొమ్మలకు సందర్భానుసారంగా గొంతుని అందించాలి. ఆ పాత్రలో లీనమైతేగాని సాధ్యం కాని కళ అది. అది జాషువా చేసేవాడు. అటువంటి నైపుణ్యమే కవి కూడా నెరవేర్చాలి. పిరదౌసి పాత్రలో జాషువా ఉండి నాటి అనుభవాలను కింది పద్యంలో వర్ణించాడనిపిస్తుంది.

***"ముదురుకోయిల కంఠము నివాసము సేయ***
***కొసరింపు గూతల గుట్టు దెలిసి,***
***ప్రతిపుష్ప గంధగర్భము జీల్చికొని వచ్చు***
***పిల్లగాడ్పుల జన్మవృత్తమరసి,***
***మేఘంబు తెరచాటు మెఱుపుబోగముసాని***
***మోసగింపుల యర్థమును గ్రహించి,***
***శరధినాయకుని క్రొన్నురువు పిల్లల, తీఱు***
***బడిలేని యాటలభావ మెఱిగి***
***ముగ్ధమోహనసౌందర్య పూర్ణా***
***ప్రకృతి రమతోడ స్నేహభావమున మెలగి***
***ముప్పదేడులు సర్వాంగపుష్టి మెఱయు***

గబ్బము రచించె పిర్దౌసి కవివరుండు" నిజానికి ఈ పద్యం పిరదౌసి కావ్యంలో ఘజనీ మహమ్మదు వంశ చరిత్రను కావ్యం చేయడంలో "కొసరింపుకోతల గుట్టుతెలిసి" అనడం ద్వారా ఆ వంశచరిత్రను పరిశోధించి రాశాడని తెలుస్తుంది. అలాగే, "గంధగర్భము చీల్చికొనివచ్చు పిల్లగాడ్పుల జన్మవృత్తమరసి" అనడంలో రాజుల్లో ఎక్కడో చిన్న మంచితనం ఉంటే దాన్ని గొప్పగా వర్ణించడం వంటివాటిని ఈ పద్యంలో ప్రతిభావంతంగా వర్ణించాడు కవి. కానీ, జాగ్రత్తగా ఈపద్యాన్ని గమనిస్తే జాషువా మూకీ సినిమాలకు డబ్బింగు చెప్పేటప్పుడు అనుభవించిన జీవితానికి కూడా దీనిలోని భావాలను అన్వయించుకోవచ్చు. మూకీ సినిమాలకు డబ్బింగ్ చెప్పడం లేదా వ్యాఖ్యానించడం కూడా పాత్రభావాలకు అనుగుణంగా కొన్నిసార్లు సంభాషణలు,

మరికొన్నిసార్లు సన్నివేశాన్ని వివరించడానికి ఆ సినిమాలో లీనమవ్వాలి. లేకపోతే ప్రేక్షకులు దాన్ని ఆస్వాదించలేరు. కావ్యాన్ని వర్ణించేటప్పుడు కూడా ఆ యా పాత్రల్లో కవి ఒదిగిపోవాలి. పిరదౌసి కావ్యాన్ని కవి అలాంటి అనుభూతితో వర్ణించి ఉంటాడు.

## గబ్బిలం (1941, 1946) :

జాషువా రాసిన మరో గొప్పకావ్యం గబ్బిలం. గుంటూరు జిల్లా బోర్డుప్రెసిడెంటు కల్లూరి చంద్రమౌళి చౌదరిగారికి అంకితం ఇచ్చారు. గబ్బిలం రచనకు జాషువా బాల్య జీవిత నేపథ్యం కూడా ఉపకరించిందని పరిశోధకులు వ్యాఖ్యానించారు. దళితుడైన అరుంధతీసుతుడ్ని కావ్యనాయకుడిగా చేసుకున్నాడు కవి. హిందూమతం వల్ల దళితులు పడుతున్న జీవనవేదనంతా పలికిస్తూనే, తన దేశభక్తిని కూడా ప్రటించిన కావ్యమిది. “గబ్బిలం” రెండు భాగాలు రాశారు. మొదటి భాగంలో సుమారు 117 పద్యాలు, రెండవ భాగంలో 142 – మొత్తం 259 పద్యాలున్న గబ్బిలాన్ని లఘుప్రబంధమనీ, ప్రతీక కావ్యమనీ (ాఎఎఎశీశ్రీఅఎ జూశీవఎ) ప్రముఖ విమర్శకుడు కఠెవరపు వెంకట్రామయ్య అభిప్రాయపడ్డారు. గబ్బిలం మొదటి భాగాన్ని 1941 లోను, రెండవ భాగాన్ని 1946 లోను ప్రచురించారు. కాళిదాసు మేఘసందేశంలో ఒక భగ్నప్రేమికుడి ఇతివృత్తాంతాన్ని వర్ణిస్తూ, భారతదేశ ఔన్నత్యాన్ని వివరించాడు. జాషువా గబ్బిలం కావ్యంలో ఒక అరుంధతీసుతుని అశ్రు సందేశాన్ని ఈశ్వరునికి నివేదించే నెపంతో భారతదేశ ఔన్నత్యాన్ని వర్ణిస్తూనే, దళితుల బాధలను వినిపించాడు.

“చిక్కిన కాసుచే దనిమి జెందునమాయకుడెల్ల కష్టముల్
బొక్కెడు బువ్వతో మరచిపోవు క్షుధానల దగ్ధమూర్తి న
ల్దిక్కులు గల్గు లోకమున దిక్కరియున్న యరుంధతీ సుతుం
డొక్కడు జన్మమెత్తె భరతోర్వరకుం గడగొట్టు బిడ్డడై ” (గబ్బిలం) అని ఒక అరుంధతీసుతుని జీవితగాథను కేంద్రంగా చేసుకొని ఈ కావ్యాన్ని వర్ణించాడు కవి. దళితుని జీవితగాథను శివునికి నివేదించడానికి గబ్బిలాన్ని సందేశహారిణిగా ఎన్నుకున్నాడు కవి. తన ఇంటికి ఒక అర్థరాత్రి వచ్చిన గబ్బిలంతో అరుంధతీసుతుడు మాట్లాడుతూ “ సమస్త దేవతా సన్నిధిని” ప్రసాదాన్ని ఆరగించగలిగే పుణ్యాత్మురాలువై ఉండి కూడా అంటరానివాడు నివసించే నిషిద్ధగేహానికి వచ్చావేమిటని” అడుగుతాడు.

గబ్బిలం- పక్షీకాద్మృ జంతువూ కాదు. అయినప్పటికీ అది ఎక్కడికైనా తిరగగలిగే అవకాశం ఉంది. కానీ, మానవుడైన దళితుడికి అనేక నిర్భంధాలు, నిషేధాలు ఉన్నాయని స్ఫురింపజేయడం జాషువా లక్ష్యం ఆ వర్ణనలో కనిపిస్తుంది. అతడిని సమాజం ఎలా చూస్తుందో వివరిస్తూ...

*"ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి*
*యినుపగజ్జల తల్లి జీవనము సేయు*
*గసరి బుసకొట్టు నాతని గాలిసోక*
*నాల్గు పడగల హైందవ నాగరాజు"*

(గబ్బిలం) అని వర్ణించాడు కవి. చాతుర్వర్ణ్య వ్యవస్థ కులంగా పరిణమించిన తర్వాత పంచమవర్ణం సృష్టించబడింది. ఈ పంచములే అంటరానివాళ్ళయ్యారు. హిందూసమాజంలో నాలుగు వర్ణాలను నాలుగు పడగలతో పోలుస్తూ దళితుడిపై విషం కక్కుతున్న స్థితిని వర్ణించాడు. కర్మసిద్ధాంతంతో దళితుని నోరు కట్టేస్తున్నారనీ, పూజారులు లేనిసమయం చూపి తన కథను శివునికి వినిపించమని కోరుతాడు. రఘునాథనాయకుడు, కృష్ణదేవరాయులు, చేమకూర వేంకటకవి, ముద్దుపళని, క్షేత్రయ్యాల సాహితీ కృషిని గుర్తుచేస్తాడు. తంజావూరులోని సరస్వతీమహాలుని దర్శించమంటాడు. మహాభారతాన్ని తెలుగు చేసిన తిక్కన నివాసమైన నెల్లూరుని చూసి పొమ్మంటాడు. అలాగే పల్నాటి పౌరుషానికి ప్రతీకగా చెప్పుకొనే కారంపూడినీ, అనేక కృతులు అందుకొన్న స్థలం కొండవీటినీ, ఆశుధారగా పద్యాలు చెప్పిన వేమననూ గుర్తుచేస్తాడు. విద్వత్సభారంజితమైన రాజమహేంద్రవరాన్నీ, నన్నయనూ, సారంగధరుణ్ణీ గుర్తుచేస్తాడు. అలాగే తెలుగులో గొప్పకవులుగా విరాజిల్లిన శ్రీనాథుడు మరికొంతమంది కవులను తలచుకుంటాడు. తర్వాత ఉత్తం˘భారతదేశంలో కాశీపురాన్నీ, ఢిల్లీ తదితరప్రాంతాలను ప్రశంసిస్తాడు. రెండవభాగంలో గాంధీజీని ప్రశంసించాడు కవి.

*"నిమ్న జాతుల కన్నీటి నీరదములు*
*పిడుగులై దేశమును గాల్చి వేయుననుచు*
*రాట్నమును దుద్దుగఱ్ఱకరాన బూని*
*దెసల దోతెంచె గుజరాతు ముసలిసెట్టి"*

(గబ్బిలం, రెండవభాగం) అలాగే అంబేద్కర్ ని కూడా వర్ణించాడు కవి.

*"కలడంబేద్కరు నా సహోదరుడు మాకై యష్ట కష్టాలకుం*

*బలియై సీమకు వోయి క్రమ్మరిన విద్వాంసుండు వైస్రాయి మే*
*ల్కొలువందంగల దొడ్డవాడతుడు నీకున్ స్వాగతంబిచ్చి పూ*
*వుల పూజల్ వొనరించెనే యతని మెప్పుల్ నీ జయారంభముల్ "*

(గబ్బిలం, రెండవభాగం)

ఇక్కడ జాషువానెలా అర్థం చేసుకోవాలనే విషయంలో కొంత సందిగ్ధత ఉంటుంది. ఎందుకంటే, గాంధీజీ స్వాతంత్రరథసారథిగా అన్ని వర్గాలను కలుపుకుపోయే దిశగా కాంగ్రెసుపార్టీకి నాయకత్వం వహించాడు. అంబేద్కర్ దళితుల సమస్యలు పరిష్కారం కావడం ప్రథమకర్తవ్యంగా భావించాడు. గాంధీజీ – అంబేద్కర్ ఇద్దరూ భారతదేశానికి స్వాతంత్ర్యం రావడంలో మార్గాలు వేరైనా లక్ష్యాలు ఒకటే. ఇరువురూ దేశభక్తులే. అందుకే గాంధీజీ ప్రతిపాదించి సంస్కరణోద్యమాన్ని ఆహ్వానిస్తూనే, తమ సమస్యల్ని గుర్తించిపోరాడిన అంబేద్కర్ నీ జాషువా ప్రశంసించాడు. అయినంత మాత్రం చేత ఒకరిని నిరాదరించాల్సిన పనిలేదుకదా. అందుకే ఇరువురినీ గౌరవించాడు కవి. గబ్బిలం రెండవ భాగంలో దళితుల్లో కూడా మాల మాదిగ భేదాలుండడం పట్ల తన ఆవేదనను వ్యక్తీకరించాడు. సమాజం కుల, మతాలుగా విడిపోతే, ఆ విభజన మరిన్ని విభజనలకు కారణమవుతుందనీ, అది పీడితులను మరింత పీడితులను చేస్తుందనే వర్గవాదభావజాలాన్ని కూడా అవగాహన చేసుకున్నట్లు స్పష్టమవుతుంది. గబ్బిలం కావ్యం వస్తుపరంగాను, కావ్యనాయకుడిసి తీసుకోవడంలోను, దాన్ని వర్ణించడంలోనుఉత్తమ ప్రమాణాలే కాకుండా కావ్యప్రపంచంలో కొత్తమార్గానికి దారులు తీసిన కావ్యంగా గుర్తింపు పొందింది.

## కాందిశీకుడు(1943):

జాషువా రాసిన మరొక ఖండకావ్యం కాందిశీకుడు(1943). దీన్ని తిక్కవరపు రామిరెడ్డిగారి సతీమణి శ్రీమతి సుదర్శనాంబకు అంకితం ఇచ్చాడు. దీనికి ప్రతిఫలంగా రెడ్డిగారు భూదానాన్ని చేసినట్లు కవి రాసుకున్నారు. కథ కల్పితం. దీన్ని కవి ఇలా సమర్థించుకున్నారు. " *కేవల కల్పనా కథలు కృత్రిమరత్నములు అని భట్టుమూర్తి సిద్ధాంతమ్ము కాని, కాలపరిణామము ననుసరించి కవి నావేశించిన సత్యమును వ్యక్తీకరించుటకతడెన్నియో పథకములను సృష్టించుకొనును; అవి హృదయంగములై రసోత్పత్తిని గల్గింపజాలినచో, కల్పితా కల్పిత కథా వివక్షకు తావులదని*

నాయభి(ప్రాయము" ఒక బర్మాకాందిశీకుడు (ప్రాణభీతితో పరుగెట్టుకొచ్చి నల్లమల అడవుల్లో సంచరిస్తుంటాడు. ఆ సమయంలో కాలికి ఒక మానవపు(ఱ్ఱె తగులుతుంది. కాందిశీకుడితో ఆ పు(ఱ్ఱె సంభాషిస్తుంది. కొంతమంది వల్ల నిరపరాధులైన సామాన్యమానవులు యుద్ధం వల్ల చనిపోవడం మంచిదికాదని శాంతి, అహింసల గొప్పతనాన్ని విశదీకరించేదిశగా ఈ కావ్యాన్ని వర్ణించాడు కవి. మతవైషమ్యాలను పోగొట్టి, బుద్ధుడు నడయాడిన శాంతినీ, ధర్మాన్నీ పాటించాలనే సందేశాన్ని అందిస్తుందీ కావ్యం.

*" స్వర్గంబు, నరకమశాంతి యనుచు*
*నిర్వచింతురు మా బౌద్ధ నియమ రతులు*
*స్వర్గ సృష్టికి బుద్ధుండె (స్రష్టయం(డు*
*సర్వమతముల సిద్ధాంత సారమిదియ" (కాందిశీకుడు)*

ఈ కావ్యంలో రెండవ(ప్రపంచయుద్ధంకాలం నాటి (ప్రజల ఆలోచనలను (ప్రతిబింబించేలా వర్ణించాడు కవి. సమకాలీన విషయాలను తీసుకొని కల్పితకావ్యంగా రాయడం కూడా అవసరమనే ఆలోచన కవిలో కలగడానికి కవికి సామాజిక స్పృహ ఉండాలనే ఆలోచన జాషువాలో కూడా ఉందని కాందిశీకుడు కావ్యం నిదర్శనంగా నిలుస్తుంది.

## స్వయంవరం (1950):

తాను నమ్మిన గాంధేయవాదం తన కళ్ళముందే ఆచరణలో వైఫల్యం చెందడాన్ని గమనించిన జాషువా రాసిన కావ్యం "స్వయంవరం" దీనిలో వధువు "స్వరాజ్యం", పెండ్లికొడుకులు (ప్రజలు. గాంధీజీ సత్యా(గహం అనే యజ్ఞంలో స్వరాజ్య బాల జన్మించి, పెండ్లికెదుగుతుంది. పెళ్ళిచేసుకొనే వరుల కోసం స్వయంవరం (ప్రకటిస్తారు. నీతిమంతులు, అవినీతిమంతులు అంతా స్వయంవరానికి హాజరవుతారు. వాళ్ళని చూసి స్వరాజ్య కన్య యేడుస్తూ పారిపోతుంది. అనుకూలమైన వరుడికోసం అన్వేషించి దేశాటన చేస్తూ, చివరికి మంచుకొండల దగ్గరకి చేరుతుంది. ఆమె ఒకపల్లెలో నివసిస్తుంది. ఆమె కలలో మహాత్ముడు కనిపించి ఉపదేశం చేస్తాడు. ఒక యువకుణ్ణి వివాహమాడి స్వరాజ్యం రాజ్య మేలుకుంటుంది. దేశంలో శాంతి నెలకొని, స్వరాజ్యం యొక్క నిజమైన ఫలితాలను (ప్రజలు అనుభవిస్తారు. ఈ కావ్యాన్ని కవి బాల్యం, స్వయంవరం, దేశాటనం, హిమగిరియా(త్ర అనే నాలుగు విభాగాలుగా వర్ణించాడు.

గాంధీజీ కలలు కన్న రామరాజ్యాన్ని స్వయంవరంలో కవి దర్శించాడు. భారతదేశం అలా సుఖశాంతులతో ఉండాలని ఆకాంక్షించాడు.

జాషువా జీవితంలో అనేక కుల, మత పరమైన సంఘర్షణలు ఎదురైనప్పటికీ, వాటిని దాటుకుంటూ విశ్వమానవుడిగా ఎదగడమెలాగో ఆయన జీవితం, సాహిత్యం ప్రతిబింబంగా నిలుస్తుంది. జాషువా 1971 జూలై 24వతేదీన మరణించారు. ఆయన్ని మొదట వ్యతిరేకించినా, చివరికి క్రైస్తవమతాచారం ప్రకారమే సమాధి చేశారని అమూల్యశ్రీ పేర్కొన్నారు. కానీ, జాషువా మరణించినప్పుడు ప్రత్యక్షంగా చూసిన వాళ్ళ కథనం భిన్నంగా ఉంది. క్రైస్తవ మతాచారాల ప్రకారమే సమాధి చేశారని ఆ సన్నివేశాలను చూసిన ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి వివరించారు. హిందూ పురాణేతి హాసాల్లోని వస్తువుల్ని తీసుకొని రచనలు చేస్తున్నందుకు క్రైస్తవ వర్గానికి చెందిన వారి నుండి సంఘర్షణలు ఎదుర్కోవలసి వచ్చింది. ఆ విషయాన్ని ఆయనే ఇలా వర్ణించారు.

*"అందరము పుట్టుపాపులమని యహేతు*
*కమ్ముగా భయభీజములు నాటి కలత బెట్టి*
*బ్రతుకు మతబోధకుల యనుగ్రహము తప్పి*
*సంఘ బాహ్యుండనైతి క్రైస్తవుల యందు" ఆయనే మరో సందర్భంలో*
*"మత పిచ్చిగాని, వర్ణో*
*న్నతిగాని స్వార్థ చింతనము గాని నా*

కృతులందుండదు" అని చెప్పుకున్నాడు. కనుక, ఆయన కులాన్నీ, మతాన్నీ వెనకేసుకొచ్చే రచనలు చేశారనుకోలేం.

*"ఎంత కోయిల పాట వృథయయ్యెనో కదా*
*చిక్కు చీకటి వనసీమలందు*
*ఎన్ని వెన్నెల వాగు లింకిపోయెనొ కదా*
*కటిక కొండలమీద మిటకరించి*
*ఎన్ని కస్తురి జింకలీడేరెనో కదా*
*మురికి తెన్నెల మీద పరిమళించి*
*ఎన్ని ముత్తెపురాలు భిన్నమయ్యెనొ కదా?*
*పండిన వెదురు జంపములలోన*
*ఎంత గంధవహనమెంత తంగెటి జున్ను*

*యెంత రత్నకాంతి యెంత శాంతి*
*ప్రకృతి గర్భమందు భగ్నమైపోయెనో కదా*

పుట్టరానిచోట పుట్టుకతన" (గుర్రం జాషువ, గబ్బిలం) అని ఒకప్పుడు వాపోయిన జాషువాని నేడు ప్రతివాళ్ళూ తమవాడుగా చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. జాషువాలో క్రైస్తవం మానవతావాదాన్ని, జీవితానుభవాలు హేతువాదభావాల్ని, కుటుంబజీవనం సహనాన్ని, దేశపరిస్థితులు దేశభక్తినీ పలికించగలిగాయి. తన మూలాల్ని మరచిపోకుండానే తన జాతిబాధల్ని, గాథల్ని వర్ణిస్తూనే వాటిలో రావలసిన సంస్కరణల్ని కోరుకోవడం వల్లనే గాంధీజీని ప్రేమించగలిగాడు. వాస్తవికసామాజిక జీవితానుభవాలతో అంబేద్కర్‌ని హృదయానికి హత్తుకోగలిగాడు. మొదటి భాగంలో స్వాతంత్ర్యానికి పూర్వమున్న దళితుని పరిస్థితి విన్నవించే దిశగా వర్ణిస్తే, రెండవభాగంలో రెండు ప్రపంచయుద్ధాల తర్వాత, స్వాతంత్ర్యోద్యమంలో గాంధీజీ పాత్రను ప్రశంసించినా, సమాజంలో ప్రబలిపోయిన కుల, మతాల పరిస్థితికి ఆందోళన చెందటం కనిపిస్తుంది.

## జాషువా ప్రసిద్ధ పద్యాలు:

జాషువా పేరుచెప్పగానే చాలామందికి కొన్ని పద్యాలు గుర్తుకొస్తాయి. పద్యాన్ని జాషువా మాధుర్యగుణంతో రసభరితం చేయడం దీనికొక ప్రధానకారణం. సమకాలీనతతో పాటు, భావుకత, శిల్పనైపుణ్యం జాషువా పద్యం అలరాలడానికి మరికొన్ని కారణాలుగా చెప్పుకోవచ్చు. అటువంటి కొన్ని పద్యాలను ఇక్కడ పేర్కొంటున్నాను.

1. *"ఎన్నో యేండ్లు గతించిపోయినవి గానీ, యీ శ్మశాన స్థలిన్*
*గన్నుల్ మోడ్చిన మందభాగ్యుడొకుడైనన్ లేచిరా దక్కటా*
*యెన్నాళ్ళీ చలనంబులేని శయనంబే తల్లు లల్లాడిరో*
*కన్నీటంబడి క్రాగిపోయినవి నిక్కంబిందు పాషాణముల్"*

(శ్మశానవాటిక– జాషువా)

*"ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని*
*కలము నిప్పులలోను గఱిగిపోయె*
*యిచ్చోటనే భూములేలు రాజన్యుని*
*అధికార ముద్రిక లంతరించె*

*యిచ్చోటనే లేత యిల్లాలి నల్లపూ*
*సల సౌరు గంగలోన గలసిపోయె*
*యిచ్చోటనెట్టి పేరెన్నిక గనుగొన్న*
*చిత్రలేఖకుని కుంచియు నశించె*
*ఇది పిశాచులతో నిటలేక్షణుండు*
*గజ్జె గదలించు యాడు రంగస్థలంబు*
*ఇది మరణదూత దీక్షమౌ దృష్టులొలయ*
*నవని బాలించు భస్మసింహాసనంబు "*

(శ్మశాన వాటిక – జాషువా)

2. *"భాషరాదు; వట్టి పాలు మాత్రమె త్రాగు*
*నిద్రపోవు; లేచి నిలువలేడు*
*ఎవరెరుంగ, రితని దేదేశమో కాని*
*మొన్న మొన్న నిలకు మొలిచినాడు "*

(శిశువు – జాషువా)

3. *"మన సంస్కృతి, మన సభ్యత*
*మన విజ్ఞానంబు బహుళ మర్యాదలతో*
*వననిధులు దాటి యున్నది*
*తెనుగుల గవళికలు లేని దేశము గలదే "*

(వ్యాప్తి, ఖండకావ్యం (మూడవసంపుటి) జాషువా)

4. *"పంచములలోన మాదిగవాడను నేను*
*పంచమీయులలో మాలవాడతండు*
*ఉభయులము క్రైస్తవమతాన నొదిగినాము*
*సోదరత గిట్టుబాటు గాలేదు మాకు. "*

5. *"హిందువులను చూచి యెగతాళి చేసెద*
*మింటనున్న మురికికేవగింప;*
*మొరుల తప్పిదంబు లోరుచు కొనలేము*
*సొంతతప్పు మాకు చురుకు లేదు"*

(ఇంటిగుట్టు– జాషువా)

*6 "ముప్పుఘటించి వీని గలిమిన్ గబళించు దేహమున్*
*బిప్పి యొనర్చు నీ భరతవీరుని పాదము కందకుండగా*
*జెప్పులు గుట్టి జీవనము సేయును గాని నిరాకరింప లే*
*దెప్పుడు నప్పు వడ్డది సుమీ భరతావని వీని సేవకున్"*

(గబ్బిలం– జాషువా)

*7. "ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి*
*యినుపగజ్జెల తల్లి జీవనము సేయు*
*గసరి బుసకొట్టు నాతని గాలిసోక*
*నాల్గు పడగల హైందవ నాగరాజు "*

(గబ్బిలం– జాషువా)

*8. " ఏనాడు మా కావ్య సృష్టికర్త జిహ్వ*
*విశ్వసత్యమునాలపింపగలదొ*
*ఏనాడు మా జాతి దృష్టి మాంద్యము వాసి*
*చుట్టుప్రక్కల దేరి చూడగలదొ*
*ఏనాడు మా బుఱ్ఱలీ జుట్లు తలలేని*
*పుక్కిటి కథలలో జిక్కువడవొ*
*ఏనాడు మా విద్య లినుప సంఘమునందు*
*చిలుము పట్టక ప్రకాశింపగలవొ*
*తనువుదాచక సోమరితనము మాని*
*యెన్నడీ మఠంబులు బిచ్చమెత్తుకోవొ*
*అట్టి శుభవేళకై కొంగుబట్టి నిలచి*
*నలిగి వాపోవుచున్నది నా మనస్సు"*

(గబ్బిలం–2 భాగం )

## జాషువ జీవితంలోని ముఖ్యఘట్టాలు:

జాషువా 1895 సెప్టెంబరు 28 న పుట్టాడు.
తల్లిదండ్రుల వీరయ్య లింగమాంబలు.
1910లో జాషువా మేరీ అనే అమ్మాయిని వివాహం చేసుకున్నాడు.

1918లో తెలుగుపండితుడిగా రాజమండ్రిలో పనిచేశాడు.
1919లో గుంటూరులో క్రిస్టియన్ లూథరన్ మిషన్ ట్రైనింగ్
పాఠశాలలో తెలుగుపండితుడిగా చేరాడు.
1928లో బాపట్లలో తెలుగుపండితుడిగా పనిచేశాడు.
1933లో కవితావిశారద బిరుదు పొందాడు.
1936లో కవికోకిల బిరుదు పొందాడు.
1942- 45 మధ్యకాలంలో వార్ పబ్లిసిటీ ఆఫీసర్‌గా నెల్లూరులోపనిచేశాడు.
1946 జనవరి 1-2 తేదీలలో విజయవాడలో చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారి అధ్యక్షతన "కవిదిగ్గజ" "నవ యుగకవిచక్రవర్తి" బిరుదులు పొందడంతోపాటుగండపెండేరం ధరించి, ఏనుగుపై ఊరేగాడు.
1952లో మధురశ్రీనాథ బిరుదు పొందాడు.
1953లో కనకాభిషేకం జరిగింది.
1956లో భార్య మేరి చనిపోయింది.
1957- 59 మధ్యలో ఆకాశవాణి మద్రాసు కేంద్రం,
తెలుగు విభాగంలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్.
1961లో విమలమ్మను రెండవ వివాహం చేసుకున్నాడు.
1964లో ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యుడైయ్యాడు.
1965లో "క్రీస్తు చరిత్ర' కు కేంద్రసాహిత్య అకాడమీ బహుమతి పొందాడు.
1969లో ఆంధ్రవిశ్వకళాపరిషత్ వారి "కళాప్రపూర్ణ" పొందారు.
1970లో భారతప్రభుత్వం వారి "పద్మభూషణ్" పురస్కారం పొందారు.
1974 జూలై 24వతేదీన మరణించారు.

జాషువా జీవితం వడగాల్పులనీ, వెన్నెలనీ చూడగలిగింది. తన రచనలకు మొదట్లో తగిన గుర్తింపరాకపోయినా, కవిత్వం చదివేటప్పుడు కులం వల్ల అవమానాల పాలైనా, తర్వాత కాలంలో కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారంతో పాటు, విధానమండలి సభ్యుడిగా కూడా గౌరవింపబడ్డాడు. జాషువా జీవించిన కాలంతో పాటు, అనంతరకాలంలోను ఆయన రచనలకు విశేషమైన ఖ్యాతి లభిస్తూనే ఉంది. దీనంతటికీ కవిత్వంలో బిగి ఉండటం, సామాజికవాస్తవిక అనుభవాల్ని కళాత్మకంగా వర్ణించడం, సమాజాన్ని సకారాత్మక దృష్టితో చూడగలగడం వంటి అనేకకారణాల్ని చెప్పుకోవచ్చు. సంప్రదాయబద్ధమైన ఛందోబద్ధరీతిలో పద్యరచన కొనసాగించినా

భాష సరళంగా ఉంటుంది. తీసుకొనే ఇతివృత్తం సమకాలీన సమాజాన్ని ప్రతిబింబిస్తుంది. సంప్రదాయ-ఆధునిక సాహిత్యానికి వారధిగా కనిపిస్తాడు. భావంలో, భాషలో, భావుకతలో, దాన్ని కావ్యంగా తీర్చిదిద్దడంలో ఆధునిక తెలుగు కవిత్వాన్ని నవ్యమార్గం వైపు పయనించినందుకుగాను జాషువాను నవయుగకవిచక్రవర్తిగా అభివర్ణించడం అతిశయోక్తికాబోదు.

> ***"రాజుమరణించెనొకతార రాలిపోయె***
> ***కవియు మరణించె నొకతార రాలిపోయె***
> ***రాజు జీవించు ఱాతి విగ్రహములందు***
> ***సుకవి జీవించు ప్రజల నాలుకల యుందు"***

అని జాషువా గారే ఒకచోట వర్ణించినట్లు ప్రజల నాలుకలపై ఆయన పద్యాలు నాట్యం చేస్తున్నాయి. ప్రజల హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోయాడు. అందువల్ల ఆయన గురించి ఎంత చెప్పినా ఇంకా తక్కువే అనిపిస్తుంటుంది.

**ఆధార గ్రంథాలు:**


1. అయిలయ్య, బన్న. *తెలుగుకవిత : అభినవదృక్పథం*, వరంగల్: నానీ ప్రచురణలు, 2001.
2. అమూల్యశ్రీ. *జాషువా కవితా వైభవం*, గుంటూరు: సాహితీపబ్లికేషన్స్, 1989.
3. కృపాచారి, గుజ్జర్లమూడి. నాగార్జుననగర్ : *తెలుగు సాహిత్యానికి క్రైస్తవుల సేవ*, తెలుగుశాఖ, నాగార్జున విశ్వవిద్యాలయం, 1988.
4. చిన్నారావు, యాగాటి. *ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమ చరిత్ర (1900 -1950).* హైదరాబాదు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్. 2007.
5. జాషువ. *నాకథ (మూడు భాగాలు),* విజయవాడ: హేమలతాలవణం ప్రచురణ, 1992, (తొలి ప్రచురణలు, 1950, 1962, 1966).
6. హేమలతాలవణం ప్రచురణ, 1997 (తొలి ప్రచురణలు, 1945, 1952, 1953, 1962, 1966).
7. జాషువ. *జాషువ రచనలు (రెం. సం.)* హైదరాబాదు: విశాలాంధ్రపబ్లిషింగ్ హౌస్, 2006.
8. పద్మారావు, కత్తి. *దళిత సాహిత్యం-జాషువ*, పొన్నూరు: లోకాయుక్త ప్రచురణలు, 2008, (ప్రథమ ప్రచురణ, 2001).
9. భాస్కరచౌదరి, బి. *జాషువా జీవిత కవితాప్రస్థానం*, చిత్తూరు: సమతాపబ్లికేషన్స్,

1981 (ద్వితీయ ముద్రణ)

10. భాస్కరచౌదరి. బి. *జాషువా కృతుల సమాలోచన*, చిత్తూరు: సమతా పబ్లికేషన్స్, 1982

11. మూర్తి, వివిన. "చెప్పులు కుడుతూ... కుడుతూ... " బెంగళూరు: మనసు ఫౌండేషన్, 2011, (ప్రథమ ముద్రణ, 2009)

12. సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల. *ఆంధ్ర రచయితలు*, రాజమహేంద్రవరం: అద్దేపల్లి అండ్ కో, సరస్వతీ పవర్ ప్రెస్, 1950.

13. సుధాకర్, ఎండ్లూరి. *జాషువా సాహిత్యం, దృక్పథం – పరిణామం*, రాజమండ్రి: మానస మనోజ్ఞ ప్రచురణలు, 2007.

14. హేమలతా, లవణం. మానాన్నగారు. తెలుగు అకాడమి, హైదరాబాదు: 2011. (మొదటి ముద్రణ, 1986)

# బండారు అచ్చమాంబ రచనల్లో మహిళా చైతన్యం

సాంఘికసంస్కరణోద్యమాల ఫలితంగా విద్యను అభ్యసించడమే కాకుండా పుస్తకాలను కూడా రాసిన స్త్రీలు ఎంతో మంది ఉన్నారు. వారు తర్వాత కాలంలో రచయిత్రులుగా పేరు ప్రఖ్యాతులు కూడా పొంది చరిత్రలో తమదైన స్థానాన్ని సాధించుకున్నారు. అటువంటి వారిలో బండారు అచ్చమాంబ ఒకరు. ఈమె 1874 లో పుట్టి 1905 వరకు జీవించారు. స్వయంగా చదువుకొని తెలుగు, ఆంగ్లం, హిందీ, మరాఠీ భాషల్ని నేర్చుకున్నారు. వీటితో పాటు కొద్దిగా బెంగాలీ, సంస్కృతం, గుజరాతీ భాషలను నేర్చుకున్నారు. స్త్రీ జీవిత చరిత్రల్ని సేకరించి "అబలా సచ్చరిత్రమాల" (1901) అనే పుస్తకాన్ని రాశారు. దీన్ని సంఘసంస్కర్త కందుకూరి వీరేశలింగంపంతులు (1848-1919) తమ *చింతామణి* ముద్రణాలయంలో ప్రచురించాడు. అచ్చమాంబకు పదవయేటనే వివాహం కావడం, తన ఆరేళ్ళవయసప్పుడే తండ్రి చనిపోవడంతో పాటు, నాడు స్త్రీలను చదివించే పరిస్థితులు లేకపోయినా, స్త్రీలకు విద్య ఎంతో అవసరమని గ్రహించి, తమ్ముడు సహాయంతో ఇంటిదగ్గరే చదువుకొని, స్త్రీలకు ఎంతో చైతన్యాన్నిచ్చే రచనలు చేశారు. ఈమె రచనల్లో ప్రధానంగా స్త్రీకి విద్య అవసరమేమిటో వివరించారు. అందువల్ల ఈమె జీవితాన్ని, ఈమెపై చూపిన సంఘసంస్కరణోద్యమ ప్రభావాన్ని, దానివల్ల ఈమె సాధించిన మహిళా సాధికారతను ఈ పత్రంలో వివరించే ప్రయత్నం చేస్తాను.

**బండారు అచ్చమాంబ జీవిత-రచనలు:**

బండారు అచ్చమాంబకు సంబంధించిన వివరాలు చాలా వరకు లభించడం లేదు. లభించిన ఆధారాలను బట్టి ఈమె కొమర్రాజు గంగమ్మ, వెంకటప్పయ్యలకు 1874లో కృష్ణాజిల్లా నందిగామ దగ్గర్లోని పెనుగంచిప్రోలులో జన్మించారు. ఈమె

తన మేనమామ బండారు మాధవరావుని వివాహం చేసుకొని, బండారు అచ్చమాంబగానే రచనలు చేశారు. శ్రీకృష్ణదేవరాయ భాషాంధ్రనిలయం, విజ్ఞానచంద్రికామండలి వ్యవస్థాపకుడు, మొట్టమొదటి తెలుగు విజ్ఞానసర్వస్వం రచయిత కొమర్రాజు వెంకట లక్షణరావు పంతులు (1877–1923) ఈమె సోదరుడే. మాధవరావు అప్పటి మధ్యప్రాంతం నేటి మహారాష్ట్రలో ప్రభుత్వ ఉద్యోగి కావడం వల్ల కృష్ణాజిల్లా నుండి అక్కడికి వలసవెళ్ళారు. అతని దగ్గరే ఉంటూ లక్షణరావు పంతులు పెరిగారు. అందుకనే అక్క లచ్చమాంబ లక్షణరావు పంతులు విద్యాభ్యాసానికి పుస్తకాలు కొనిస్తూ, ఎంతగానో సహకరించించారు. చిన్నవయసులోనే ఈమె పిల్లలు చనిపోవడంతో, ఆ దు:ఖం నుండి బయటపడటానికి రచనా వ్యాసంగంలో నిమగ్నమైయ్యారని పరిశోధకులు (సుశీ. జె. తారు, కె. లలిత, 1993:324) అంటున్నారు. ఈమధ్య కాలంలో తొలితెలుగు కథానికగురించి జరుగుతున్న చర్చల్లో తరచుగా బండారు అచ్చమాంబ పేరొకటి వినిపించడమే కాకుండా, ఈమెనే తొలితెలుగు కథానికా రచయిత్రిగా గుర్తించాలనే పరిశోధకుల వాదనల వరకు చేరిన మహిళా రచయిత్రి. ఈమె కందుకూరివీరేశలింగం పంతులు చేసిన మహిళాభ్యుదయ ప్రబోధాలకు ప్రభావితురాలైనట్లు ఈమెపై వచ్చిన విశ్లేషణలు తెలుపుతున్నాయి. ఈమె కుటుంబం తెలంగాణాప్రాంతానికి వలసవచ్చి నల్లగొండలో స్థిరపడ్డారు. చిరకాలంగా ఈ ప్రాంతంలో ఉండడం వల్ల ఈమెను తెలంగాణ తొలి మహిళాకథారచయిత్రి, తొలి నల్లగొండ రచయిత్రిగా పరిశోధకులు (యాదగిరి రెడ్డి, ప్రజాశక్తి, 4 అక్టోబరు 2009) అభివర్ణిస్తున్నారు.

ఈమె కవితలు, కథలు, వ్యాసాలు ప్రధానంగా *హిందూసుందరి*, *సరస్వతి* అనే పత్రికల్లో వచ్చేవి. స్త్రీవిద్య, ధనత్రయోదశి, ప్రేమ పరీక్ష, ఎరువు సొమ్ము బరువు చేటు మొదలుగా సుమారు పన్నెండు కథలు రాసినట్లు తెలుస్తుంది. ఈమె రచనల్లో "అబలా సచ్చరిత్రమాల"ను ముఖ్యమైన రచనగా విమర్శకులు చెప్తున్నారు. వీటితో పాటు బీదకుటుంబం, శతకం రాసినట్లు ప్రప్రథమ చరిత్రకారిణిగాను ఊటకూరి లక్ష్మీకాంతమ్మ తన '*ఆంధ్రకవయిత్రులు*' (1980)లో పేర్కొన్నారు. ఈమె రాసిన రచనల్లో సంస్కరణోద్యమ ప్రభావంతోపాటు, స్త్రీవిద్యావశ్యకత ప్రముఖంగా కనిపిస్తుంది. 1902లో ఓరుగంటి సుందరీ రత్నమాంబతో కలిసి 'బృందావన స్త్రీల సమాజం' (మచిలీపట్నంలో) ఏర్పాటు చేసి, రాష్ట్రవ్యాప్తంగా అనేక సభలు, సమావేశాలు నిర్వహించి స్త్రీవిద్యావశ్యకతను తెలిపారు. ఇలా స్వయంగా చదువుకొని,

మరికొంతమంది మహిళలు కూడా చదువుకోవాలని ప్రబోధించి, స్త్రీ మహిళాభ్యున్నతికి విశేషంగా కృషిచేసిన అచ్చమాంబ ముప్పైయేళ్ళకే, అంటే జనవరి, 18, 1905లో మరణించారు.

## అచ్చమాంబ రచనల్లో సంస్కరణోద్యమం ప్రభావం:

భారతదేశంలో సాంఘికసంస్కరణోద్యమాలు బుద్ధునికాలం నుండే ప్రారంభమైయ్యాయని చెప్పొచ్చు. బుద్ధుడు బోధనల్లో గల అష్టాంగమార్గాలు గానీ, మిగతా బోధనలు గానీ ప్రేమతత్త్వాన్ని పెంపొందించేవే. బుద్ధునికి ముందు హిందువులు చేసే యజ్ఞయాగాదుల సందర్భంగా వందలాది పశువుల్ని బలిచ్చేవారు. దాన్ని నిరోధించే క్రమంలోనే అహింసాసిద్ధాంతం ప్రతిపాదితమైంది. భారతదేశంలో చాతుర్వర్ణ్యవ్యవస్థ వల్ల కొన్ని కులాల వారికి విద్యావకాశాలు నిరాకరించారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో చివరి వర్ణాలవారైన శూద్రులకు, ఇతర వర్ణాల వారికీ విద్యావకాశాలు లేవు. స్త్రీలను కూడా శూద్రులతో పాటు విద్యావకాశాలకు దూరం చేశారు. దీనివల్ల స్త్రీల ప్రతిభాపాటవాలు బహిర్గతమైయ్యే అవకాశాలెలాగూ లేకపోయినా, దుర్భరమైన జీవితాల్ని గడిపాల్సి వచ్చేది. మనుస్మృతిలో కూడా స్త్రీకి అనేక నిబంధనల్ని విధించడమే కాకుండా, విద్యావకాశాల్ని లేకుండా చేసింది. ఇన్ని నిబంధనల మధ్య స్త్రీకి విద్యావకాశాలు ఉండాలని ఆశించడం కూడా సంఘసంస్కరణలో భాగమైంది. బండారు అచ్చమాంబ వీటిని స్వయంగా అనుభవించింది. ఒకే ఇంటిలో ఈ వివక్షను గమనించింది. తన తమ్ముడిని చదివించడానికి అంగీకరించిన సమాజం, తనని చదువుకోవడానికి అవకాశంలేకుండా చేసిందని గుర్తించింది. తమ్ముడి సహాయంతోనే ఇంటి దగ్గరే ఉండి చదువుకుంది. రచనలు చేసింది. తన భావాల్ని రచనల్లో వ్యక్తీకరించింది. కింది భావాల్లో ఆమె స్త్రీకి విద్య ఎంత అవసరమో తెలియజెప్పింది.

*"స్త్రీలు అబలలనియు, బుద్ధి హీనులనియు వివేకశూన్యులనియు, సకల దుర్గుణములకు - నివాసస్థలమనియు గొందరు నిందింతురు. స్త్రీలపయిన మోపబడిన ఈ దోషారోపణములన్నియు నబద్ధములనియు, స్త్రీలలో నత్యంత శౌర్య ధైర్యవంతులును, అసామాన్య విద్యావిభూషితులునూ... బూర్వముండిరనియు, నిపుడున్నారనియూ స్థాపించుట నా మొదటి యుద్దేశ్యము"* అని "అబలా సచ్చరిత్రమాల" (1901) అనే పుస్తకంలో పేర్కొన్నారు. "స్త్రీలకు విద్య నేర్పిన

*యెడలను, వారికి స్వాతంత్ర్యమొసగిన యెడలను, వారు చెడిపోవుదురనియు, బతుకుల నవమానించెదనియు, గుటుంబసౌఖ్యమును నాశనము చేసెదరనియు గొందరు మహానుభావులు వక్కాణించెదరు. ఆ యారోపణములన్నియు నిరర్థకములనియు, స్త్రీవిద్య దురాచార ప్రతీకానుకూలమగునే కాని దురాచార ప్రవృత్త్యనుకూలము గానేరదనియు, స్త్రీ విద్యా స్వాతంత్ర్యముల వలన దేశమునకు లాభమే గాని నష్టములు గలుగనేరదనియు, స్త్రీ విద్య యత్యంతావశ్యకంబనియు సోదాహరణపూర్వకంగా నిరూపించుట నా ద్వితీయోద్దేశ్యము"* అని స్త్రీవిద్యావశ్యకతను వివరించారు.

అచ్చమాంబ రాసిన *"స్త్రీవిద్య" (భార్యాభర్తల మధ్య సంవాదము)* కథ 'చదువుల *రీత్యాగాని, ఉద్యోగరీత్యాగాని వేరే ప్రాంతాలకు వెళ్ళిన భర్తతో ఉత్తరప్రత్యుత్తరాలు జరపటానికి కుటుంబం గుట్టును కాపాడటానికి స్త్రీలకు విద్య అవసరమన్నది వీరేశలింగంగారి అభిప్రాయాలలో ఒకటి. దీనికి కథారూపమే స్త్రీవిద్య కథ'* అని బండారు అచ్చమాంబ రచనల గురించి విశ్లేషిస్తూ కందాల శోభారాణి (భూమిక మాసపత్రిక, ఆగస్టు, 20011) వ్యాఖ్యానించారు.

*'స్త్రీల విద్య యొక్క ప్రభావం'* అనే వ్యాసంలో అచ్చమాంబ రాసిన విషయాలు కూడా స్త్రీవిద్యా ప్రాధాన్యాన్ని తెలుపుతున్నాయి. అప్పటికే ఇతరదేశాల్లో స్త్రీలకు విద్యావకాశాల గురించి అచ్చమాంబ ప్రస్తావించారు.

*"లండన్ ద్వీపమున స్త్రీ పురుషులందఱు సమానంగా విద్యను గాంతురు. అచట రాజకీయ హక్కులన్నియు స్త్రీ పురుషులకు సమానముగా నియ్యబడును... అచట విద్యాశాఖవారందరు స్త్రీలే... జనరక్షణమంతయు నచట నాడువారే చేయు చుండినందున... నిచట కారాగృహముగాని, పోలీసుగాని లేరు. సైన్యము లేదు. న్యాయస్థానములు లేవు. ఇది యంతయు స్త్రీవిద్యా ప్రభావమే కదా? యితర దేశములందిట్టి దృష్టాంతములగుపడుచుండగా మన దేశమునందింకను కొందఱు స్త్రీలకు విద్యనేర్పవచ్చునా? లేదా? యని వాదించుచునే యున్నారు"* అని "హిందూ సుందరి, 1902, ఆగస్టు సంచికలో రాశారు. ఇవన్నీ సంస్కరణోద్యమ ప్రభావాన్ని తెలుపుతున్నాయి. ఈ అంశాల్నే సృజనాత్మకంగా రాసిన కథలే *'స్త్రీవిద్య" (భార్యాభర్తల మధ్య సంవాదము), "ధనత్రయోదశి"* గాచెప్పుకోవచ్చు.

స్త్రీవిద్యలో కొన్నాళ్ళు ఊరెళ్ళిన భర్తకి తన మనసు విప్పి చెప్పుకోగలిగిన విషయాల్ని ఉత్తరంలో రాయించడానికి భార్య మనసెలా విలవిలలాడిపోతుందో

వర్ణిస్తుంది. ఆ సందర్భంలోనే మన పూర్వీకులు స్త్రీకి విద్య లేకుండా చేసి తీవ్రమైన అన్యాయానికి గురిచేశారని వాపోతారు. పరిణతి చెందిన స్త్రీ హృదయాన్ని, మేధను 'ధనత్రయోదశి'లో ఆవిష్కరించారు. భర్త ఒక బంగారం కొట్టులో పనిచేస్తుంటాడు. పేదరికంతో కుటుంబాన్ని నెట్టుకొస్తుంటాడు. అతని నిజాయితీని పరీక్షించాలని కొట్టు యజమానీ, మరొక వ్యక్తి పథకం పన్నుతారు. ఫలితంగా భర్త జేబులో బంగారం. దానితో ఇంటికొచ్చిన భర్త రాత్రంతా నిద్రపోడు. దీన్ని గమనించిన భార్య మర్నాడు ఆ బంగారాన్ని పట్టుకెళ్ళి యజమానికిచ్చేస్తారు. ధనత్రయోదశినాడు బంగారం కొన్నా, దాన్ని పొందినా అదృష్టం లభిస్తుందనేదో నమ్మకం. అయినా, బంగారాన్ని దొంగతనం చేయడానికి ఇష్టపడని వారా దంపతులు. రెండు కథల్లోను స్త్రీ సామర్థ్యాన్ని రచయిత్రి చక్కగా వర్ణించారు. ఒక కథలో చదువుకోకపోవడం వల్ల స్త్రీపడిన వేదననీ, మరో కథలో చదువుకోవడం వల్ల పొందిన వివేకాన్ని, తద్వారా భర్త, కుటుంబ గౌరవాన్ని కాపాడిన వైనాల్ని చక్కగా వ్యక్తీకరించారు. ఇలాగే స్త్రీ సమస్యల్ని అనేకకోణాల్లో అచ్చమాంబ రాశారు.

**అచ్చమాంబ మహిళాసాధికారత:**

గురజాడ అప్పారావు (1861-1915) రాసిన *దిద్దుబాటు* (1910) కంటే ముందుగానే అంటే 1902లోనే అచ్చమాంబ రాసిన *"ధనత్రయోదశి"* అనే కథ *'హిందు సుందరి'* అనే పత్రిక నవంబరు సంచికలో ముద్రితమైంది. 1902లోనే *'స్త్రీవిద్య'* అనే కథను కూడా రాశారు. ఈ రెండింటినీ కొంతమందీ; వీటిలో *'ధనత్రయోదశి'*ని మరికొంతమందీ వీటిని చారిత్రకంగాను, వస్తువైవిధ్యంగాను చూసినప్పుడు ఇవే తొలితెలుగు కథానికలుగా నిలుస్తాయనీ, అందువల్ల బండారు అచ్చమాంబనే తొలితెలుగు కథానికా రచయిత్రిగా గుర్తించాలనిపరిశోధకులు డా. లలిత, సత్యవతి తదితరులు (కొండవీటి సత్యవతి, 2006) ప్రతిపాదిస్తున్నారు. దీన్న బట్టి ఇంటిదగ్గరే చదువుకున్నప్పటికీ సంప్రదాయబద్ధంగా చదువుకున్న ఒక పురుషునితో పోటీపడగల కథల్ని రాయగలశక్తి సాధించడమంటే ఒకవిధంగా స్త్రీ విద్య వల్ల సాధించిన సాధికారికతగానే భావించవచ్చు.

మరో విషయంలో చూస్తే, కేవలం విద్య తనకోసమే కాకుండా స్త్రీ సంఘాల్ని కూడా స్థాపించారు అచ్చమాంబ. దీనివల్ల మహిళా నాయకత్వాన్ని వహించగల సామర్థ్యాన్ని నిరూపించారు. ఇలా స్త్రీ చదువుకొంటే వచ్చే ప్రయోజనాల్ని

గమనించడానికి అచ్చమాంబజీవితం ఒక ఉదాహరణగా నిలుస్తుంది. డా. లలిత. సంగిశెట్టి శ్రీనివాస్, ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు, ఆచార్య కాత్యాయనీ విద్మహే, కొండవీటి సత్యవతి, నిడదవోలు మాలతి, కందాల శోభారాణి మొదలైన పరిశోధకులెంతోమంది బండారు అచ్చమాంబ కృషిని వెలికితీయడంలో విశేషంగా కృషిచేస్తున్నారు. పరిశోధకులు బండారు అచ్చమాంబను తొలితరం కథారచయిత్రిగా గుర్తిస్తూ ఈమె మొదటిస్థానంలో ఉన్నారని నిరూపించడమే ఈమె సాధించిన మహిళాసాధికారతను తెలియజేస్తుంది. తండ్రిలేకపోయినా, తాను చదువుకోవడమే కాకుండా, తనతో పాటు మహిళల్ని కూడా చైతన్యపరిచిన బండారు అచ్చమాంబ స్త్రీలు చదువుకొంటే సాధించగలవేంటో నిరూపించడానికి నిదర్శనంగా నిలుస్తారు.

**ఆధారాలు:**


1. http://en. wikipedia. org/wiki/Bhandaru_Acchamamba
2. సత్యవతి, కొండవీటి. *'తొలితెలుగు కథారచయిత్రి బండారు అచ్చమాంబ'* (వ్యాసం)
3. http://prajakala. org/mag/2006/12/tholi_telugu_katha_rachayithri_bandaru_achamamba
4 Susie Tharu & K. Lalita (08 October, 1991). ). Bandaru Acchamamba". *The Feminist Press*. Retrieved 2009-06-02.
5. శోభారాణి, కందాల. *తొలితరం తెలుగు కథా రచయిత్రులు : సంస్కరణోద్యమ జాతీయోద్యమ చైతన్యం* (వ్యాసం), *భూమిక* (మాసపత్రిక, ఆగష్టు, 2011).
6. యాదగిరి రెడ్డి, మేరెడ్డి. *'వందేళ్ళ నల్లగొండ జిల్లా కథాస్రవంతి'* (వ్యాసం), *ప్రజాశక్తి,* 4 అక్టోబరు 2009.


***


***(చరిత్రశాఖ, శ్రీ కందుకూరి వీరేశలింగం థియోస్టిక్ కళాశాల, రాజమండ్రి వారు 18, 19 మార్చి 2012 తేదీలలో నిర్వహించిన* "Social Reform & Education, A Tool Of Women Empowerment – Some Reflections" *అనే పేరుతో నిర్వహించిన జాతీయసదస్సు–ప్రత్యేక సంచిక)***

# తెలుగులో కళాతత్త్వశాస్త్రం – అనువాదాల సమీక్ష

*కళాతత్త్వ శాస్త్ర విషయాల్ని తెలుగు విమర్శకులు వివిధ సందర్భాల్లో ప్రస్తావించారు. వీటిని భారతీయాలంకారిక విషయాలతో తులనాత్మకంగా విశ్లేషించిన వాళ్ళున్నారు. మరికొంతమంది ఆ విషయ సారాంశాన్ని వివిధ వ్యాసాలుగా రాశారు. వీటిని పూర్తిగా అనువాదాలని అనలేకపోయినా, పాశ్చాత్య సౌందర్య శాస్త్ర అంశాల్ని పరిచయం చేయడానికి జరిగిన ప్రయత్నంగానే భావించవచ్చు. గ్రీకు, రోమన్, రష్యన్ మొదలైన భాషల్లో వెలువడిన అంశాల్ని ఆంగ్లంలో రాసేటప్పుడే యథానువాదాలుగా కాకుండా, ఆ యా రచయితల స్వీయాభిప్రాయాల్ని కలిపి వెల్లడించారు. ఇంచుమించు అదే పద్ధతిని తెలుగు విమర్శకులు కూడా అనుసరించారు.*

**కళాతత్త్వశాస్త్రం:**

ఆంగ్లంలో "ఈస్థటిక్స్" అని పిలిచే ఈ శాస్త్రాన్ని తెలుగులో సౌందర్య శాస్త్రం, కళాతత్త్వశాస్త్రం అనే పేర్లతో పిలుస్తున్నారు. భారతీయులు కావ్య సౌందర్యాన్ని వివరించే లక్షణ గ్రంథాల్ని కావ్యశాస్త్రాలనీ, అలంకారశాస్త్రాలనీ, సాహిత్య శాస్త్రాలనీ పిలుస్తున్నారు. సామాన్యార్థంలో వీటినే సౌందర్యశాస్త్రమనే పిలుస్తున్నా, పాశ్చాత్యుల దృష్టితో చూసినప్పుడు ఇదొక ప్రత్యేక శాస్త్రంగా పరిగణన పొందుతుంది. ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య రాసిన *''కళాతత్త్వశాస్త్రం–మౌలికాంశ వివేచన'' అనే గ్రంథానికి* కళాతత్త్వశాస్త్రమని ఆయన పేరు పెట్టినా, సౌందర్యశాస్త్రమనే పేరుకి పర్యాయపదం గానే దాన్ని ఆ గ్రంథంలో ప్రయోగించారు. భారతీయులు నాటక, కావ్య లక్షణాల్ని వివరిస్తూ రాసిన అలంకారశాస్త్రాల్లో కళకి సంబంధించిన అనేకాంశాలు ఉన్నప్పటికీ, వాటిని విశ్లేషించుకోవాల్సిన అవసరం ఉందని చెప్తూనే పాశ్చాత్యులలో బౌమ్‌గార్టెన్‌ని కళాతత్త్వశాస్త్రానికి ఆద్యుడని విమర్శకులు (వీరభద్రయ్య,

1993:1)పేర్కొంటున్నారు.

మొట్టమొదటిసారిగా అలెగ్జాండర్ బౌమ్‌గార్టెన్ (Alexander Gottlieb Baumgarten) (1714 –1762) తన సిద్ధాంత గ్రంథం *Aesthetica* (1750) లో ఒక ప్రత్యేక శాస్త్రం Aesthetics గా పేర్కొన్నారు. 1735 లో ఈ పదాన్ని బౌమ్‌గార్టెన్ ఉపయోగించినా, ఇది 1750లో తన సిద్ధాంత గ్రంథానికి ప్రధాన శీర్షికగా పెట్టి, దాన్ని మరింతగా ప్రాచుర్యంలోకి తెచ్చాడు. Aesthetics అనే పదానికి ‘‘a science of sensitive cognition only ‘or’ a science that was concerned with the ‘obscure’ knowledge as ‘obscure’, the knowledge in the form of feeling, the knowledge that does not admit of adequate presentation in words” అనే వివరణ కనిపిస్తుంది. లలితకళలన్నింటిలోని సౌందర్య అస్తిత్వాన్ని, కళకి సర్వసామాన్య ధర్మాలుగా ఉండే అంశాల్నీ, కళాతత్త్వాన్నీ వివరించే ఈ శాస్త్రాన్ని కళాతత్త్వశాస్త్రం అని పిలవడం సమంజసమనీ అందువల్ల దీన్ని “కళాతత్త్వశాస్త్రం” అనీ పిలుస్తున్నారు.

సాహిత్యంలో సౌందర్యం అనే మాటని మనం తరచూ వింటుంటాం. దీన్ని భారతీయ లాక్షణికులు ‘రసం’గా చెప్పారు. ఆస్వాదయోగ్యమైంది రసం. ఆస్వాదన ఎక్కడ జరుగుతుంది? మనకి ఇంద్రియజ్ఞానమే ఉంటేనే ‘ఆస్వాదించ’గలుగుతాం. భారతీయ లాక్షణికులు “రసం”గా చెప్పారు. ఆస్వాదన చేయగలిగేది రసం. ఆస్వాదన ఎక్కడ జరుగుతుంది? ఇంద్రియజ్ఞానం ఉంటేనే ‘ఆస్వాదించ’గలుగుతాం. చూడ్డం (చక్షువు–కన్ను), వినడం (శ్రోతం), వాసనచూడ్డం (ఘ్రాణం–ముక్కు), రుచిచూడ్డం (రసన–నాలుక), తాకడం (త్వక్కు–చర్మం) ద్వారా ఆస్వాదన చేయగలుగుతాం. వీటిని జ్ఞానపంచేంద్రియాలు అంటారు. గ్రీకులో ‘*aisthesis*” అంటే “ఇంద్రియ జ్ఞానం” అనే అర్థం. వీటిని అనువర్తిస్తూ లలితకళల్లోని సౌందర్యాస్వాదనను అధ్యయనం చేయడమే కళాతత్త్వశాస్త్రం చేసే పని.

ఒక రచనను లేదా ఒక కళను మనం ఆస్వాదించేటప్పుడు అందరికీ ఒకేరకమైన అనుభూతి కలగదు. దీనికి అనేక కారణాలున్నాయి. కొంతమందికి జ్ఞానపంచేంద్రియాల్లో లోపం కారణం కావచ్చు. మరికొంతమంది ముందుగానే కొన్ని అభిప్రాయాల్ని ఏర్పరుచుకొని ఆ రచనను లేదా ఆ కళని ఆస్వాదించే ప్రయత్నం చేస్తుంటారు. వీటన్నింటినీ కళాతత్త్వశాస్త్రం అధ్యయనం చేస్తుంది. ఈ భావాలు అధ్యయనం చేసే శాస్త్రాన్ని ఈ దష్టితో చూసేవారు పాశ్చాత్య కళాతత్త్వశాస్త్రం అని

పిలిచే అవకాశం ఉంది. అయితే, తత్త్వశాస్త్రం నుండి ప్రత్యేకంగా ఒక శాస్త్రంగా ఆవిర్భవించడమనే ఆలోచన పాశ్చాత్యుల నుండి వచ్చింది. అందువల్ల కళాతత్త్వ శాస్త్రమనగానే ఈ దిశగా పాశ్చాత్యుల ఆలోచనల అధ్యయనమనే అవగాహన కలుగడం సహజం. లలిత కళలన్నింటిలోని సౌందర్యాంశాల్ని అధ్యయనం చేసే శాస్త్రంగా దీన్ని భావిస్తున్నా, సాహిత్యంలో గల సౌందర్యాలతో కలిపి లలిత కళలన్నింటినీ విశ్లేషించడం విస్తృతంగా జరగడం లేదు. ఈ విశ్లేషణలో భాషా, సాహిత్యాంశాల్నే ప్రధానం చేసుకొంటున్నారు. అందువల్ల దీన్నే "పాశ్చాత్య కళాతత్త్వశాస్త్రం" అనీ, "పాశ్చాత్య సౌందర్య శాస్త్రం (Western Aesthetics) అని కూడా పిలుస్తున్నారు. ఈ రకమైన భావాల్ని చర్చిస్తూ కొంతమంది తెలుగులో కొన్ని వ్యాసాల్ని, పుస్తకాల్ని రాశారు.

## తెలుగులో కళాతత్త్వశాస్త్ర రచనలు:

పాశ్చాత్యులు 'ఈస్థటిక్స్' గా పిలిచే వివిధ అంశాలతో 1925లో రాసిన పురాణంసూరిశాస్త్రి *"విమర్శక పారిజాతము"* తెలుగులోకి వచ్చిన తొలి పుస్తకంగా పరిశోధకులు కొండలరావు, *ముదిగొండ వీరభద్రయ్య*పేర్కొంటున్నారు. లలిత కళలకు సంబంధించిన వివిధాంశాల్ని పాశ్చాత్య లాక్షణికులెలా చెప్పారో వాటిని వివరిస్తూ ఈ గ్రంథాన్ని రాసినట్లు రచయిత చెప్పుకున్నారు. పురాణం సూరిశాస్త్రి, పాశ్చాత్య విమర్శ చరిత్రను పరిచయం చేస్తూనే, విమర్శను, విమర్శ పద్ధతుల్నీ పేర్కొన్నారు. వీటితో పాటు కావ్య ప్రశంసను, కళారహస్యాల్నీ ఎలా అధ్యయనం చేయాలో *"విమర్శకపారిజాతము"*లో వివరించారు. *"కళా ప్రపంచమును పరిశోధించినపుడు కొన్ని సామాన్య ధర్మములగుపడును. సారస్వతమందు యీ ధర్మములే రూపభేదమున నగుపడుచుండును. కళాసౌందర్యమును, రసస్వరూపమును జర్చించు శాస్త్రము, రసవిచారణ లేక యీస్థటిక్సు అనబడుచున్నది. దీనినెరింగిన గాని, సమస్త సత్కళల సామాన్యధర్మములరసి జూచినగాని, చక్కని కావ్య విమర్శనము సాధ్యము కానేరదు"* (సూరిశాస్త్రి, 1925:197) అని కళను ఎలా అధ్యయనం చేయాలో సాధ్యమైనంత విపులంగా చర్చించారు.

పురాణం సూరిశాస్త్రి తర్వాత 1926లో బసవరాజు అప్పారావు రాసిన *"ఆంధ్రకవిత్వ చరిత్రము"* కూడా ఇటువంటి దృష్టితోనే రాశారు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, విశ్వనాథ సత్యనారాయణ, కొండూరి వీరరాఘవాచార్యులు

(కొండూరి వీరరాఘవవ్యాసావళి), గుంటూరు శేషేంద్ర శర్మ (కవిసేన మేనిఫెస్టో), డా॥తుమ్మపూడి కోటేశ్వరరావు (వేయిపడగల మణిప్రభలు), సంజీవ్‌దేవ్ (సంజీవ్‌దేవ్ వ్యాసాలు), కొండిపర్తి శేషగిరిరావు మొదలైన వాళ్ళు కళాతత్త్వ దృష్టితో తెలుగులో సౌందర్యశాస్త్రాంశాల్ని పేర్కొన్నారు. పింగళి లక్ష్మీకాంతం " సాహిత్య శిల్ప సమీక్ష"లో కళాతత్త్వానికి సంబంధించి అనేకాంశాల్ని పరిచయం చేశారు. డా॥బి. వెంకటేశం ప్లేటో, అరిస్టాటిల్ భావాల్ని, భారతీయాలంకారిక లక్షణాల్ని తులనాత్మకంగా పరిశీలిస్తూ "అరిస్టాటిల్ కావ్యశాస్త్రము" పేరుతో 1992లో ఒక పుస్తకాన్ని రాశారు. సర్దేశాయి తిరుమల రావు "విమర్శ-ప్రతి విమర్శ" పేరుతో (2002, తెలుగు విశ్వవిద్యాలయం) ప్రచురించిన పుస్తకంలో పాశ్చాత్యులు సౌందర్యం అంటే ఏమని చెప్పారో ఆ నిర్వచనాల్ని ప్రధానంగా వివరిస్తూనే, మరికొన్ని కళాతత్త్వ విషయాల్ని పేర్కొన్నారు. 1982, భారతి మాసపత్రికలో రాసిన *"సౌందర్యం -కళలో, జీవితంలో"* అనే వ్యాసంలో (పుటలు: 77 -94) సౌందర్యం గురించి పాశ్చాత్యులు (సోక్రటీసు నుండి హాజ్లిట్ వరకు) చెప్పిన వివిధ అంశాల్ని పేర్కొన్నారు.

పాశ్చాత్యులు చెప్పిన కావ్య సౌందర్య విశేషాల్ని ఒక క్రమ పద్ధతిలో వివరిస్తూ వడలి మందేశ్వరరావు *''పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర-సిద్ధాంతాలు"* (1994) రాశారు. ఈయనే *''సాహిత్య ప్రస్థానం-కొన్ని మజిలీలు"* (2002) పుస్తకంలోను కళాతత్త్వం పేరుతోనే మరికొన్ని విషయాల్ని వివరించారు. లలిత కళలకు సంబంధించిన వివిధాంశాలతో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం *"సాహిత్య శిల్ప సమీక్ష"* రాశారు. అదే పద్ధతిలో కాకర్ల వెంకట రామ నరసింహం, ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం మొదలైన వారి పుస్తకాలు కూడా తోడ్పడతాయి.

డా॥బి. సూర్యసాగర్ *"సాహిత్యం-సౌందర్యం"* లో మార్క్సిస్టు దృక్పథంతో పాశ్చాత్య సౌందర్యశాస్త్రాన్ని రాశారు. *"డా॥తక్కోలు మాచిరెడ్డి* హిందీలోని వివిధ వ్యాసాల్ని *"చీకటి నుంచి స్వప్నం దాకా"* పేరుతో ఒక వ్యాససంపుటిని (2006) ప్రచురించారు. దీనిలో క్రోచీ, గియోర్గి లూకాచ్‌ల సౌందర్యం గురించి చెప్పిన అంశాలున్నాయి. దీనిలోనే *"కళలు-సౌందర్యం-మార్క్సిస్టుదృక్పథం"*, *''సాహిత్యం-సౌందర్యం ఒక సమీక్ష"* అనే వ్యాసాల్ని ప్రచురించారు. ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య *''కళాతత్త్వ శాస్త్రం-మౌలికాంశ వివేచన (తులనాత్మక అధ్యయనం)"*

(1993) లో పాశ్చాత్య సౌందర్య శాస్త్ర అంశాల్ని విశ్లేషించారు. దీనిలో ప్రధానంగా అలంకారశాస్త్రం, విమర్శ, కళాతత్త్వశాస్త్రాలలో గల భేద, సాదృశ్యాల్ని, కళాతత్త్వశాస్త్రం అధ్యయనం చేసే వివిధ మౌలికాంశాల్ని వివరించారు. దీనితో పాటు "కళాతత్త్వశాస్త్రం–పరిధినీ, మౌలికాంశాల్నీ, ప్రాచ్య–ప్రాశ్చాత్యుల కృషినీ వివరించారు.

ముఖ్యంగాఅరవిందుడు, ఇమ్మాన్యుయేల్ క్యాంట్, సాంటాయనా, హెగెల్, క్రోచీ, ఎమర్సన్, కాలరిడ్జ్, టాగోర్, జగన్నాథపండితరాయులు మొదలైన వారి భావాల్ని తులనాత్మకంగా విశ్లేషించడంవల్ల మూలంలో గల ముఖ్యాంశాల్ని గ్రహిస్తూనే, ఆ రచనల్ని చదవాలనే ఆసక్తి కలుగేలా ఉంది. ఆంగ్ల, సంస్కృత వాక్యాల్ని బ్రాకెట్లలో ఇస్తూనే వారి అనువాదాల్ని వారి భావాల్ని తనదైన అభిప్రాయంతో వివరిస్తున్నప్పుడు మూలాన్ని రిఫరెన్స్‌గా అందించారు. కళాతత్త్వ శాస్త్రంలోని మౌలికాంశాలుగా సౌందర్యం, ప్రతిభ, అభివ్యక్తిలను చెప్పి, వాటిని అలంకారాల్లోను, భావచిత్రంలోను, ప్రతీకలను ప్రయోగించడంలోను ఎలా గుర్తించవచ్చో వాటిని తెలుగు కవిత్వానికీ, చిత్ర, శిల్ప కళలకీ అనువర్తించి చూపడం ఈ గ్రంథంలోని మరో ప్రత్యేకత. ఈ గ్రంథాన్ని ఆధారంగా చేసుకొని కొంతమంది కళాతత్త్వ దృష్టితో పరిశోధన చేశారు. కొంతమంది తమ పరిశోధనల్లో కళాతత్త్వశాస్త్రజ్ఞుల మూల గ్రంథాల కంటే, వీరభద్రయ్యగారి గ్రంథంలోని అనువాద భావాల్నే అనుసరిస్తూ పరిశోధనలు కొనసాగించారు. మూలగ్రంథాల్లోని పారిభాషిక పదాల్ని అనువదించి, పారిభాషను సృష్టించుకున్నా, వాటిని పండితుల ఆమోదం లభిస్తుందో లేదో అనే అనుమానం ఒక కారణం కావచ్చు. మరోకారణాన్ని చెప్పుకోవాలంటే, మూల గ్రంథాల్లోని భావాల్ని, పారిభాషిక పదాల్ని వివరించడంలో తెలుగు విమర్శకల్లో ఏకాభిప్రాయ ప్రకటన లోపించడమైనా కావచ్చు. తెలుగులో కళాతత్త్వాన్ని అవగాహన చేసుకోవడానికీ, అనువర్తన తెలుసుకోవడానికీ ఇంతవరకు పేర్కొన్న వ్యాసాలు, పుస్తకాలు చాలా వరకు ఉపకరిస్తాయి. వీటిలో ఒక్క గ్రంథం కూడా పూర్తిగా అనువాదగ్రంథంగా భావించే వీల్లేదు. కానీ, ఇతర భాషల్లోని భావాల్ని తెలుగులోకి ప్రచారం చేసిన రచనలుగా చెప్పుకోవడం సమంజసమనిపిస్తుంది. ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య గారి పుస్తకం ఎంతగానో ఉపయోగపడుతున్నా, ఆ శాస్త్రాన్ని క్రమపద్ధతిలో అధ్యయనం చేయడానికి వడలి మందేశ్వరరావు గారు రాసిన "పాశ్చాత్య సాహిత్య విమర్శ, చరిత్ర– సిద్ధాంతాలు" మరింతగా సహకరిస్తుంది. వీటన్నింటి కంటే భిన్నంగా ఒక అనువాదం వచ్చింది. హెరాల్డ్ హెచ్. టైటస్ రాసిన "లివింగ్ ఇష్యూస్ ఇన్ ఫిలాసఫీ

యాన్ ఇంట్రడక్టరీ టెక్ట్స్ బుక్" గ్రంథంలోని "ఈస్తటిక్స్ అండ్ ది ఫిలాసఫీ ఆఫ్ ఆర్ట్" అనే భాగాన్ని "*సౌందర్యశాస్త్రం-కళాతాత్త్వికత*" పేరుతో పొట్లూరి వెంకటేశ్వరరావు అనువదించారు. ఈ పద్ధతిలో ఇతర భాషల్లోని గ్రంథాల్ని లేదా వ్యాసాల్ని 'అనువాదం' చేస్తే, ఆ భాషల్లో ఎలాంటి భావాలు ఉన్నాయో తెలుగు వాళ్ళు అవగాహన చేసుకోవడానికి ఉపకరిస్తాయి. అలాకాకుండా, తెలుగులో యథానువాదాలుగా కాకుండా, తమ వ్యాఖ్యానంతో జోడించిన భావానువాదాలే కళాతత్త్వశాస్త్రాన్ని పరిచయం చేయడానికి ఉన్న ఏకైక ఆధారాలుగా వీటన్నింటినీ పరిశీలించడాన్ని బట్టి తెలుస్తుంది.

**ఆధార గ్రంథాలు:**


1. తిరుమలరావు, సర్దేశాయి. *విమర్శ -ప్రతివిమర్శ.* హైదరాబాదు. పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం: 2002.
2. నాగభూషణశర్మ, మొదలి. నాటక శిల్పం. హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: 2008.
3. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు: ప్రయోగములు. హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్:1989.
4. మాచిరెడ్డి, తక్కోలు. చీకటి నుండి స్వప్నం దాకా (వ్యాససంపుటి). హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్:2006.
5. మందేశ్వరరావు, వడలి. *పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర-సిద్ధాంతాలు.* హైదరాబాద్. పొట్టిశ్రీరాములు, తెలుగువిశ్వవిద్యాలయం: 1994.
6. లక్ష్మీకాంతం, పింగళి. *సాహిత్య శిల్పసమీక్ష.* హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్:1995. (ప్రథమ ప్రచురణ: 1966)
7. వీరభద్రయ్య, ముదిగొండ. , కొండలరావు. వి. *సంజీవ్‌దేవ్ వ్యాసాలు.* తెలుగు అకాడమి:1990.
8. వీరభద్రయ్య, ముదిగొండ. *కళాతత్త్వశాస్త్రం-మౌలికాంశ వివేచన.* హైదరాబాద్. జాతీయ సాహిత్య పరిషత్: 1993
9. వీరభద్రరావు, కొత్తపల్లి. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము. ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్, యూనివర్సిటీ ఆఫ్ ఢిల్లీ: 1956
10. వెంకటేశం, బి. *అరిస్టాటిల్ కావ్యశాస్త్రము.* కరీంనగర్. సరోజా పబ్లికేషన్స్:

1992.

11. సూరిశాస్త్రి, పురాణం. విమర్శకపారిజాతము. బందరు. విద్యానిలయము: 1925.
12. సూర్యసాగర్. బి. సాహిత్యం–సౌందర్యం. విజయవాడ. జనసాహితి:1995.
13. సుబ్రహ్మణ్యం, జి. వి. ఆంధ్రసాహిత్య విమర్శ– ఆంగ్ల ప్రభావం. హైదరాబాదు. షష్టిపూర్తి ప్రచురణలు:1996.
14. శివశంకర్, పాపినేని. సాహిత్యం–మౌలిక భావనలు. గుంటూరు. పాపినేని ప్రచురణలు: 1996

***

***(నేషనల్ ట్రాన్సలేషన్ మిషన్, సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్ మైసూరు వారి సౌజన్యంతో తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం వారు 9-11 సెప్టెంబరు 2011 తేదీల్లో నిర్వహించిన జాతీయసదస్సు)***

# కళాతత్త్వశాస్త్రం: మౌలికాంశాలు - అభివ్యక్తి

కళాతత్త్వశాస్త్రాన్నే కొంతమంది సౌందర్యశాస్త్రం అనీ, మరి కొంతమంది సౌందర్యానందశాస్త్రమని పిలుస్తూ దాన్ని నిర్వచించే ప్రయత్నం చేశారు.

బూదరాజు రాధాకృష్ణ గారి '*ఆధునిక వ్యవహార కోశం*'లో Aesthetics అంటే 'సౌందర్య శాస్త్రం, రసజ్ఞాన విద్య'గా పేర్కొన్నారు. (2007:7)

జి. యన్. రెడ్డి గారి '*ఇంగ్లీషు తెలుగు నిఘంటువు*'లో Aesthetics అంటే '*సుందర వస్తువుల యోగ్యతను నిర్ణయించడానికి సంబంధించిన, సౌందర్య నిర్ణయం చెయ్య గల యోగ్యత గల ఉత్తమాభిరుచికి సంబంధించిన సూత్రాల ననుసరించి ఉన్నది*' అని పేర్కొన్నారు. (2001:19)

ఎస్. ఎస్. నళిని గారి '*సాహిత్య విమర్శపదాల డిక్షనరీ*'లో Aesthetics అంటే '*కళా సౌందర్య వాదం, శుద్ధ కళావాదం, సౌందర్య శాస్త్రం*' అని పేర్కొన్నారు. సౌందర్య శాస్త్రాన్ని '*సౌందర్య స్వభావాన్నీ, దృక్పథాన్నీ తాత్త్వికంగా నిర్ధారించే, అంచనా వేసే ప్రయత్నాన్నికి సంబంధించిన శాస్త్రం*' అని సాహిత్యానికి వస్తే, సాహిత్య సిద్ధాంతాలను రూపొందించి కళను గురించీ, కళాత్మక అభిరుచిని గురించి చర్చించడం జరుగుతుందని పేర్కొన్నారు. (1999:196, 221)

"సంవేదనల తత్త్వ చింతనే సౌందర్య శాస్త్రం" అని కాంట్ పేర్కొన్నారు (Comparative Aesthetic: K. C. Pandey; Page-294) ''అభివ్యక్తి (*Representative or imaginative)* వ్యాపార శాస్త్రమే ఈస్తటిక్స్" అని క్రోచీ పేర్కొన్నారు. *"సౌందర్యానంద అనుభూతి, సౌందర్యానందవైఖలి, సౌందర్యానంద గుణం, సౌందర్యానంద విలువల అధ్యయనమే సౌందర్యానందశాస్త్రం"* అని హారోల్డ్ హెచ్. టిటస్ నిర్వచించాడు. (సౌందర్యశాస్త్రం-కళాతాత్త్వికత, 2003:2)

కళాతత్త్వశాస్త్రం లలితకళలన్నింటిలోని తాత్త్వికాంశాలను చర్చిస్తుందని

తెలుస్తుంది. ఈ శాస్త్రం మౌలికతత్త్వాలుగా సౌందర్యం, ప్రతిభ, అభివ్యక్తి అనే మూడింటినీ ప్రధానంగా వివేచిస్తుంది. వీటితో పాటు కళాసృజనకు కారణమైన అంశాలను కూడా ఈ శాస్త్రం అధ్యయనం చేస్తుంది. ఇక్కడ అభివ్యక్తి గురించి చర్చించుకుందాం. కవికీ, కళాకారుడికీ చాలా దగ్గర పోలికలున్నాయి. తెలుగు కవులు, లాక్షణికులు కూడా కవుల ప్రతిభ గురించి వివరించే సందర్భంలో అభివ్యక్తికి సంబంధించిన అనేకాంశాలను వివరించారు. అప్పకవి కవి గురించి ఇలా వివరించాడు.

***"ఇమ్మహిని మునులచే వెల***
***సెమ్మును కావ్యమ్ములు 'నా నృషి: కురుతే కావ్య***
***మ్మ'ను వచనార్థంబే***
***సమ్మతి కలివేళ సుకవి జనులే మౌనుల్"***

(అప్పకవీయం, 43 వపద్యం)

***కవయ: క్రాంతి దర్శన: అనే లోకోక్తి.***

కవిని రోమన్లు Vates అంటారు. అంటే ముందుగా దర్శించగలవాళ్ళు అని అర్థం. గ్రీకు సాహిత్యంలో Muse మన తెలుగు వారు భావించే సరస్వతి వంటిది. గ్రీకు కవులు వీబంవ అనే దేవత కవిని స్పందింపజేస్తుందని నమ్ముతారు. కవిని గ్రీకులు Poietes (పోయిటెస్) అంటారు. అంటే సృష్టి కర్త అని అర్థం. భట్టతౌతుడు కవిని వర్ణనల చేత దార్శనికతను కలుగు జేసేవాడన్నాడు. – "దర్శనాద్వర్ణనాచ్ఛాదా రూఢా లోకే కవిశ్రుతి:కవికి సమకాలీన విషయాలే కాకుండా, గతం, భవిష్యత్తుకి సంబంధించిన విషయాల్ని దర్శించగల నేర్పు ఉండాలి. దీన్నే ఋషి తుల్యత అనీ, 'నా నృషి: కురుతే కావ్యమ్' అనడం.

P. B. Shelly (A Defence of Poetry) 'Poets, according to the circumstances of the age and nation in which they appeared, were called, in the earlier epochs of the world, legislators or prophets, a poet essentially comprises and unites both these charters, for he not only behold intensely the present as it is, and discovers those laws according to which present thing ought to be ordered, but he behold the future in the present.'

కవి త్రికాలజ్ఞుడై ఉండాలి. హోమర్ తన ఇలియడ్, ఒడిస్సీ కావ్యావతారికలో కావ్యం రాయడానికి దైవప్రేరణ కారణం అన్నాడు. కావ్యం రాయడానికి దివ్యావేశం

అవసరం అనేది ఒక సిద్ధాంతం. కవి కావ్యాన్ని దైవప్రేరణతో రాస్తాడు. దాన్ని గాయకుడు దివ్యావేశంతో ఆలపిస్తాడు. క్రీస్తుకు పూర్వ ఐదవ శతాబ్దం నాటికి గ్రీకులో తాత్త్విక చింతన ప్రారంభమైంది. ఐదవ శతాబ్ది చివరిలో Satire లో అక్కడక్కడా విమర్శ కనిపిస్తుంది. Aritsophanes తన Frogs (405 BC) లో పదాడంబరాన్ని నిరసించి, ఉదాత్తపాత్రలను చిత్రించాలన్నాడు. యురిపిడిస్ సామాన్యుల భాషను కావ్యంలో ప్రవేశపెట్టాలన్నాడు. ప్లేటో ION లో కావ్యం దివ్యావేశం వల్ల పుడుతుందనీ, తార్కికత లోపిస్తుందనీ అన్నాడు.

Republic లో కావ్య ప్రయాజనాన్ని చర్చించాడు.

1. ఆదర్శ రాజ్య వ్యవస్థ నిర్మాణం,
2. ఆదర్శ వ్యక్తిని తీర్చిదిద్దడం కావ్య ప్రయోజనాలు అన్నాడు. కళతో సహా నీతినీ, సత్ప్రవర ధర్మాన్ని ప్రేరేపించేవిగా ఉండాలి. దుర్మార్గులంతా సుఖంగాను, సన్మార్గులంతా కష్టాలతోను ఉన్నట్లు, సత్ప్రవర్తన వల్ల ఇతరులకు మేలు కలిగినా, తనకు నష్టం కలుగుతుందనే భావం కలిగేటట్లు విషాదాంత రూపకాలు రాసే వాళ్ళు రాస్తారని ప్లేటో భావించాడు. కావ్య వస్తువు(ఇతివృత్తం) నైతిక విలువల్ని దిగజారుస్తుందని ప్లేటో అభిప్రాయపడ్డాడు. పాశ్చాత్య కళాతత్త్వశాస్త్రంలో మరోముఖ్యమైన భావన అనుకరణ సిద్ధాంతం. దీన్ని అరిస్టాటిల్ ప్రతిపాదించాడు. దీనిలో కెథార్సిస్ కి దగ్గర్లో ఉండేదే భారతీయ లాక్షణికులు ప్రతిపాదించిన రససిద్ధాంతం. కానీ, రససిద్ధాంతం పరిధి చాలా విస్తృతమైంది. ఇవన్నీ కళాతత్త్వశాస్త్రతులనాత్మక అధ్యయనంలోని అంశాలు. అలాగే పాశ్చాత్యుల్లో హొరేస్ కావ్యహేతువుల్లో ప్రతిభ గురించి చెప్తూ... దివ్యావేశం, భవ్యావేశం, భవ్యకవితావేశం వంటి పదాలను ప్రయోగించారు. ఈ దివ్యావేశం కావ్యంగా మారేక్రమాన్ని భారతీయ లాక్షణికుల్లో రాజశేఖరుడు ప్రతిభను 'కారయిత్రి, భావయిత్రి' అని రెండు రకాలుగా ఉంటుందని వివరించాడు. ఇలా వివరించడంలో అభివ్యక్తి విధానం ఉంది.

## "అభివ్యక్తి" అర్థవివరణ:

కళాతత్త్వశాస్త్ర మౌలికాంశాల్లో 'అభివ్యక్తి' ఒకటి. 'అభివ్యక్తి' శబ్దానికి నిఘంటుకారుడు 'ప్రతిబింబం' అనే అర్థాన్నిచ్చాడు. 'అభివ్యక్తీకరించు' పదానికి 'తెలియజెప్పుట' అనీ; 'అభివ్యాపించు' క్రియా పదానికి అనీ 'మిక్కిలిగా అలముకోవడం,

మిక్కలిగా వ్యాపించడం' అనే అర్థాలున్నాయి. 'విషయాన్ని చెప్పేపద్ధతి'ని లేదా "విషయాన్ని వివరించే విధానాన్ని" అభివ్యక్తిగా చెప్పొచ్చు

ఆంగ్ల నిఘంటువులు కూడా ఈ రకమైన వివరణలనే ఇచ్చాయి. Express అనే పదానికి 1. Represent or mae known (thought, feelings, etc) in words or by gesture, conduct, etc. 2. Say what one thinks or means. 3. Represent by symbols.

'అభివ్యక్తికి సంబంధించిన శబ్దార్థాల్ని పరిశీలించినప్పుడు మనభావాల్ని ఏదొక రూపంలో వ్యక్తీకరించడమే అభివ్యక్తి అని తెలుస్తుంది. అది మాట (ధ్వని), గాని, శబ్దం గాని, సంకేతం ద్వారా గాని మన భావాల్ని పంచుకోవడానికి ఒక మాధ్యమం. దీని ద్వారా మన ఆలోచనల్ని, మన అనుభూతుల్ని, మన కోపతాపాల్నీ వ్యక్తీకరించవచ్చు. అభివ్యక్తి సాధారణంగా రెండురకాలుగా ఉంటుంది.

మొదటిది: మన అనుభూతుల్ని కళాత్మకంగా వ్యక్తీకరించడం. దీని స్వీయాభిప్రాయాలు ఉంటాయి. దీన్ని ఆత్మానుభవ వ్యక్తీకరణ పద్ధతిగా పిలుస్తున్నారు.

రెండవది: ఏదైనా ఒక సాధారణ వస్తువుని ఎన్నుకొని ఆ వస్తువుకి సంబంధించిన విషయాల్ని ఉన్నది ఉన్నట్లుగా తనకు తెలిసిన భాషలో తటస్థంగా వ్యక్తీకరించడం. ఇది వస్తుగతమైన వ్యక్తీకరణ. అందువల్ల దీన్ని వస్తుగత వ్యక్తీకరణ పద్ధతిగా పిలుస్నున్నారు.

వీటిలో మొదటిదే కళకు సంబంధించిన అభివ్యక్తి. ఇదే కళాతత్త్వశాస్త్రంలో ఒక మౌలికాంశంగా గుర్తిస్తున్నారు. చిత్రకళ, శిల్పకళ, వాస్తుకళ, సంగీతం, సాహిత్యం, నాట్యం వీటిని లలితకళలు అంటారు. ఈ కళల్లో వివిధ రకాలుగా ఈ అభివ్యక్తి విధానాలుంటాయి. కళాకారుడు లేదా సృజనకారుడు తాను చెప్పాలనుకున్న వస్తువుని కళాత్మకంగా వ్యక్తీకరించాలనుకుంటాడు. అందుకనే 'వస్తు *రహస్యాన్ని రూపొందించే ప్రయత్నమే అభివ్యక్తీకరించడం'* అని విమర్శకులు ముదిగొండ వీరభద్రయ్య అభివ్యక్తిని వివరించే ప్రయత్నం చేశారు.

సాహిత్యంలో భాషాశైలీ, అలంకారాలు, ధ్వనీ, వక్రత, భావచిత్రాలు, ప్రతీకలు మొదలైన వాటి ద్వారా ఈ అభివ్యక్తి జరుగుతుంది. సాహిత్యంలో భాష అనేది అభివ్యక్తికి మౌలిక ఉపకరణంగా చెప్తూ, భాషను శక్తివంతంగా ఉపయోగించు కోవడమనే విద్య తెలిసినప్పుడే కవి మొట్టమొదటి మెట్లు ఎక్కగలుగుతాడని, దాని వల్ల సౌందర్యాన్ని నిక్షిప్తం చేయగలుగుతాడని విమర్శకులు అన్నారు. ఇలాంటి భాషా

ప్రయోగాన్నే ఆంగ్ల సాహితీవేత్తలు Poetic Diction అన్నారు. ఈ కావ్యభాష గురించి ముదిగొండ వీరభద్రయ్య ఇలా అన్నారు. *"అభివ్యక్తి అన్న శబ్దాన్ని మామూలు వ్యావహారికార్థంలో అర్థం చేసుకోకూడదు. అక్కడ ఉద్దేశ్యం అర్థం అవడం మాత్రమే. అంటే కమ్యూనికేషన్ మాత్రమే. ఆ ప్రయోజనం కోసం భాషనెంత సూటిగా, స్పష్టంగా, డొంకతిరుగుళ్ళు లేకుండా ప్రయోగిస్తే అటు వ్యవహర్తకీ, ఇటు శ్రోతకీ అంత లాభం. కాని కవితా కళలో ఈ కమ్యునికేషన్ ఇంకొక భూమికలోంచి జరుగుతుంది. తత్ఫలితంగా శ్రోతకి ఆ సమాచారం స్మృతిలోని అంశంగా మారడమన్నదే ముఖ్యప్రయోజనం కాక, ఆవేశ చైతన్యంలో అనుభూతిగా మారడమన్నది అత్యంత ప్రధాన ప్రయోజనం అవుతుంది"* (పుట:208)

దీనిలో కవి పొందిన ఆవేశం, అనుభవంగా మారి మళ్ళీ దాన్ని అభివ్యక్తి ద్వారా శ్రోతకి అనుభూతమైయ్యేటట్లు చేయాలన్నమాట. కళాకారుడు తాను పొందిన అనుభవం గానీ, అంతకు మించిన అనుభూతిని గాని శ్రోతకి పంచిపెట్టాలంటే దాన్ని అభివ్యక్తీకరించే మాధ్యమాన్ని శక్తివంతంగా ఎన్నుకోవాలి. ఇది నిత్యనూతనంగా ఉంటే బాగుంటుంది. నవనవోన్మేషణంగా ఉండాలి. దీన్ని వీరభద్రయ్యగారిలా చెప్పారు. *"ఒక అరిగిపోయిన ప్రయోగం, ఒక కవి సమయం, సిద్ధ అలంకారం, కృత్రిమానుకరణం–ఇవన్నీ అనుభూతికి అడ్డంకులు. అందుకని ఏ కవి కొత్తరీతులతో అభివ్యక్తీకరిస్తాడో అతని కవిత్వం రుచ్యమానమవడం అనుభవంలోని విషయమే"*

"కవి చెప్పదలచుకున్న విషయం (Subject) రచనలో కళాత్మకంగా మారిన తర్వాత అది వస్తువు (Content) అవుతుంది. ఆ విషయాన్ని కళాత్మకంగా చెప్పడానికి తీసుకొనే మాధ్యమమే రూపం (Form) గా చెప్తున్నారు. అందువల్ల వస్తువు, రూపం విడివిడిగా ఉండవు. రెండూ ఒకదానితో ఒకటి పెనవేసుకొనే ఉంటాయి. దీన్నే మరింత సూక్ష్మవిశ్లేషణతో చూసినప్పుడు రూపానికి బహిర్నిర్మాణం, అంతర్నిర్మాణం ఉంటుందని వింగడించుకొనే వీలుంది. పద్యం, వచనకవిత్వం, మినీ కవిత్వం, దీర్ఘకవిత్వం వంటివన్నీ బహిర్నిర్మాణరూపంగాను, కవిత్వ అంతర్నిర్మాణరూపంలో భాష, శైలి, అలంకారం, భావచిత్రం, ప్రతీకలు వంటివన్నీ ఒక సముదాయంగా కనిపిస్తాయి. ఇవన్నీ కవిత్వాభివ్యక్తికి చెందిన అంశాలు.

*''ఒక రచన యొక్క అంతర్గత సమీకరణ (Inner Organisation) సుస్థిర నిర్మాణం (Structure) సాహిత్య రూపం అవుతాయి. ఆ రూపం వస్తువుని ప్రత్యేకవ్యక్తీకరణల ద్వారా వెలిబుచ్చుతుంది"* అని పాపినేని శివశంకర్ సాహిత్య

రూపాన్ని నిర్వచించారు. (పు:79, కవిత్వంలో రూపం గురించి చర్చించేటప్పుడు రూపవాదం, రూపపరిణామాల మధ్య గల భేదాల్ని గుర్తించాలి. ఎలా చెప్పాలనేది రూపవాదానికి సంబంధించింది. చెప్పే వస్తువుకంటే చెప్పే విధానానికే రూపవాదంలో ప్రాధాన్యత ఉంటుంది. చిత్రకళలో రంగు, కాన్వాస్, రేఖలు మొదలైన వాటితోను; శిల్పకళలో ప్రతిమలు, వాస్తు కళలో భంగిమలు, శిల్పాకృతులు; సంగీతంలో రాగం, తాళం, లయ వంటివి; నాట్యంలో అభినయం వంటివన్నీ కళాభివ్యక్తీరణ మాధ్యమాలు.

అభివ్యక్తి ప్రధానధ్యేయం–తన అనుభూతిని ఇతరులకు అనుభవంలోకి వచ్చేటట్లు చేయడం. కళాకారుడు అనుభూతిలోకి తీసుకొచ్చేదేమిటనుకొంటే, ఆ వస్తువు వల్ల పొందిన సౌందర్యానుభవం. ఈ సౌందర్యానుభం, సౌందర్యానుభూతిని సాధారణంగా తనకు కలిగిన ఇంద్రియజ్ఞానం నుండి ఇతరుల ఇంద్రియానుభూతిగా మార్చేప్రయత్నం చేస్తాడు. కళాకారుడు సౌందర్యానుభూతిని దృశ్య, శ్రవణా ఇత్యాదులనుండి ఉద్భవించేలా చేస్తాడు. వీటిని వివిధ కళాత్మకరూపాలతో ఉద్వేగపరుస్తాడు. అందుకనే సౌందర్యానుభూతిని నాలుగు సాధనాల మాధ్యమం (Media), సాంకేతికత (Technique), రూపం (Form), విషయం (Content) గా గుర్తించవచ్చునని విమర్శకులు సూచించారు. వీటన్నింటిలోను అభివ్యక్తికి సంబంధం ఉన్నప్పటికీ ప్రధానంగా 'రూపం' అనేదానిలోనే మనం చర్చించుకునే 'అభివ్యక్తి'కి సంబంధించిన అంశాలున్నాయి.

## మాధ్యమం:

ఏదైనా చెప్పాలనుకున్న "విషయం" ఒక కళారూపం నుండి మరో కళారూపానికి మారేటప్పటికి ఆ విషయం కూడా మారుతున్నట్లుంటుంది. చిత్రలేఖనంలోని విషయం, శిల్పకళలోకి మారేటప్పుడు ఆ విషయం భిన్నంగా మారిపోతుంది. అదే విషయం సాహిత్యంలో ఒకలా, సంగీతంలో మరోలా మార్పుకి గురవుతుంది. దీని వల్ల సౌందర్యానుభూతిలో వ్యత్యాసం గోచరిస్తుంది. సౌందర్యానుభూతికి మాధ్యమం కూడా ప్రధానమే.

## సాంకేతికత:

*"కళాత్మక వస్తువు నిర్మాణానికి ప్రత్యేకమైన నియమబద్ధత ఉంటుంది. ఉదాహరణకు క్యూబిజం. ఇందులో కూడా కళాకారుడు తన నియమబద్ధతను*

*ఆచరణలో పెట్టే సమయంలో తన నైపుణ్యాన్ని కడా చూపుతాడు. అంటే అతనికి తానెంచుకున్న విషయం తో వ్యవహరించే సామర్థ్యం కూడా వుంటుంది. ఒక సంగీత నృత్య ప్రదర్శనం అద్భుతంగా వుంటుంది. మరొకటి సామాన్యంగా వుంటుంది. ఇంకొకటి పేలవంగా వుంటుంది. ఈ తేడాలకు కారణం కళాకారుడు ఎంచుకున్న టెక్నిక్ లో వుంటుంది. కళారూపంలోని చైతన్యం పై మనకు చైతన్యం వుంటే రసానుభూతి సుసంపన్నమౌతుంది"* కళాకారుడు తీసుకున్న టెక్నిక్ పట్ల ఆస్వాదకుడికి కూడా ఆసక్తి, దాన్ని అర్థం చేసుకొనే శక్తీ ఉన్నప్పుడు మాత్రమే ఆ కళలోని సౌందర్యానుభూతి అందుతుంది.

**రూపం:**

దీనిలో కళకు సంబంధించిన ఐక్యత, క్రమం, లయ, తుల్యత, సమ్మేళన సౌష్టవాల మధ్య సమతుల్యత, సమగ్రత, గంభీరత అనేవి ఉండాలి. కళను ఆవిష్కరించడానికి కావలసిన అభివ్యక్తి అంశాలన్నీ దీనిలో ఉండాలి. విషయాన్ని వస్తువుగా, వస్తువుని కళగా మార్చేది రూపమే. దీన్నే కళాభివ్యక్తి అంటారు. 'రూపం' అభివ్యక్తి ఎలా అవుతుందనే వాళ్ళుండొచ్చు. కానీ, అసలు వస్తువు, రూపం వేర్వేరు కాదనే వాళు ్లన్నట్లే, రూపం అనేది అభివ్యక్తిలో అంతర్నిర్మాణమేనని మనం పైన నిర్వచనంలో చూశాం. అలాగే అసలు కళకీ, అభివ్యక్తికీ భేదమే లేదనే ఆలోచనలూ ఉన్నాయి.

*"అభివ్యక్తతే కళ అనే దృక్పథానికి, భావాల పరస్పర మార్పిడి కళ అనే దృక్పథానికి సంబంధం ఉంది. కాని ఈ రెండింటి మధ్య చిన్న తేడా వుంది. అది ఆశయానికి సంబంధించింది. కళలో మనం కొంత లోతైన భావావేశాన్నీ, కొంత అంతర్ దృష్టినీ, కొంత సహజ జ్ఞానాన్ని వ్యక్తం చేస్తామని కొందరంటారు. వాటిని మనం సంపూర్ణంగా, సాధారణ భాషలోను, ముఖ కవళికలోనూ వ్యక్తం చేయలేము. ఈ అంతర్ దృష్టిని వ్యక్తం చేయడం కళాకారుని ప్రబలమైన ఆసక్తి.*

*"కళాత్మక ఉద్వేగం కొన్ని ప్రత్యేక విషయాలను ఎంపిక చేసుకుంటాడు. అద్భుతంగా అభివ్యక్తం చేయగల రూపాలనూ, సామగ్రినీ కోరుకుంటాడు. కళాకారుని అభీష్టత, ఉత్తేజం లేక విలువల ఫ్లిత యొక్క అభివ్యక్తతే కళాసృష్టి.* అందువల్ల రూపంలోనే అభివ్యక్తి అనేది ఉందనీ, అదే కళాసృష్టికి కారణమనీ, దానివల్లనే కళాకారుడు సౌందర్యాన్ని ఆస్వాదించేలా చేయగలుగుతాడని అర్థమవుతుంది.

**విషయం:**

కళాకారుడు లోకం నుండి లేదా మానసిక లోకం నుండి తీసుకొనేదే విషయం. దీన్ని మానవుల నుండి గాని మానవేతరుల నుండి గానీ పశుపక్ష్యాదుల నుండి గాని ఎక్కడి నుండైనా తీసుకోవచ్చు. వివిధ అనుభూతులను కూడా విషయంగా స్వీకరించవచ్చు. కళాకారుడు కళకు కావలసిన విషయంగా *"జంతువులు, సూర్యాస్తమయాలు, వృక్షాలు, పచ్చికమైదానాలు, జలపాతాలు, సాహసకృత్యాలు, ప్రేమ, ద్వేషాలు... . నిత్యజీవితానికి సుపరిచిత సంబంధం కలిగినవై వుండొచ్చు లేక అవి భావోద్వేగాలు, భావముద్రలు, సంకేతరూపంలో వున్న అంతరంగ చిత్రణలు కావచ్చు. కళాకారుడు తన కళారూపంలో మనం పరిశీలించలేని, మన ప్రపంచం యొక్క రీతిరూపాలనూ, తన అంతర్ దృష్టిని ప్రదర్శించవచ్చు"* ఇవన్నీ నిత్యజీవితానికి సుపరిచితమైనవిగానీ, పరిచయంలేనివి గానీ ఏవైనా కావొచ్చు. కానీ, కళాకారుడు తీసుకున్న విషయం (Subject) కళకి ఒదిగే వస్తువు (Content) గా మార్చగలిగేదే అభివ్యక్తి (Expression). ఈ అభివ్యక్తి ఆత్మాభివ్యక్తిగా మారి, సహృదయాభి వ్యక్తిగా వ్యక్తం కావాలి. అప్పుడే కళాకారుడు తీసుకున్న విషయాన్నిస్వాదకుడు ఇంద్రియాను భూతితో దానిలోని సౌందర్యాన్ని ఆస్వాదించగలుగుతాడు.

**కళావాదాలు**

"కళ" అంటే ఏమిటో నిర్వచించడం సుభమైన విషయమేమీ కాదు. కానీ ప్రయత్నిస్తే అసాధ్యమూ కాదు. కళను కళాకారులు భిన్నవిధాలుగా నిర్వచించే ప్రయత్నం చేశారు. "వ్యక్తి భావోద్రేకాన్ని బహిర్గతం చేసే క్రియ కళ" అని డా॥ కాశీభట్ల విశ్వనాథం నిర్వచించారు. ఈయనే కళను మరికొన్ని చోట్ల ఇలా వివరించారు. *''లయ వివిధ అవతారాలే లలితకళలని మరొక అర్థవంతమైన నిర్వచనం. రేఖ రంగులలో లయ ఆవిష్కరణ పొంది చిత్రలేఖనమయింది. నాదంలోని లయ సంగీతం, అంగభంగిమలలోని లయ నృత్యం. వాక్కులోని లయ కవిత్వం"* అని వివరించి, *"లోకోత్తరమైన ఆనందాన్ని ఇవ్వగలిగినదే కళ అని, ఆనందాన్ని ఇవ్వగల రూప సృష్టి కళ అని సర్వులూ ఆమోదించగల నిర్వచనం"* అన్నారు. సంజీవదేవ్ *" మానవుని ద్వారా సృజించబడే కౌశలాన్ని కళ అంటాం"* అన్నారు.

లలితకళల్లో చిత్రకళ ఒకటి. చిత్రకళలో నేచరిలిజం, ఎక్స్ ప్రెషనిజం, క్యూబిజం, ఫ్యూచరిజం, డాడాయిజం, సర్రియలిజం మొదలైన అనేక కళావాదాలు వచ్చాయి.

తర్వాత అవి సాహిత్యరంగంలోను ప్రవేశించి చర్చోపచర్చలకు కారణమైయ్యాయి. అందువల్ల వాటిని కొంతవరకు సౌందర్యశాస్త్రంలో కళాతత్త్వ అంశాలుగా గుర్తిస్తున్నారు. పైన పేర్కొన్న వాదాలన్నింటినీ సంజీవదేవ్ స్థూలంగా మూడు వాదాలుగా వింగడించవచ్చన్నారు. అవి: 1. వాస్తవికతా వాదం (Realism) 2. ఆదర్శవాదం, (Idealism) 3. కాల్పనిక వాదం (Expressionism) మూడో దే ప్రధానంగా "అభివ్యక్తివాదం" అని సాహితీవేత్తలు పిలుస్తున్నారు. వీటిని ఈ మూడు వాదాలుగా వింగడించక ముందున్నపేర్లతోనే ఆ వివిధ వాదాలను సంక్షిప్తంగా చూద్దాం. ఇటలీ, ఫ్రాన్సు, ఇంగ్లండుదేశాల్లో ఈవాదాల ప్రభావం ఎక్కువగా కనిపించింది.

**ఫ్యూచరిజం (భవిష్యవాదం) :**

ఇటలీలో మెరినెట్టి (పూర్తి పేరు: Filippo Tommaso Emilio Marinetti) అనే రచయిత నాయకత్వంలో 1909లో Futurist Manifesto ప్రకటించారు. ఈయన 22 డిసెంబరు 1876 తేదీన జన్మించి, 2 డిసెంబరు 1944 మరణించారు. భవిష్యవాదం- పాతసాహిత్యాన్ని, కళారూపాల్ని ధ్వంసం చేసి, ఆశిథిలాల నుండి నూతన సృష్టి జరగాలని భావించింది. ప్రపంచానికి యుద్ధం ఒక్కటే ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుందని ఈ వాదం నమ్మింది. వార్తాపత్రికల శీర్షికల నుండి, యంత్రాల నుండి కవితా వస్తువుల్ని స్వీకరించాలని ప్రబోధించింది. ధ్వనులే సంగీతమని, మాటలే కవిత్వమని, రంగులే శిల్ప చిత్రాలని ప్రకటించింది. 1912లో దీని ప్రభావంతో రష్యాలో Futurist Manifesto ప్రకటించారు. టాల్‌స్టాయ్ వంటి వారి రచనల్ని నాశనం చేయాలని భావించారు.

**డాడాయిజం (విధ్వంసవాదం):**

Tristan Tzara (1896 ఏప్రిల్ 16వ తేదీన జన్మించారు. డిసెంబరు 25, 1963 మరణించారు.) రొమీనియన్, ఫ్రెంచి కవి, కళాకారుడు. ఇతనినాయకత్వంలో 1916లో Dada Manifesto ప్రకటించారు. మొదటి ప్రపంచయుద్ధం ఫలితంగా డాడాయిజం వచ్చింది. యుద్ధానంతరం కలిగిన నిరాశా, నిస్పృహలనుండి వచ్చిన వాదం. సాహిత్యంలోగానీ, వస్తువులోగాని, భావంలోగానీ, రచనాక్రమంగాని ఉండవు. అర్థరహితమైన వాక్య విన్యాసం ఉంటుంది. అయోమయమైన శీర్షికలు పెడతారు.

## సర్రియలిజం (అధివాస్తవికవాదం)

André Breton డాడాయిజం నుండే ఈ సర్రియలిజం వచ్చినప్పటికీ, రెండవ ప్రపంచయుద్ధ కాలం నాటికి ఇదొక తాత్త్విక దృక్పథంగాను, సాహిత్య సిద్ధాంతంగాను ప్రపంచవ్యాప్తమైంది. 1919లో బీజం పడి1924లో ప్రెంచి కవి André Breton (1896- 1966) నాయకత్వంలో Manifesto of Surrealism ప్రచురించారు. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ దీనికి వెన్నుముక వంటింది. వ్యక్తావ్యక్తావస్థ దీనిలో ప్రధానం. హేతుబద్ధమైన చదువుల వల్ల మానవుడు బాల్యదశలో అనుభవించిన అనుభూతులు వ్యక్తావ్యక్తంగావ్యక్తమైనప్పుడే రూపు దిద్దు కుంటాయని ఈ ఉద్యమం భావించింది. దీన్ని సాధించటానికి గతాన్ని, సంప్రదాయాన్ని నిరసించేవారు. వ్యంగ్యం, అధిక్షేపం, హాస్యం, అవహేళనం వంటి శైలిలో రాసేవారు. సౌందర్యానికి, నీతినియమాలకు సంబంధించిన ప్రాచీన సూత్రాల్ని పాటించేవారు కాదు. స్వప్నస్థితిలోని చైతన్యానికి అగ్రతాంబూలం ఇచ్చి, శబ్దాలతో చిత్రమైన గారడీలు చేసేవారు. అంతకు ముందున్న సంవిధానం మీద తిరుగుబాటు చేయడం వల్ల దీన్ని కొంతమంది పురోగామి దృక్పథంగానే భావించారు. అయితే, హేతుబద్ధతని పట్టించుకోకపోవడంతోను, అవ్యక్తతలోని వ్యక్తావ్యక్త అనుభూతులకు అగ్రస్థానం ఇవ్వడం వల్ల ఇది కొంతకాలానికి అరాచకధోరణిగా మారిపోయింది. సమకాలీన సమాజానికి, సామాజిక చైతన్యానికి దూరమైపోయింది. క్రిస్టఫర్ కాడ్వెల్ అధివాస్తవికవాదులు అభ్యుదయవ్యతిరేకధోరణిని అవళంబించారని నిరసించాడు.

## భావచిత్రవాదం(Imagism):

ఆంగ్ల సాహిత్యంలో కాల్పనికోద్యమం తర్వాత ఉద్యమంలా భావచిత్రవాదం వచ్చింది. ఈ భావచిత్రవాదాన్ని విస్తృతంగా ప్రచారం చేసిన వారిలో ఎజ్రాపౌండ్(1885 -1972) ముఖ్యుడు. అమెరికా కవి, విమర్శకుడైన ఇతని పూర్తిపేరు : Ezra Weston Loomis Pound. ఇతని రచనల్లో *Ripostes* (1912), *Hugh Selwyn Mauberley* (1920) *The Cantos* (1917-69) ప్రసిద్ధమైనవి.

కవిత్వంలో తక్కువ పదాలతో రచనాశైలిని ఉండాలని, దాని ద్వారా పాఠకుడికి అనుభూతి సాంద్రతపెరుగుతుందని భావిస్తూ వచ్చిందే భావచిత్రవాదం. పలుకుబడిలో, పదబంధంలో, రచనారీతుల్లో గతానుగతికమైన ధోరణిని, దీర్ఘగీతాల్ని నిరసిస్తూ కథ, వర్ణనలు అచ్చమైన కవితాత్మకు నిదర్శనమని, వీటిని చక్కని భావచిత్రాలుగా

అందించవచ్చుననీ, అదే ఉత్తమకవిత్వమనీ భావించిన ఉద్యమం. ఇది 1914లో ప్రారంభమై 1917 నాటికి మూడు కవితా సంకలనాలతో ముందుకి వెళ్ళింది. విషయాల్ని సూటిగా అందుకొనేటట్లు వర్ణించడం, వ్యక్తీకరణలో సంక్షిప్తతను పాటించడం, మనసులో భావాన్ని రూపుకట్టుకొనేట్లు భావచిత్రాల్ని శబ్దార్థాల ద్వారా వర్ణించడం, అంతర్లయను పాటించడం వంటివన్నీ భావచిత్రలక్షణాలుగా కవులు భావించారు. జపానులో వచ్చిన టంకా (Tanka), హొక్కు (Hokku) వంటి ఛందోరీతుల్లో కవిత్వాన్ని సంక్షిప్తంగా అందించవచ్చని ఆంగ్లకవులు భావించారు.

**భావచిత్రం స్వరూప స్వభావాలు:**

"భావచిత్రం" అనే మాట Image అనే ఆంగ్లపదానికున్న అర్థంతో సమానమైంది. దీనికే పదచిత్రం, శబ్దచిత్రం, బింబం, ప్రతిమ అనే పర్యాయపదాలు కూడా వ్యవహారంలో ఉన్నాయి. ఇస్మాయిల్ 'పదచిత్రం' అనీ; గుంటూరు శేషేంద్రశర్మ 'బింబం' అనీ; తుమ్మపూడికోటేశ్వరరావు 'ప్రతిమ' అనీ ప్రయోగించారు. డా.సి.నారాయణరెడ్డి కూడా భావచిత్రమనే వ్యవహరించారు. భావచిత్రాన్ని కళాతత్త్వశాస్త్రంలో ఒక అభివ్యక్తి విధానంగా ప్రాచుర్యంలోకి తీసుకొచ్చిన ఆచార్య ముదిగొండవీరభద్రయ్య 'భావచిత్రం' అనే వ్యవహరించారు. పదచిత్రం అనేది పదాలతో రూపకల్పన చేయడమనే అర్థాన్ని స్ఫురిస్తున్నప్పటికీ భావనా పార్శ్వం కనిపించడంలేదు. 'ప్రతిమ' అనే పదం శిల్పకళకు సంబంధించింది. మూర్తి కట్టడం అనే ప్రక్రియ ఈపదంలో స్ఫురిస్తున్నా, భావచిత్రానికి ఉండే చలన లక్షణం దీనిలో లేదు. 'బింబం' అనే పదం ఒక వస్తువు ఉన్నదున్నట్లుగా చిత్రీకరించడమనే అర్థం స్ఫురింపజేస్తుంది. కవి భావనలో దృశ్యాలు కొన్ని స్థిరంగా ఉంటాయి. మరికొన్ని చలనలక్షణాన్ని కలిగి ఉంటాయి. ఇదంతా కవి సృజనలో ఉంటుంది. అందువల్ల 'భావచిత్రం'అనే పారిభాషిక పదమే 'image'కి సరిపోతుందని భావచిత్రం గురించి పరిశోధన చేసిన వారి అభిప్రాయం. కవి తాను చూసిన లేదా తాను అనుభవించిన లేదా తాను వివరించాలనుకున్న భావాల్ని కళాత్మకంగా చూపించేప్రయత్నం భావచిత్రరచనలో జరుగుతుందని తెలుస్తుంది. దీన్ని బట్టి భావచిత్రాన్ని నిర్వచించిన వాళ్ళున్నారు.

## భావచిత్రం-నిర్వచనం:

*'సాహిత్యంలో ఒక విషయాన్ని మరింత బాగా చెప్పేప్రయత్నంలో మరో అంశంతో పోల్చి చెప్పడం. దేనితో పోలుస్తున్నామో దాన్ని భావచిత్రం అంటారు'* అని సాహిత్యపదాల డిక్షనరీలో వివరించారు. మరింత బాగా చెప్పడం అనేదే ఇక్కడ భావచిత్రాభివ్యక్తికి సంబంధించిందైనప్పటికీ, అది భావచిత్ర స్వరూప, స్వభావాన్ని సంపూర్ణంగా వివరించలేకపోతుంది. పోల్చి చెప్పడమే అయితే అది అలంకారం కూడా చేస్తుంది. అందువల్ల భావచిత్రంలో 'పోల్చిచూపడం' మాత్రమే చేస్తే సరిపోదు. కవి పొందిన అనుభూతిని కూడా బొమ్మకట్టినట్లుగా పాఠకుడికి ఆస్వాదనలోకి తీసుకొని రావాలి. ఎజ్రాపౌండు Image ని ఇలా నిర్వచించాడు. *"An Image is that which presents an intellectual and emotional complex in an instant of time"*

*'ఒక తృటికాలంలో బౌద్ధిక, ఆవేశాల సంసర్గాన్ని ప్రతిపాదించేదే భావచిత్రం. ఈ సంసర్గం హఠాత్తుగా ఒక స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. స్థలకాలాల నుంచి స్వేచ్ఛనిస్తుంది. గొప్ప కళాకృతుల సమక్షంలో మనకు అనుభవమయ్యే ఔన్నత్య భావం మనకు కల్గుతుంద'*ని ఎజ్రాఫౌండ్ చెప్పిన భావచిత్ర నిర్వచనాన్ని ముదిగొండ వీరభద్రయ్య వివరించారు. వీటన్నింటినీ పరిశీలిస్తే కవి తాను చూసిన దాన్ని లేదా చెప్పాలనుకున్న భావాన్ని శబ్దార్థాల ద్వారా పాఠకులకు ఒక చిత్రంలా రూపుకట్టేట్లు, తనకు కలిగిన అనుభవాన్ని పాఠకుడు కూడా ఆస్వాదించగలిగేటట్లు అందించగలిగే వర్ణనాత్మక విధానాన్ని భావచిత్రం అనొచ్చు.

భావచిత్రం లక్షణాలు:

1. కవి తన అమూర్తమైన అనుభూతిని ఒక చిత్రంలా మూర్తిమత్వాన్ని కల్పించే ప్రయత్నం చేస్తాడు. ఇది పాశ్చాత్యులు చెప్పిన మానవీకరణ (Personification) కు దగ్గరగా ఉంటుంది. ప్రాణం లేని వాటికి ప్రాణగుణాలను లేదా మానవీయగుణాలను ఆపాదించి వర్ణించడం పెర్సానిఫికేషన్ లో ఉండే లక్షణం.

ఉదా:

<u>చావు</u>

"ప్లాస్కులో

శూన్యాన్ని కాపాడే

కొన విరిగిపోతుంది.
శూన్యంలోకి
శీతల వాయువులు చొచ్చుకుపోయి

పాలవేడిని కబళిస్తాయి" వెలుతురు పిట్టలు, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, 1974, పుట:28) ఈ కవితల్లో 'చావు' అనే అమూర్త పదార్థాన్ని మూర్తమైన 'ఫ్లాస్కు'ని ఆధారం చేసుకొని వర్ణించాడు.

2. కవి తన పంచేంద్రియాల ద్వారా పొందిన అనుభవాన్ని పాఠకులకు మూర్తమైన వస్తువుల సహాయంతో అందిస్తాడు. తద్వారా కవిపొందిన ఇంద్రియానుభూతిని పాఠకుడు కూడా పొందుతాడు. ఇంద్రియానుభవ ప్రసారం అనేది మరొక లక్షణం.

ఉదా:
కావ్యయోని
"కేకలేసే చెవిని
ఆకాశాన్నించి
రెక్కలిప్పేనాసికని
భూమి నించీ
గలగలపారే నాలికని
జలాలనించీ
జ్వలించే నేత్రాన్ని
అగ్నినుంచీ
మృదువుగా వీచే చర్మాన్ని
గాలినించీ
పోగుచేసి నీ అల్లికలో పొదుగుతుంది సూది"

(ఇస్మాయిల్ కవితలు, 1989, పుట: 150-152)

పంచభూతాలైన అగ్ని, భూమి, వాయువు, నీరు, ఆకాశాలను ఒక్కొక్క అనుభూతి కేంద్రాలుగా వర్ణించాడు కవి. వాటి నుండి ఆయ్యా నేంద్రియానుభూతలను తీసుకొని, కవి కవిత్వం రాసే సమాధ్య స్థితిని వివరించడం వల్ల పాఠకునికి అమూర్తమైన భావాలు మూర్తంగా కనిపిస్తూ, కావ్యానుభూతిని మనసులో బొమ్మకట్టించి మరీశాశ్వతం చేస్తుంది.

3. క్లుప్తత, వైవిధ్యం, తీవ్రత, భావోద్వేగం అనేవి కూడా భావచిత్రకవిత్వంలో కనిపించే

మరికొన్ని లక్షణాలు.

4. పరిచయత్వం అనేది భావచిత్రకవిత్వానికి ఉండే మరొక లక్షణం. తన అమూర్తమైన అనుభూతులను కవి వర్ణించడానికి పాఠకులకు తెలిసిన భౌతికమైన రూపాలను తీసుకుంటాడు. దాన్ని వర్ణిస్తున్నట్లే వర్ణిస్తూ ఒక కీలకాంశంతో దాన్ని అనుభూతిలోకి వచ్చేలా చేసి పరిచయం ఉన్న భౌతిక వస్తువుని మరిచిపోయి, దాని స్థానంలో అమూర్తభావంతో మనసులో కవితాత్మకచిత్రాల్ని చిత్రించుకొనేలా చేస్తాడు.
5. భావచిత్రకవిత్వంలో మేథోద్వేగాల సమ్మేళనం ఉండటం మరొక లక్షణం. పాఠకుడు కొంచెం ఆలోచించిన తర్వాత అనుభూతి ప్రపంచంలో అడుగుపెడతాడు. ఆలోచన ద్వితీయమైపోయి, అనుభూతి అద్వితీయమైపోతుంది.
6. భావచిత్రకవిత్వంలో అభిదార్థం కంటే లక్ష్యార్థమే ప్రధానం.

పైన పేర్కొన్న భావచిత్రకవిత్వ లక్షణాల్లో కవిత్వాన్ని పాఠకుడు అవగాహన చేసుకోవడానికి కీలకం అనేది ముఖ్యం. దీని ద్వారానే కవితను పాఠకుడు ఆస్వాదించగలుగుతాడు. దీన్నే బౌద్ధిక, ఆవేశాలు సంసర్గం పొందడం అని భావచిత్రకవిత్వం గురించి చెప్పిన నిర్వచంలో కనిపించే లక్షణం. ఈ కీలకాన్ని కవితకు పెట్టిన శీర్షికను బట్టి, కవితలో అంతర్భాగంగా కనిపించే కొన్ని పదాలను బట్టి, కవిత చివరిలో సూచించే పోలికను అనుసరించి గుర్తించవచ్చు. కొన్ని భావచిత్రాల్లో ఈ కీలకం సూచ్యం కాకపోవచ్చుకూడా. అటువంటి భావచిత్రకవితను తాత్త్విక భావచిత్రం అంటారు. లోకంలో కొన్నింటికి మరికొన్నింటిని పోల్చి చెప్పడం, ప్రతీకలుగా వాడటమనే సంప్రదాయాన్ని బట్టి ఆ కవితను అనుభూతిలోకి తెచ్చుకోగలుగుతారు.

## కవితా శీర్షికలో కీలకంగా ఉండే భావచిత్రాలు:

*యువతరం*

*'ఈ ఫిరంగి నిండా/మందుంది*
*పేలిందంటే/గిరిదుర్గాలనైనా/పెళ్ళగించే శక్తి వుంది*
*కానీ...*
*వత్తి ఎక్కడుందో/అంటించేవాళ్ళెవరో/అర్థం కావటం లేదు"*

(పి. ఆర్. హరనాథ్, ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 28-12-1979)

ఈకవిత శీర్షికలోనే కీలకం ఉంది.

**కవిత అంతర్భాగంలో వాడే పదాలే కీలకంగా ఉండే భావచిత్రాలు:**

*పూలమేఘం*
*యూనిఫాం డ్రెస్సుల్లో /రిక్షాలో కిక్కిరిసిన పిచికల గుంపు*
*చెత్తకుండ దగ్గర తోకాడిస్తూ, మేస్తున్న మేకపిల్లనీ*
*ఇంతింత కళ్ళుకు చూస్తుంటుంది*
*అప్పుడు తల బైటకి పెట్టి/తొంగి చూస్తును చందమామలే*
*ఒక్కసారి వెనక్కి చూసినవి/ పూలమేఘాన్ని లాక్కుపోతాడు రిక్షావాడు*

(వసీరా, లోహనది, పుట: 69, 1989)

**కవిత చివరిలో సూచ్యపదాలే కీలకంగా ఉండే భావచిత్రాలు:**

*చిలుకలు వాలిన చెట్టు*
*కిచకిచమని శబ్దమైతే /కిటికీలోంచి చూశాను*
*ఎప్పటిలాగే చెట్టు/గుప్పిట విప్పి నిలుచుంది*
*మరెక్కడిదీ చప్పుడూ? /పరకాయించి చూశాను*
*పచ్చటి చీకట్లో/మంటేదో ఎర్రగ కదిలింది*
*గుట్టు తెలిసింద్ది చిలక/చెట్టు నిండా ఉన్నట్టున్నాయి*
*గుబురంతా వెతికి వీటిని/గుర్తించటం ఒక సరదా*
*ముక్కుల దీప శిఖల వల్ల/ఒక్కొక్కచిలకనే పోలుస్తుంటే*
*తెలిసిందప్పుడు నాకు/చిలుకలు వాలిన చెట్టు*
*లోతైన కావ్యం /లాంటిదని*

(ఇస్మాయిల్, ఇస్మాయిల్ కవితలు, పుటలు: 115–116)

**భావచిత్రం రకాలు:**

చాలామంది కవులు, లాక్షణికులు భావచిత్రాన్ని ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన పనిలేదనీ, అది వివిధ ఉపమానాల ద్వారా కవిత్వంలో వర్ణనాంశమేనని భావిస్తున్న వాళ్ళున్నారు. (చెన్నమనేని పద్మజ, 1975–85 నడిమి ఆధునిక తెలుగు కవిత్వంలో కళాతత్త్వశాస్త్ర రీత్యా భావచిత్రపరిశీలన, అముద్రిత సిద్ధాంతగ్రంథం, 1995, పుట: 35)

ఉపమ, రూపకాలను పాశ్చాత్యులు Image కి సమానార్థకంగా ప్రయోగిస్తున్నారు. Simileని పాశ్చాత్యులు భావచిత్రంగా చెప్తున్నారు. భారతీయాలంకారికులు పేర్కొన్న లక్షణాశక్తికి ఇంచుమించు సమానార్థకంగా 'Trope' అనే పదాన్ని వాడుతున్నారు. 'Trope' ని మూడు వర్గాలుగా పాశ్చాత్యులు ప్రయోగిస్తున్నారు. 1. Metopher, 2. Metanomy, 3. Synecdoche. మెటాఫర్‌లో పోలిక ఉంటుంది. వీటిని దృష్టిలో పెట్టుకొనే భావచిత్రాన్ని మూడురకాలుగా విభజించుకోవచ్చు. 1. ఆలంకారిక భావచిత్రాలు, 2. రూపకాత్మక భావచిత్రాలు, 3. ప్రతీకాత్మక భావచిత్రాలు.

**సింబాలిజం (ప్రతీకవాదం):**

ఫ్రాన్సులో ఇరవైయ్యో శతాబ్దానికి పూర్వమే ప్రతీకవాదం ప్రారంభమైంది. బోదలేర్, వెర్లేన్, మల్లార్మే ఈ వాదానికి ప్రతినిధులు. Baudelaire పూర్తి పేరు Charles Pierre Baudelaire. ఇతడు 9 ఏప్రిల్ 1821 వ తేదీన జన్మించి, 31 ఆగస్టు 1867 మరణించాడు. ఇతడు ఫ్రెంచి కవి, విమర్శకుడు, అనువాదకుడుగా ప్రసిద్ధి. కవిత్వంలో ప్రతీకల విలువల్ని ఉన్నతీకరించిన సాహితీవేత్త. ప్రతీకవాదాన్ని ఉద్యమంగా ముందుకి తీసుకొని వెళ్ళిన వాడు Paul-Marie Verlaine. ఇతడు ఫ్రెంచి కవి. 30 మార్చి 1844 లో జన్మించి, 8 జనవరి 1896 వతేదీన మరణించాడు. ప్రతీకవాదానికి తాత్త్విక స్థాయికి తీసుకెళ్ళిన వాడు మల్లార్మే. ఇతని పూర్తి పేరు Stephane Mallarmeగా ప్రసిద్ధి. కానీ అసలు పేరు Etienne Mallarme ఇతడు 18 మార్చి 1842లో జన్మించి, 9 సెప్టెంబరు 1898 లో మరణించాడు. ఇతడు కూడా ఫ్రెంచి కవి, విమర్శకుడు.

వాస్తవికతా వాదమనేది శాస్త్రజ్ఞానజన్యమైనదనీ, అది ఇంద్రియసత్యం కంటే భౌతిక వాస్తవికతకు ప్రాధాన్యమిస్తుందని ప్రతీకవాదులు భావిస్తారు. అందువల్ల నిజమైన భావుకత, అనుభూతి తెలియాలంటే ఇంద్రియాతీతమైన భావజగత్తువైపు పయనించాలని ప్రతీకవాదులు భావిస్తారు. ఇంగ్లీషులో W. B. Yeats, T. S. Eliot (WasteLand) కవులు ప్రముఖ ప్రతీకవాద కవులుగా పేరు పొందారు. ప్రతీకవాదుల లక్ష్యాలుగా కింది వాటిని చెప్పుకోవచ్చు.

1. సంగీతశాస్త్రంలో రాగాలకున్న ప్రాధాన్యం కవిత్వంలో శబ్దాలకుఉంది.
2. రాగం భావాన్ని వ్యంగ్యంగా సూచించినట్లే కవిత్వంలో ప్రతిశబ్దం సూచ్యార్థంగా

ఉండాలి.

3. భావప్రకటన కవిత్వధర్మం కాదు–భావసూచన కవిత్వ లక్ష్యం కావాలి.
4. కవిత్వమంటే విషయ వివరణ కాదు– వాతావరణ కల్పన చేయాలి.
5. కవిత్వాన్ని వర్ణించేటప్పుడు ఉపమానం వ్యంగ్యానికి భంగం కలిగిస్తుంది.
6. సంగీతంలా కవిత్వం అవ్యక్త మాధుర్యాన్ని అందించాలి.

క్రమేపీ ప్రతీకవాదులు ఈ లక్ష్యాలతో కవిత్వాన్ని వర్ణిస్తూ సామాజిక వాస్తవికతకు దూరమైపోవడాన్ని గమనించి మొదట్లో సామాన్య ప్రజలు ఈకవిత్వానికి దూరమయ్యారు. తర్వాత క్రమేపీ ఈ కవిత్వం జీవిత సమస్యల నుండి దూరమవడం వల్ల ప్రజల ఆదరణను కోల్పోయిందని పరిశోధకుల అభిప్రాయం. అయితే, తెలుగులో కొంతమంది సామాజిక సమస్యలు పట్టని వస్తువుతో ప్రతీకవాద కవిత్వాన్ని రాసినా, అత్యధికులు మాత్రం సామాజిక సమన్యల్నే వస్తువులుగా తీసుకున్నారు.

కళలో అభివ్యక్తికి సంబంధించిన చర్చకొనసాగిన నేపథ్యంలోనే 'అభివ్యక్తివాదా'న్ని పరిశీలించాల్సిన అవసరం ఉంది. సౌందర్యశాస్త్రం లేదా కళాతత్త్వశాస్త్రం (Aesthetics) ఒక ప్రత్యేక ప్రతిపత్తి పొందిన తర్వాత అభివ్యక్తివాదం అనేది చర్చనీయాంశమైంది. కళ అనుకరణమని భావించి, లోకంలో కనిపించే వాస్తవాన్ని తన కావ్యంలో లేదా కళల రూపంలో కళాకారులు అభివ్యక్తీకరించేవారు. ఆంగ్లంలో రొమాంటిక్ యుగంలో ఈ ఆభిప్రాయంలో మార్పులచ్చి, కళాకారుడికి ఒక సృజనాత్మక భావనాశక్తి ఉంటుందనీ, దాని వల్ల కేవలానుకరణంగా కాకుండా, కొత్తవెలుగుల్ని ప్రసరించే సృజనాత్మకనైపుణ్యాన్ని ప్రదర్శిస్తారని నమ్మిన కవులు, కళాకారుల నుండి అభివ్యక్తివాదం అనేది పుట్టుకొచ్చింది. Benedetto Croce (1866–1952) అభివ్యక్తి వాదాన్ని ప్రతిపాదించాడు.

క్రోచీ దృష్టిలో కళ అతీంద్రియత నుండి ఏర్పడిన భావముద్రల (Impressions) అభివ్యక్తి. వస్తువుని గురించిన పరిపూర్ణమైన అవగాహన కల్గించే భావముద్రలు (Impressions), సంవేదనలు (sensations) కలిసి మెలిసి భావనాశక్తి బలంలో ఒక ఆకృతిని పొంది, దాని పరిపూర్ణస్వరూప స్వభావాలను కళాకారుడు దర్శించినప్పుడే అభివ్యక్తి ఏర్పడుతుంది. అదే నిజమైన అతీంద్రియత. ఈ అతీంద్రియమైన అనుభూతిని అందించేదే నిజమైన కళ. ఈ కళాతత్త్వాన్ని పాఠకునిలో ప్రేక్షకునిలో కలిగే అనుభూతిని అధ్యయనం చేసేదే కళాతత్త్వశాస్త్రం.

**ఆధార గ్రంథాలు:**

1. తిరుమలరావు, సర్దేశాయి. విమర్శ – ప్రతివిమర్శ. హైదరాబాదు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం: 2002.
2. నాగభూషణశర్మ, మొదలి. నాటక శిల్పం. హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: 2008.
3. నళిని ఎస్. ఎస్. సాహిత్య విమర్శ పదాల డిక్షనరీ. హైదరాబాద్. 1999
4. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు:ప్రయోగములు. హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్:1989.
5. పద్మజ, చెన్నమనేని. 1975–85 నడిమి ఆధునిక తెలుగు కవిత్వంలో కళాతత్త్వశాస్త్రరీత్యా భావచిత్ర పరిశీలన, అముద్రిత సిద్ధాంతగ్రంథం, 1995
6. మాచిరెడ్డి, తక్కోలు. *చీకటి నుండి స్వప్నం దాకా (వ్యాససంపుటి).* హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్:2006.
7. మందేశ్వరరావు, వడలి. *పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర–సిద్ధాంతాలు.* హైదరాబాద్. పొట్టి శ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం: 1994.
8. రాధాకృష్ణ బూదరాజు. 'ఆధునిక వ్యవహార కోశం హైదరాబాద్. 2007
9. రెడ్డి జి. యన్. 'ఇంగ్లీషు తెలుగు నిఘంటువు. 2001
10. లక్ష్మీకాంతం, పింగళి. *సాహిత్య శిల్పసమీక్ష.* హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్:1995. (ప్రథమ ప్రచురణ: 1966)
11. వీరభద్రయ్య, ముదిగొండ., కొండలరావు., వి. *సంజీవ్‌దేవ్ వ్యాసాలు.* హైదరాబాద్. తెలుగు అకాడమి: 1990.
12. వీరభద్రయ్య, ముదిగొండ. *కళాతత్త్వశాస్త్రం–మౌలికాంశ వివేచన.* హైదరాబాద్. జాతీయ సాహిత్య పరిషత్: 1993
13. వీరభద్రయ్య, ముదిగొండ. విమర్శ, కళాతత్త్వశాస్త్రాలు, హైదరాబాద్. తెలుగు అకాడమి: 2012
14. వీరభద్రరావు, కొత్తపల్లి. *తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము.* ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్, యూనివర్సిటీ ఆఫ్ ఢిల్లీ: 1956
15. వెంకటేశం, బి. *అరిస్టాటిల్ కావ్యశాస్త్రము.* కరీంనగర్. సరోజా పబ్లికేషన్స్: 1992.
16. సూరిశాస్త్రి, పురాణం. *విమర్శకపారిజాతము.* బందరు. విద్యానిలయము: 1925.

17. సూర్యసాగర్. బి. *సాహిత్యం-సౌందర్యం.* విజయవాడ. జనసాహితి:1995.
18. సుబ్రహ్మణ్యం, జి. వి. *ఆంధ్రసాహిత్య విమర్శ- ఆంగ్ల ప్రభావం.* హైదరాబాదు. షష్టిపూర్తి ప్రచురణలు:1996.
19. శివశంకర్, పాపినేని. *సాహిత్యం-మౌలిక భావనలు.* గుంటూరు. పాపినేని ప్రచురణలు: 1996
20. హెరోల్డ్ హెచ్. టిటస్, (తెలుగు అనువాదం: పొట్లూరి వెంకటేశ్వరరావు) సౌందర్యశాస్త్రం-కళాతాత్త్వికత, హైదరాబాద్ 2003

# సాహిత్య సృజన-పరిశోధనల్లో మౌలికాంశాలు

***"కవిత్వానికి కూడా సైన్సుకి వలే***
***కావాలి రీసెర్చ్ ఎక్స్‌పెరిమెంటూ***
***కాని దాని పరమార్థం***
***పలాయనం కాదు ప్రజాక్షేమం"***

– ఇది ఆరుద్ర (సినీవాలి, 1990: 24) "సాహిత్యోపనిషత్" లో శ్రీశ్రీ మాటలుగా చెప్పాడు ఇక్కడ " కవిత్వం" అని చెప్పినా, అందులోని విషయాలు అన్ని సృజన ప్రక్రియలకూ వరిస్తాయి. కవులు వాస్తవాన్ని యథాతథంగా చెప్పకుండా తమ అనుభవాన్నీ, అనుభూతినీ, భావుకతనూ జతచేసి సృజనాత్మక రచనల్లో అందంగా అందిస్తారు. కేవలం కాల్పనిక అంశాలే సృజనాత్మక రచనలు కాదు. కానీ, సృజనాత్మక రచనల్లో కాల్పనిక అంశాలెక్కువగా ఉంటాయి. ఏదైనా ఒక కవితో, కథో, నవలో, నాటకమో, గేయమో రాయాలంటే రచయితకి కేవలం సృజనాత్మక ప్రతిభ ఉంటే సరిపోతుందా అనేది ఒక చర్చనీయాంశం. దీన్నే ఆరుద్ర కవిత్వం ద్వారా మనముందు చర్చకు పెట్టాడు. పరిశోధన అంటే ప్రయోగశాల, రసాయనాలు, పరికరాలు ఉండాలనుకునేది సాధారణంగా ఉండే అభిప్రాయం. ఇంకొంతమందైతే తవ్వకాల వల్ల ఏదైనా బయటపడితే దాన్ని పరిశోధన అవుతుందని అంటారు. మరికొంతమంది ఖగోళాంశాల్నో, కొత్తగా యంత్రాన్నో, పరికరాన్నో కనిపెడితే దాన్నీ పరిశోధన అంటుంటారు. "విజ్ఞానపరిధులను విస్తరింపజేసే యత్నంలో నూతన సత్యాలను, సూత్రాలను కనుగొనడానికి, శాస్త్రీయ పద్ధతులతో క్రమబద్ధంగా చేసే గాఢతరమైన అన్వేషణ, పరిశీలన చేసే విధానం పరిశోధన' అని ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం నిర్వచించారు. (సుబ్రహ్మణ్యం. జి. వి. 1993:2) ఆ అర్థంలోనే ఆరుద్ర కూడా తన కవితలో ప్రయోగించాడని పైకి అనిపిస్తున్నా, కవిత్వానికుండే ప్రయోజనం గురించి

మాట్లాడుతున్నాడని మాత్రం లోతుగా చూస్తే అర్థమవుతుంది. కవిత్వం లేదా సాహిత్య ప్రయోజనం గురించి నేటికీ చర్చ కొనసాగుతునే ఉంది. కానీ, కవిత్వానికి రీసెర్చ్ ఎక్స్‌పెరిమెంటు ఉండాలనడంలో మరే ఆంతర్యం లేదా? మార్క్సిస్టు సాహిత్యం వచ్చిన తర్వాత సాహిత్య విమర్శలో కొన్ని భావనలు బలంగా చర్చలోకొచ్చాయి. వాస్తవికత, సామాజికస్పృహ, నిబద్ధత అలా చర్చలో కొచ్చిన వాటిలో ముఖ్యమైనవి. ఇవి సృజన సాహిత్యాన్ని లోకపరిశీలనవైపు, ఇంకా చెప్పాలంటే పరిశోధన చేసి తెలుసుకున్న తర్వాతనే రాయాలనే ఆలోచనని చాలా వరకూ కలిగించాయి. వీటి కంటే మరింతలోతుల్లోకి తీసుకెళ్ళిన భానన మరొకటి స్త్రీవాద, దళిత సాహిత్య సృజనతో మొదలైంది. నిమగ్నత అనేది ఈ సాహిత్య సృజనకు, దాన్ని అవగాహన చేసుకోవడానికీ అవసరం. ఇది ఆధునిక సాహిత్యాన్ని శాస్త్రీయంగా అర్థం చేసుకోవడాకికున్న ఒక విమర్శసూత్రం (పు:18) ఇలాంటి సృజన రచనల్లో పరిశోధనతో పాటు, జీవితానుభవాలు రచనకు జీవితాన్నిస్తాయి. అలాగని ఇవే వాస్తవాలనో, ఇవే పరిశోధనలనో ప్రజలు భ్రమ పడ్డానికి వీల్లేదు. ప్రతి రచయితకూ తనదైన ఒక ప్రాపంచిక దృక్పథం ఉంటుంది. ఆ దృక్పథంతో సాహిత్య సృజన చేస్తాడు. *‘ రచయితల సాహిత్య దృక్పథం వాళ్ళ సామాజిక దృక్పథం మీద ఆధారపడి ఉంటుంది. సామాజిక దృక్పథం రచయితల ప్రాపంచిక దృక్పథాన్ని బట్టి ఏర్పడుతుంది”* (రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, పు: 76)

ఒక వాస్తవాన్ని చెప్పడానికి సృజన రచనను చేస్తున్నాడా? ఒక వాస్తవిక సత్యాన్ని అనేకమందికి అనుభవంలోకి తెస్తున్నాడా? ఈ రెండు ప్రశ్నల కొచ్చే సమాధానాలే సృజనాత్మక సాహిత్యంలో ఉండే పరిశోధన మౌలికతత్త్వాన్ని పట్టిస్తాయి. కవులు కొన్ని కావ్యాల్ని రాసేముందు ఆ వస్తువుకి సంబంధించిన విషయాన్ని సేకరించతప్పదు. రచయిత తాను సేకరించిన ఆధారాల్ని తన సృజనాత్మక రచనకు సహాయంగా తీసుకొంటాడు. కానీ, తారీఖూ, దస్తావేజుల్లా రాయకుండా చారిత్రక సత్యాన్ని కళాత్మక సత్యంగా మారుస్తాడు. అందుకనే శ్రీశ్రీ ఒక కవితలో ఇలా అన్నాడు. “ఏ యుద్ధం ఎందుకు జరిగెనో?

***ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో?***
***తారీఖులు, దస్తావేజులు***
***ఇవి కావోయ్ చరిత్రకర్థం***
***...***

*ఇతిహాసపు చీకటికోణం*
*అట్టడుగున పడి కాన్పించని*
*కథలన్నీ కావాలిప్పుడు!*
*దాచేస్తే దాగని సత్యం.*

(శ్రీశ్రీ– దేశచరిత్రలు: 10–04–1938)

యస్. టి. జ్ఞానానందకవి ''ఆమ్రపాలి'' (1972) అనే పేరుతో ఒక చారిత్రక కావ్యాన్ని రాశారు. షోడషజనపథాల పాలనలోని వికృతస్వభావాన్ని చెప్పడానికి ఆ కావ్యాన్ని చక్కగా ఉపయోగించుకున్నారు. (వెంకటేశ్వరరావు, 1999:7) ఈ కావ్యంలో బుద్ధుడు, బింబిసారుడు, ఆమ్రపాలి మొదలైన పాత్రలన్నీ చారిత్రకాలే. అయినా వాళ్ళ గురించే చదువుకోవాలంటే చరిత్ర గ్రంథాలున్నాయి. ఒక అందమైన అమ్మాయి, అదీ ఒక చక్రవర్తి అల్లారుముద్దుగా పెంచుకున్న అమ్మాయిని గణతంత్రరాజ్యాధినేతలు అనుభవించడానికి పన్నిన కుట్రకి ఆమె ఎలా బలైపోయిందో దానిలో వర్ణించారు. ఆమ్రపాలి, ఆమెను పెంచిన తల్లిదండ్రులు పడిన ఆవేదనను కవి రసార్ద్రంగా వర్ణించారు.

*"అల్లారుముద్దుగా నవని బెంచిన యట్టి*
*తల్లిదండ్రులనెడంద దలచి తలచి*
*చిననాటి నుండియు తనతో జరించు నె*
*చ్చెలుల శ్లేషోక్తికి గులికి గలికి*
*తన విద్దియులకు కారణభూతులగు గురున్*
*బత్తినిండగ చేతులెత్తి కోర్కెలు*
*వయసుతో పాటుగ బయనించు కోర్కెలు*
*పూడ్చగా బడినంచు నేడ్చి యేడ్చి*
*గుండెలు పగులు నట్లు కుమిలిపోయి*
*చెప్పరాని వెతల కుప్పలోన*
*కూలబడిన యామ్రపాలి నెవ్వారలు*
*ప్రేమతోడ నాదరింతు రొక్కొ"*

(యస్. టి. జ్ఞానానందకవి, ఆమ్రపాలి, 1972, –18)

ఇలాంటి వర్ణనలతో పాఠకుల హృదయం ద్రవించిపోతుంది. అలాంటి రసాత్మక స్థితిని కలిగించడమే సృజనాత్మక రచనల ప్రధాన లక్ష్యం. అందుకే ఈ కావ్యానికి

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి కూడా వచ్చిందనిపిస్తుంది.

ఆచార్య కొలకలూరి ఇనాక్ 2008లో *"ఆది ఆంధ్రుడు'* పేరుతో ఒక చక్కని పద్యకావ్యాన్ని రాశారు. దీనిలో ఒక జానపద కథ, కావ్యత్వాన్ని పొందింది. అమరావతి రాజధానిగా పాలించిన వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు దారిదోపిడీలు, దొంగతనాలు చేస్తున్న సుమారు 500 మంది చెంచుల్ని ఊచకోత కోసి హత్యచేశాడు. అధికారిక గణాంకాలప్రకారం ఐదువందలమంది. నిజానికి అంతంకంటే ఎక్కువ మంది ఉంటారనేది జనపథం మాట. అది 1794లో జరిగిన ఘోరసంఘటన. చెంచుల్ని చంపొద్దని రాజుతో వాదించిన వాడు ఆ ఆస్థానంలో సైన్యాధ్యక్షుడుగా ఉన్న భుజంగరాయుడు. అతడు ఒక మాదిగ జాతికి చెందిన వ్యక్తి. అతడు సేనానిగా, మంత్రిగా వెంకటాద్రినాయుడి దగ్గరుండి ప్రజలకు సేవలందించాడు. అతడ్ని చరిత్ర గుర్తించవలసినంత స్థాయిలో గుర్తించలేదు. దానికి కారణం అతడు కింది వర్ణానికి చెందిన వాడు కావడమే ఒక ప్రధాన కారణం. కానీ, భుజంగరాయుడి చరిత్రను తవ్వుకుంటూ వెళ్ళితే అద్భుతం కలిగించే విషయాలు బయటపడతాయి. వీటిని డా॥ చిలుమూరి శ్రీనివాసరావు " మాదిగల చరిత్ర – సంస్కృతి"లో సవివరంగా ప్రకటించారు.

ఇక్కడ కవిత్వంలో సృజనను, పరిశోధనను, చరిత్రను ఏకకాలంలో గమనించే వీలు కలుగుతుంది. ఇలాగే జానపద అంశాలు కావ్యాలుగా మారినవి చాలా ఉన్నాయి. వాటి గురించి ఆచార్య యం. కె. దేవకి గారి పర్యవేక్షణలో డా॥ కె. ఆశాజ్యోతి "ఆధునికాంధ్ర కవిత్వంలో జానపదేతి వృత్తం" పేరుతో పరిశోధన చేశారు. ఇది 2002 లో ముద్రితమైంది. మన ఆంధ్రప్రదేశ్ రాజలాంఛనంలో పూర్ణకుంభం ఉంటుంది. ఇది అమరావతీస్తూపం మీద ఉండే పూర్ణఘటం. ఆంధ్రుల తొలిపాలకులు శాతవాహనుల కాలం నాటిది. దీనికి బౌద్ధమతశిల్పరీతిని జోడించి అమరావతీస్తూపంపై ఉంచారు. ఈ పూర్ణఘటం రూపశిల్పి పేరు విధిక. విధిక తండ్రి నాగన. ఆ కుటుంబానికి చెందినవాడే భుజంగరాయుడు. ఆచార్య కొలకలూరి ఇనాక్ " *ఆదిఆంధ్రుడు"* పేరుతో రాసిన చారిత్రక కావ్యంలో ఇతివృత్తం అదే. భుజంగరాయుడి చరిత్రను ఊహకుతెస్తూ, ఎవ్వరి మాటా వినని చెంచులతో నిరాయుధుడిగా వెళ్ళి రాయబారం నిర్వహించడంలో భుజంగరాయుడి ధైర్యసాహసాల్ని వీర, అద్భుత రసాల్లో కవి వర్ణించి సన్నివేశాలు శాశ్వతంగా పాఠకులకి గుర్తుండిపోతాయి. ఇలాగే అల్లూరి సీతారామరాజు, తాండ్రపాపారాయుడు,

ఝాన్సీలక్ష్మీబాయి మొదలైన వాళ్ళ గురించి చారిత్రక కావ్యాలు వచ్చాయి. వీటిని కావ్యంగా రాయాలంటే చారిత్రక అంశాల్ని తెలుసుకోవడానికి రచయితకు పరిశోధన తప్పదు. అయినా వీటిని పరిశోధనలు అనలేం. వి. సీతాకళ్యాణి వాటిలో కొన్నింటి గురించి పరిశోధన చేశారు. 1990 లో ''తెలుగు చారిత్రక కావ్యములు" పేరుతో దాన్ని ఒక గ్రంథంగా కూడా ప్రచురించారు.

ఇక్కడ మనం చర్చించుకోవాల్సింది ఒకటుంది. సృజనాత్మకరచనలో పరిశోధన ఉన్నా, దాన్ని మించిన అనుభూతి, భావుకతలే శాశ్వతంగా నిలిచిపోతుంటాయి. దానిలో వర్ణించిన పాత్రలూ, సన్నివేశాలూ నిజం కాదు. అవి కవి అపరబ్రహ్మగా మారి సృజించిన అంశాలు. సృజనాత్మక రచన చేయడానికి పరిశోధన దృష్టి అవసరమే, కానీ అదే పరిశోధన అనిపించుకోదు. కవిత్వం రాసేవాళ్ళకు విమర్శదృష్టి ఉన్నా, వాళ్ళలోను విమర్శకులు ఉన్నా, అవసరమైతే నియమాల్ని వ్యతిరేకించడానికీ వెనుకాడరు. అందుకనే నియతి కృత నియమరహితాం, హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్, నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతి" అని మమ్మటుడు తన *'కావ్యప్రకాశం'* లో కవిని బ్రహ్మకంటే ఉన్నతమైన స్థానం ఇస్తున్నట్లు కనిపిస్తుంది. చెప్పాల్సిన సందేశం ఇంచుమించు ఒకటే అయినా స్థల, కాలాల్ని, పాత్రలు, సన్నివేశాల్ని మార్చుచేసి మానవజీవితాన్వేషణ తత్త్వాన్నీ హెమింగ్వే *''ది ఓల్డ్ మ్యాన్ అండ్ సీ"* (1952) లోను, కేశవరెడ్డి*" అతడు అడవిని జయించాడు"* (1984) నవలికల్లో ఉదాత్తంగా వర్ణించారు. ఒక నవలికలో ముసలివాడు సొరచేప చంపడానికొస్తున్నా, దాన్ని పట్టుకొని ఒడ్డుకి తేవాలనుకుంటాడు. మరోనవలికలో ముసలివాడు రక్షించడానికి వెళ్ళినా, అదే తనని దగ్గరకు రానివ్వకపోయినా, దాన్నెలాగైనా కాపాడాలనుకుంటాడు. ఇంచుమించు ఇలాగే వినుకొండనాగరాజు రాసిన " ఊబిలోదున్న" నవల్లోనూ కనిపిస్తుంది. ఊబిలో నుండి దున్నను రక్షించిన వ్యక్తిపైనే ఆ తర్వాత అది తిరగబడటం ఒక విషాదం.

ఇటువంటి రచనలు చేయాలంటే కూడా రచయితలు పరిశోధన చేయాల్సిందే. కానీ, ఆ పరిశోధన సృజనముందు కనిపించదు. ఇలాంటివే గురజాడ అప్పారావు రాసిన '' కన్యాశుల్కం" (1897) నాటకం. బాల్య వితంతువుల గురించి లభించిన వివరాలను చూసి ఈ నాటకాన్ని రాశానని గురజాడ చెప్పుకున్నారు. ఆరుద్ర రాసిన " కాటమరాజుకథ " (1999) నాటకం వంటివి ఎన్నో ఉన్నాయి. అయోధ్యలో బాబ్రీమసీదు కూలగొట్టిన తర్వాత చెలరేగిన మత సంఘర్షణల్ని తస్లిమా నస్రీన్

"లజ్జ" (1996) నవల్లో వివిధ పాత్రల పరంగా వర్ణించారు. నవల సగం వరకూ పాత్రలగా కనిపించినా, తర్వాత చారిత్రక నేపథ్యాన్ని చదువుతున్నట్లనిపిస్తుంది. ఒక పరిశోధన గ్రంథమేదో చదువుతున్న అనుభూతి కలుగుతుంది. పాకిస్తాన్ కుట్రని భగ్నం చేయడానికి భారత ప్రభుత్వం రాజనీతిజ్ఞతను ఉపయోగించి బెంగాల్ రెండుగా విడిపోయి, దానిలోని కొంత భాగం బంగ్లాదేశ్ అనే దేశంగా ఏర్పడినా ఫర్వాలేదనుకుంది. ఆ వ్యూహంలో భాగంగానే బంగ్లాదేశ్ ఏర్పడింది. అప్పుడు అక్కడి ప్రజలు తమ మాతృదేశం ఇండియాను వదిలి మరోదేశంగానో, మరోదేశంలోనో ఉండాల్సి వస్తుందని ఫీలయినట్లు రచయిత్రి నవలలో వర్ణించారు. ఆ పరిస్థితుల్ని వర్ణించడంలో సరిహద్దు ప్రజల మానసిక సంఘర్షణ పాఠకుల్ని ఎప్పటికీ మరిచిపోకుండా చేయగలిగారు. ఇండియా వదిలి బంగ్లాదేశ్ వెళ్ళిపోయిన ముస్లిం, హిందూ జీవితాల్లో బాబ్రీమసీదు సంఘర్షణ తెచ్చిన విషాదం ఒకచోట మెజారిటీగా ఉన్న వాళ్ళు మరోచోటకి వెళ్ళేసరికి ఎలా మైనారిటీగా మారిపోయి దాడులకి గురవుతుంటారో ఈ నవల్లో తెలుస్తుంది. ఈ నవల ఇండియాలోని ముస్లిముల కంటే, బంగ్లాదేశ్‌లోని హిందువుల మైనారిటీభావనని లోకానికి చెప్పడానికి బాగా ఉపయోగపడింది. ఈ నవల్లో రెండు పరిశోధనాంశాలున్నాయి. ఒకటి, బాబ్రీమసీదు చారిత్రక పరిణామాన్ని పాఠకులకి వివరించడం. రెండవది మైనారిటీ, మెజారిటీ భావనల్లో కనిపించే అభద్రత. ఆ భద్రతాభావం పుట్టుకొచ్చే పరిస్థితులు. కానీ, వీటిని శాస్త్రీయ నిరూపణల కంటే, మానసిక స్పందనాత్మక అనుభూతులకే ప్రాధాన్యమిచ్చారు. ఇదే సృజనాత్మక రచనకు కావాల్సింది.

ఉన్నవ లక్ష్మీనారాయణ "మాలపల్లి" నవల్లో 1922 నాటి భారత స్వాతంత్ర్యోద్యమకాలం నాటి అనేక పరిస్థితుల్ని వర్ణించారు. సాంఘికపరిస్థితుల్ని వర్ణిస్తున్నా, కింది వర్ణాలుగా చెప్తున్న వాళ్ళలో చాలా తక్కువ మందిలో ఉండే శ్రీవైష్ణవమతాచారాల్ని ఆసరాగా చేసుకొని, దాన్ని జనరలైజ్ చేసి నవల ద్వారా క్రైస్తవప్రాబల్యానికి అడ్డుకట్టవేయాలనుకున్నట్లు భావించే వీలుంది. అందులో చాలా అంశాలున్నా, దాన్ని నాటి ప్రభుత్వం నిషేధాన్ని విధించడంలో అత్యంత ప్రభావాన్నేసిన అంశం మతపరమైందే! (వివరాలు) దానిలో తక్కెళ్ళజగ్గడు తిరుగుబాటు తత్త్వమో, జాతీయోద్యమాన్ని రగులు గొల్పడమనే అంశాలున్నా, మతపరమైన అంశాలతో పోలిస్తే, వీటి స్థాయి తక్కువేనని అనుకోవచ్చు. పరిశోధనలో అన్వేషణ ప్రధానం. కొత్త అంశాన్ని కనుక్కోవడం ముఖ్యం. ఇంకా లోతుల్లోకెళితే కొత్త విషయాల్ని

కనిపెట్టడం పరిశోధనలో ఉండాలి. సాహిత్య పరిశోధనలో సత్యాన్ని అన్వేషిస్తారు. జీవితసత్యాల్ని రచనలతో సమన్వయిస్తారు. తొలినాళ్ళలో "సేకరణ" కూడా పరిశోధనగానే భావించేవారు. అందుకే తాళపత్రగ్రంథాల్ని సేకరించడం, లభించిన కావ్యాల్లోని పాఠాంతర భేదాల్ని గమనించి, సరైనదాన్ని గుర్తించడం పరిశోధనలో భాగంగా ఉండేది. సి. పి. బ్రౌన్ తన పండితుల ద్వారా అనేక తెలుగు కావ్యాల్ని సేకరించగలిగారు. ఆయన దగ్గర పని చేస్తున్న పండితులు కూడా వేమన సాహిత్యాన్ని బయటకురాకుండా ప్రయత్నించారనే అభిప్రాయాలున్నాయి. కవి వేమనను ప్రపంచానికి తెలిసేలా చేసినవాడు బ్రౌన్. సంస్కరణవాదిగా పేరు ప్రఖ్యాతులున్న కందుకూరి వీరేశలింగం చాలా మంది కింది వర్ణాల రచయితల్ని చేర్చలేదనే విమర్శ ఉంది. వేమన, జాషువా వంటి కవులను "*ఆంధ్రకవుల చరిత్ర*"లో పేర్కొనలేదు. అయినా దీన్ని రాయడానికి చాలా విషయాల్ని కందుకూరి వీరేశలింగం సేకరించాల్సి వచ్చింది. తాను రాసిన అన్ని సృజనాత్మక రచనలకంటే ఎక్కువగా శ్రమపడి రాసిన రచనగా తన " *ఆంధ్రకవుల చరిత్ర*" గురించి చెప్పుకున్నాడు. నేటికీ ఇలాంటి పరిశోధన కొనసాగుతున్నా, దీనికంటే పరిశోధన పరిధి విస్తరించింది. సృజనాత్మకరచనల్లోని "సత్యాన్ని" శోధించే దిశలో పరిశోధనలు కొనసాగుతున్నాయి. వివిధ భాషలు, కావ్యాలు, ప్రక్రియల్ని తులనాత్మకంగా పరిశీలించడం పెరిగింది. ఇప్పుడు సాహిత్య పరిశోధన కేవలం ఆధ్యాత్మిక సిద్ధాంతాలకే పరిమితం కాకుండా, సామాజిక, సాంస్కృతిక దృక్పథం వైపు పయనిస్తోంది. సాహిత్య పరిశోధనలో స్త్రీ వాద, దళిత, బహుజన, ముస్లిం ధోరణులు ప్రవేశించి, సాహిత్యం కూడా ఇతర శాస్త్రాల మాదిరిగానే విజ్ఞానాంశాల్ని బోధిస్తాయనే స్పృహని కలిగించగలుగుతున్నాయి. జి. కళ్యాణరావు '*అంటరానివసంతం*' (2000) అనే నవలను రాశారు దీన్ని పరిశీలిస్తే చరిత్ర చెప్పాలని నవల రాశారా? చరిత్రని అనుభవానికి తేవాలనుకున్నారా? అనే ప్రశ్నలు వేసుకోవడానికి అవకాశం కలుగుతుంది. దీనిలో ఆదిమసమాజం నుండి ఆధునిక సమాజం వరకూ అంటరానివాళ్ళ జీవితాల్లోని అనేకపార్శ్వాల్ని అనుభూతిలోకి తెచ్చేప్రయత్నం చేశారు. బోయిజంగయ్య "జాతర" నవల్లో దేవుడి పేరుతో అమాయకులపై జరుగుతున్న దారుణాల్ని ఎండగట్టారు. ఈ నవలలు ఒకటి కోస్తా నుండి మరొకటి తెలంగాణ నుండి వచ్చాయి. భిన్న సమస్యల్ని శోధించే రాసినా, వీటిలో పరిశోధన కంటే, అనుభూతే ప్రధానమైంది. మన తెలుగు సాహితీ విమర్శకులు, పరిశోధకులు సృజనాత్మక విమర్శ, సృజనాత్మక పరిశోధన అనే పదాల్ని అక్కడక్కడా

ఉపయోగిస్తున్నారు. వచనరచన కళాత్మకంగా ఉండడాన్నే సృజనాత్మకమనే అనుకుంటున్నారా? సృజనాత్మక తత్త్వాన్ని గుర్తించే ఈ పదాల్ని ప్రయోగిస్తున్నారా? అనేవి అధ్యయనం చేయాల్సిన అంశాలు. ఇప్పటికే హెన్రీ లూయిబెర్గసన్ (1859-1941) క్రియేటివ్ ఎవల్యూషన్ గ్రంథంలో ఉనికిలో లేని దాన్ని సృష్టించడం సృజనాత్మకత అంటూనే జీవశక్తి (వైటాలిటీ) దీనికి కారణం అన్నారు. పాల్ డావ్‌సన్ "సృజనాత్మక సాహిత్యం" భావనలపై పరిశోధన చేసి డాక్టరేట్ కూడా పొందాడు. సాధన చేస్తే ఎవ్వరికైనా సృజనాత్మక శక్తి వస్తుందనేది ఈయన సిద్ధాంతం. దీనికి దగ్గరలో ఉండే భావనే సాహిత్యంలో, పరిశోధనలో ఉండేది కళా? సృజనాత్మకతా? అనేది కూడా! అందుకే ఈ విషయాల్ని లోతుగా చర్చించాల్సిన అవసరం కనిపిస్తుంది.

ఒకసారి యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్‌కి ఒక ఆర్టిస్టు వచ్చాడు. వేలాది రకాల పక్షుల్ని కలర్స్‌లో అందంగా గీసిన పెద్ద ఆల్బమ్ ఒకటి పట్టుకొని వచ్చాడు. ఇన్ని రకాల పక్షుల్ని గుర్తించి, వాటి బొమ్మల్ని వేశాను. అయినా ఏ యూనివర్సిటీ నాకు డాక్టరేట్ ఇవ్వడం లేదన్నాడు. ఆ పక్షులున్నాయో లేదో గానీ, అంత చక్కగా (ఊహించి ) వేసినందుకు అభినందిస్తున్నామనీ అన్నారట. మరికొన్ని యూనివర్సిటీల్లో చూపిస్తే, ఆ భావుకతకు డాక్టరేట్ డిగ్రీకి సిఫారసు చేయొచ్చన్నారట. ఇది పరిశోధననీ, సృజనాత్మకతల్లోని భేదాన్ని గుర్తించడానికి బాగా సరిపోతుందనిపించింది.

**ఆధార గ్రంథాలు:**


1. ఆరుద్ర. సినీవాలి. హైదరాబాద్: విశాలాంధ్రపబ్లిషింగ్ హౌస్. 1990
2. సుబ్రహ్మణ్యం, జి. వి. జీవియస్ వ్యాసాలు. హైదరాబాద్: శ్రీవాణి ప్రచురణలు. 1993
3. ఇనాక్, కొలకలూరి. ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం. గుంటూరు: మారుతీబుక్ హౌస్. 1996
4. చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం. చర్చ *(తెలుగు సాహిత్య విమర్శ, పరిశోధనల మీద వ్యాసాలు),* హైదరాబాదు: విశాలాంధ్ర బుక్ హౌస్, ద్వి.ము. 2010, (ప్ర. ముద్రణ, 2006)

# మినీ కవితా రూపాలు: లక్షణ చర్చ

***''లోపల ఒకటి***
***బయట ఒకటి***
***మేడిపండు గురించి***
***ఎవరికి తెలియదు''***

– ఇది ఒక ఆధునిక కవి (మసన చెన్నప్ప) రాసిన నానీ. దీన్ని చదివిన వెంటనే పాఠకులకు వేమన చెప్పిన

***''మేడిపండు చూడ మేలిమైయుండును***
***పొట్టవిప్పిచూడపురుగులుండు***
***పిరికివాని మదిని బింకమీలాగురా***
**విశ్వదాభిరామ వినురవేమ''**

పద్యమే గుర్తుకొస్తుంది. వేమన ఆశువుగా చెప్పినా ఆ పద్యాల్లో ఛందో నియమాల్ని పాటించారు. అయినా ప్రజల నోళ్ళలో నేటికీ ఆ పద్యాలు నాట్యం చేస్తూనే ఉన్నాయి. వేమన పద్యాల్లో ప్రజలు లక్షణాల్ని పట్టించుకున్నారా? పద్యంలోని భావాలే ముఖ్యమనుకున్నారా? అనుకుంటే రెండవదానికే ఓటేశారని చెప్పొచ్చు. ఇదంతే ఎందుకంటే నేటి ఆధునిక కవిత్వంలో నెమ్మది నెమ్మదిగా మళ్ళీ నియమాల సంకెళ్ళతో కవిత్వాన్ని బంధించే ప్రయత్నం మొదలవుతుందేమోననే అనుమానం కలుగుతోంది. దీన్ని తెలిసి చేస్తున్నారా? తెలియక చేస్తున్నారా? అనే దానికంటే, ప్రయోగాలు చేయాలనే కుతూహలమే ఈ పని చేయిస్తుందేమో అనీ అనిపిస్తుంది.

ఒకప్పుడు మినీకవిత్వాన్ని ఎక్కువగా రాసేవారు. ''*మినీకవిత ఆయుష్షు మెరుపంత/ కానీ అది ప్రసరిస్తుంది కాలమంత*'' అని జ్ఞానపీఠ్ బహుమతి పొందిన డా॥సి. నారాయణరెడ్డి వంటి కవి ప్రశంసను మినీ కవిత పొందింది. అప్పట్లో

పురాణం సుబ్రహ్మణ్య శర్మ సంక్షిప్తరూపంలో కవిత్వ మెరుపుని అందిస్తూ పాఠకుల్ని ఆకర్షించడానికి 'మినీకవిత' అనే పేరుతో కవిత్వాన్ని ప్రోత్సహించారు. తర్వాత అది ఒక ఉద్యమంగా చాలా కాలం (1970–85) కొనసాగింది.

*ఎన్ని గజాలు*
*రాశాడన్నది కాదు*
*ఎన్ని నిజాలు*
*చెప్పాడన్నది ముఖ్యం"*

(ఆరుద్ర) అనే పద్ధతిలో చాలా మందిని ఆకర్షించింది. ప్రముఖ విమర్శకుడు డా॥ అద్దేపల్లి రామమోహనరావు మినీ కవిత్వానికి ఉచ్ఛ్వాసం క్లుప్తత, నిచ్ఛ్వాసం ధ్వనిగా ఉండాలనీ, వ్యర్థ అక్షరమనేది ఉండకుండకూడదనే లక్షణాల్ని చెప్పారు. కవితకు శీర్షిక ప్రధానమై వ్యవహారిక భాషలో ఉండి, కొసమెరుపు, కొసచరుపు, చమత్కారవ్యక్తీకరణతో సూటిగా పాఠకుని హృదయాన్ని తాకాలని అన్నారు. ఇక్కడెక్కడా సంకెళ్ళు వేసే నియమాల్లేవు. అందుకనే ఒక ఉద్యమంగా మినీకవిత్వం వచ్చింది. వచన కవిత్వంలో మళ్ళీ దీర్ఘకవిత్వం, దీర్ఘకావ్యాల విస్తృతికి విసిగిన పాఠకులు మినీకవిత్వాన్ని ఆదరించారు. మహాకావ్యం చదివితే వచ్చేటంతటి ఆనందం చిన్న కవితను చదివితే వచ్చేస్ఫూర్తి కలిగినవి ఎన్నో ఈ సందర్భంలోనే వచ్చాయి. మినీకవిత్వం అనగానే ఆచార్య భావన్ రాసిన

*'కెరటం*
*నా ఆదర్శం*
*లేచి పడినందుకు కాదు*
*పడినా లేచినందుకు"*

అని రాసిన కవిత ఒక నినాదంగా మారింది. అలాగే అమ్మ గురించి ఎన్నిసార్లు చెప్పినా, ఎన్ని రూపాల్లో వర్ణించినా తక్కువే అనడానికి నిదర్శనమన్నట్లుగా

*"తినడానికి*
*మూడే రొట్టెలున్నప్పుడు*
*తినేవాళ్ళు*
*నలుగురయినప్పుడు*
*తనకు ఆకలి లేదనేవ్యక్తి*
*తప్పకుండా అయ్యుంటుంది*

మాతృమూర్తి”

ఒక కవి (జోస్యభట్ల) హృద్యంగా వర్ణించారు. మినీ కవిత్వంలో “ధ్వని” ఉంటుందనీ, ఉండాలనీ దీనికి కూడా సంప్రదాయ విమర్శకులు లక్షణాల్ని చెప్పే ప్రయత్నం చేసినా, ఆ ధ్వని సామాన్యులకు సహితం వెంటనే అవగాహనకొచ్చేటట్లుండాలనేదే ముఖ్యమని గుర్తించాలి. అయినప్పటికీ కొన్నాళ్ల తర్వాత పదాల్ని పేర్చేసి, వాక్యాల్ని విడగొట్టేసి రూపానికే తప్ప రసస్పందన లేకుండా రాయడంతో మినీకవిత్వం పట్లకూడా పాఠకులకు విసుగొచ్చింది. ఇటువంటప్పుడే మళ్ళీ కవిత్వం కొత్త రూపంలో రావాలనే ఆకాంక్షమొదలవుతుంది. కొన్నిసార్లు పాతకవిత్వాన్నే నెమరువేసుకొనే ప్రయత్నమూ జరుగుతుంది. మినీకవిత్వం వస్తున్నప్పుడే ప్రాచీన తెలుగుసాహిత్యంలో ఇంతకంటే మంచికవిత్వం, లఘురూపాల్లో వచ్చిందనే దృష్టితో గతాన్నొకసారి స్మరించుకోవడానికీ ప్రయత్నాలు జరిగాయి.

ప్రాచీన తెలుగు సాహిత్యంలోను లఘురూపాల్లో కవిత్వం రావడం నిజమే. చాటువులు, శతకపద్యాలు, ఖండకావ్యం, పంచరత్నాలు మొదలైన పేర్లతో కవిత్వం వచ్చినా, స్వరూపంలో మినీకవితారూపానికి దగ్గరగా ఉన్నట్లనిపించినా స్వభావంలో ఇటువంటి కవిత్వం చాలా దూరంగా ఉంటుంది. ప్రశంసించడానికో, నిందించడానికో ఈ లఘుకవితాప్రక్రియలు ఉపయోగపడ్డాయి. కొంతమంది ఇప్పటికీ ఛందోబద్ధంగానే కవిత్వం ఉండాలనే పండితకవులు వివిధ సన్మానాలకు పంచరత్నాల్ని రాస్తూనే ఉన్నారు. అందుకనే అటువంటి లఘు కవితాప్రక్రియల్లో సామాజికత ఉన్నా, సామాజిక స్పృహ కనిపించదు. పోషకుల్ని పొగడడానికో, తిట్టడానికో, నీతుల్ని బోధించడానికో, భగవంతుణ్ణి స్తుతించడానికో, శృంగారాన్ని ఒలకబోయడానికో ఉపయోగించినంతగా సామాజిక సమస్యని వర్ణించడానికి ప్రాచీన ఆ లఘు కవితా ప్రక్రియలు ప్రయత్నించాయని చెప్పలేం. మినీ కవితా రూపంలా కనిపించినా, ఇదే స్వభావంలో ప్రాచీన కవిత్వానికీ, ఆధునిక కవిత్వానికీ గల ముఖ్యమైన ఒక వ్యత్యాసం.

కవిత్వాన్ని నిత్యనూతనం చేయడంలో కొత్త కొత్త కవితా రూపాలు అవసరమే. అలాగని ఆ రూపాలు కవిత్వాన్ని ఎక్కువ మందికి అందకుండా పోకూడదు. కవిత్వం రాయడం కొందరికి మాత్రమే సాధ్యమనే భ్రమను పెంచకూడదు. సాహిత్య విలువల్ని కాపాడుకొంటూనే, పరభాషా సాహిత్యాల్లో నుండి వచ్చే ప్రక్రియల్ని మనం సొంతం చేసుకొంటున్నప్పుడు కొన్ని నియమాల్ని సరళీకరించుకొవాల్సిన అవసరం ఏర్పడవచ్చు.

అదే పరిస్థితి మన తెలుగులోకి వచ్చిన గజల్, రుబాయాతులు, హైకూ మొదలైన ప్రక్రియల్లో కనిపిస్తున్నాయి. వేమన ప్రభావం, ఆధునిక మినీ కవితారూప ప్రేరణతో చాలా మంది కొన్ని ప్రయోగాల్ని చేస్తున్నారు. నానీలు, నానోలు, రెక్కలు, వామీలు, మామీల పేర్లతో కవిత్వాన్ని రాస్తున్నారు. ఇలా కొత్త కవితారూపాలు రావడం ఆహ్వానించదగిందే. అది ప్రజాస్వామిక లక్ష్యం కూడా! అయితే, అవి ఆధునిక కవిత్వానికి ఉండే మౌలిక లక్షణాల్ని విస్మరించకుండా ఉంటే బాగుంటుంది.

జపాన్ కవిత్వ ప్రభావంతో తెలుగులోకి వచ్చిన కవితారూపం హైకూ. గాలినాసరరెడ్డి 1994నుండీ హైకూల్ని రాశారు. 1991 నుండీ ఇస్మాయిల్ వీటిని ప్రాచుర్యంలోకి తీసుకొచ్చారు. తర్వాత పెన్నాశివరామకృష్ణ లక్షణయుక్తంగా రాసేప్రయత్నం చేశారు. హైకూలో మూడు పాదాలుఉండాలనీ, అవి 5, 7, 5 అక్షరాలుఅనుసరించాలని లక్షణాల్ని వివరించారు. నిజానికివి జపాన్ భాషకి తగినట్లు అక్షరనియతిని ఏర్పరిచినా, అవే లక్షణాలు తెలుగులో పాటించడం కుదరలేదు. అందువల్ల తర్వాత కాలంలో చాలా మంది హైకూల్ని రాసినా ఆ లక్షణాల్ని పాటించలేకపోయారు. కానీ, హైకూలో ఉండే తత్త్వాన్ని అందించేప్రయత్నం చేశారు. అంతకు ముందు పారశీ, అరబ్బు ప్రభావంతో వచ్చిన గజల్స్, రుబాయత్ వంటిప్రక్రియలు కూడా అలాగే పాఠకుల్ని/ప్రేక్షకుల్నీ అలరించినా లక్షణాల మానవీయ స్పందనలకే ప్రాముఖ్యం లభించింది.

దేశీయమైన కవితా ప్రక్రియగా నానీలను ఆచార్య ఎన్. గోపి సృష్టించారు. నావి, నీవి వెరసి మనవి అనే అవగాహనతో “నానీలు” పుట్టుకొచ్చాయి. వీటికి లక్షణాల్ని చెప్పిన వాళ్ళు నాలుగు పాదాలు ఉండాలనీ, వాటిలో 20–25 అక్షరాల నిడివి ఉండాలనీ ఒక లక్షణాన్ని చెప్పి, ఒక భావాంశాన్ని రమణీయంగా చెప్పే వీలు దీనిలోఉందన్నారు. వృత్తిరీత్యా ఎలక్ట్రికల్ ఇంజనీర్ అయిన ఈగ హనుమాన్ నానో ప్రక్రియను ప్రారంభించారు. నానో అంటే సూక్ష్మాతి సూక్ష్మమైన ప్రక్రియ అనే అర్థంలో దీన్ని ప్రయోగిస్తున్నారు. నానో టెక్నాలజీ ప్రాచుర్యంలోకి వచ్చిన తర్వాత ‘నానో’ పేరుతో కవితా ప్రక్రియ కూడా ప్రసిద్ధిలోకి వచ్చింది. దీన్ని వివరిస్తూ కవి ఈగ హనుమాన్ 1×10–9 అనే సంఖ్యతో సూచిస్తున్నారు. 2005 నుండీ దీన్ని రాస్తున్నారు. నానోలో నాలుగు పాదాలు ఉండాలి. పాదానికి ఒక పదం లేదా చిన్న సమాసం మాత్రమేఉండాలి. నాలుగో పాదం చమత్కారంతో ముగియాలి. ఈ కవిత్వంలో వస్తువు దేన్నైనా స్వీకరించవచ్చు.

రెక్కలు అనే కవితా ప్రక్రియతో కూడా ఈ మధ్య కాలంలో కవిత్వం వస్తుంది. రెక్కలు కవితాప్రక్రియని ఎం. కె. సుగమ్‌బాబు ప్రారంభించారు. రెక్కలు ప్రక్రియ 2009 నుండీ వస్తుంది. రెక్కలు కవితలో నాలుగు పాదాలు ఉంటాయి. ఒక్కోపాదంలో ఒకటీ లేదా రెండు పదాలు ఉండాలి. నాలుగు పాదాలకు మధ్య ఒక వాక్యానికి ఉండే ఖాళీ వదిలి మరో రెండు పాదాల్ని రాయాలి. చివరి రెండు పాదాల్లో కూడా ఒకటి లేదా రెండు పదాలు చొప్పునే ఉండాలి. అవి దీర్ఘసమాసాలతో ఉండకూడదు. సరళ సుందరంగా ఉంటే బాగుంటుంది. పై నాలుగు పాదాలు పక్షి దేహనిర్మాణాన్ని పోలి ఉంటుంది. అయితే, కింది రెండు పాదాలు పక్షికుండే రెక్కలు లాంటివి. ఈ చివరి రెండు పాదాల్లోనే ఒక చమత్కారమో, ఆలోచనను రేకెత్తించే గుణమో ఉండాలి. ఇలాంటి గుణాన్నే 'పంచ్' అంటారు.

ఆధునికతకు అత్యంత ప్రాణప్రదమైంది శాస్త్రీయమైన మానవీయకోణం. మానవుణ్ణి కేంద్రంగా చేసుకోవడంతో పాటు హేతుపూర్వకమైన రసస్పందనతో కవిత్వం వెలువడాలి. ఆధునికకవిత్వం, అదీ వచన కవిత్వంలో నియమాలు పాటించరని కాదు గానీ, వాటి కంటే, స్వేచ్ఛకీ, సహజ స్పందనకీ ప్రాధాన్యాన్నిస్తూనే, సాహిత్యంలో ప్రయోగాల్నీ చేయాలి. వస్తువుని స్వీకరించడం మంచిదే. అలాగే ఒక క్రమాన్ని పాటిస్తూ తర్వాత తరాలు కూడా అందుకొనేలా కొన్ని నియమాల్నీ పాటించినా అవి మళ్ళీ సంకెళ్ళుగా మారకూడదు.

# "రెక్కలు"కవిత్వం – జీవనతాత్వికత

తెలుగులో విరివిగా వస్తున్న కవితా రూపం "రెక్కలు".. ఎం. కె. సుగమ్‌బాబు ప్రారంభించిన ఈ ప్రక్రియ అనతికాలంలోనే అనేకమంది కవుల్ని, విమర్శకుల్ని ఆకర్షించింది. కేవలం తెలుగులోనే కాకుండా ఆంగ్లంలోకీ ఈ కవితలు అనువాదం పొందాయి. సుగమ్‌బాబు రాసిన కొన్ని ఎంపికచేసిన రెక్కలు కవితల్ని డేవిడ్ షుల్‌మ్యాన్, ఆవులమంద మోహన్ ఆంగ్లంలోకి అనువదించగా, డా॥నోముల సత్యనారాయణ సంపాదకత్వంలో అది ణూాఔచీ' పేరుతో 2008లో ప్రచురితమైంది. తర్వాతకాలంలో శ్రీనివాసగౌడ్" వెలుతురు వెలయాలు", పద్మకళ "దృష్టి", పెద్దూరి వెంకటదాసు, ధూర్జటి, షరీఫ్‌భాయ్ ముగ్గురూ కలిపి "త్రివేణి రెక్కల శతకం" (2011), మల్లవరపు చిన్నయ్య "ఆమని" ఇలా చాలా మంది రెక్కలు కవితా సంపుటాల్ని ప్రచురిస్తున్నారు. రెక్కలు కవిత్వాన్ని పత్రికలు కూడా విరివిగానే ఆదరిస్తున్నాయి.

రెక్కలు కవిత ఆరుపాదాల్లో ఉంటుంది. మొదట నాలుగు పాదాలు రాసి, చిన్న గ్యాప్ ఇచ్చి మిగతా రెండుపాదాల్ని రాస్తుంటారు. రెక్కలు కవిత రెండు భాగాలుగా ఉంటుందన్నమాట! పైనాలుగు పాదాలు పక్షిశరీరంగాను, మిగతా రెండూ పక్షిరెక్కలుగాను భావిస్తూ దీనికి "రెక్కలు" అనే పేరుపెట్టారనుకోవచ్చు. వీటి గురించి ప్రముఖవిమర్శకుడు డా॥ అద్దేపల్లి రామమోహనరావు వ్యాఖ్యానిస్తూ *"పైనాలుగు పాదాలు ఒక జీవితానుభవాన్ని గూర్చి చెబితే, చివరి రెండు పాదాలు ఆ అనుభవం ద్వారా కవి చెప్పదలచిన తత్త్వం గూర్చి చెప్తై. జీవితానుభవం నుంచి ఉపరితలానికి వెళ్ళి ఆలోచిస్తేనే తత్త్వం విశదమౌతుంది. రెక్కలతో, ఆకాశంపైకి ఎగిరితేనే చలనం ఉన్నతమౌతుంది"* అన్నారు. నాలుగు భాగాలుగా ఉన్నా, ఇది హైకూ, నానీల మాదిరిగా కాకుండా సిలబల్స్ లేదా అక్షరనియతికంటే పాదాలు, పదాల నియమానికి కట్టుబడినట్లుంది. ఒకటి నుండి మూడు పదాల వరకూ ఒక్కోపాదంలో పాటిస్తున్నారు.

ఎక్కువమంది చివరి రెండు పాదాల్లో చివరి పాదాన్ని ఒకే పదంతో ముగించడం కనిపిస్తుంది. అలాగే మరో నియమం ఎక్కువమంది ఆరు పాదాల్నీ ఒకటి రెండు పదాలతోనే కవిత్వీకరించే ప్రయత్నం చేస్తున్నారు. దీనివల్ల సంక్షిప్తతతో పాటు, కవితకి సూటిదనం వస్తుంది.

***"ఆహా...***
***ఈ సువాసనలో***
***ఎంత***
***హాయి– తెరచుకుంటున్నాయ్***
***వాకిళ్ళు!"***

ఇది సుగమ్‌బాబు రాసిని ఒక రెక్కలు కవిత. దీనిలో ఒక్కోపాదానికి ఒక్కోపదం మాత్రమే ఉన్నా, చెప్పదలచుకున్నదాన్ని శక్తివంతంగా వర్ణించగలిగారు. మొదటి నాలుగు పాదాల్లో జీవితంలో దేన్నైనా కనీసం స్పర్శించకుండానే నిర్ణయాలు వెలువరించడం కంటే, దాన్ని పరిశీలించడం ద్వారా కొత్తదనమేంటో తెలుసుకోగలుగుతామనే సూచన ఉంది. కేవలం ఏవో కొన్ని అభిప్రాయాల్ని ముందుగానే స్థిరీకరించుకొని, ఆ ప్రమాణాలతో లేదా ఆ దృష్టితోనే చూడ్డమనేదినూతన అన్వేషణను ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగా గాని అడ్డుకున్నట్లే అవుతుంది. మొదటి దానిలో అనుభవం అది అనుకూలంగా గానీ, వ్యతిరేకంగా గాని అనుభవం అయినవెంటనే నిర్ణయాన్ని ప్రకటించాలనుకున్నా, కొత్తద్వారాలు ఉంటాయని చూడకపోతే, స్థిరీకృత అభిప్రాయాల్నే నిర్ణయాలుగా ప్రకటించేఅవకాశం ఉంటుంది. దీన్ని కవి "తెరచుకుంటున్నాయ్/ వాకిళ్ళు" అంటూ కొత్తదనానికి, నూతన విజ్ఞానానికి స్వాగతం పలకాల్సిన అవసరాన్ని అభివ్యక్తీకరిస్తున్నారు. ఇలాంటి తాత్త్వికసత్యాల్ని ఆవిష్కరించే కవిత్వాన్ని సుగమ్‌బాబు రాస్తున్నారు. మల్లవరపు చిన్నయ్య "ఆమని" కవితాసంపుటిలో ఒక రెక్కలు కవిత ఇలా ఉంది.

***"మబ్బుల్లో***
***ఇళ్ళు***
***వాననీళ్ళై***
***జారిపోతాయ్–***
***నిలకడైంది***

*నేల!"*

పైనున్న నాలుగుపాదాల్లో ఒక అందమై భావచిత్రం స్ఫురిస్తుంది. చిత్రకారుడికైతే అందమైన బొమ్మను గీయాలనిపిస్తుంది. మబ్బు స్థిరంగా ఉండదు. అది దాని లక్షణం. ఎటు గాలేస్తే, అటు వెళ్ళిపోతుంది. అక్కడ లేదా దానిమీదెవరైనా ఇళ్ళు కట్టుకుంటారా? వాస్తవిక ప్రపంచంలో జీవించాలంటున్నారు. సత్యం మాత్రమే నిలుస్తుంది. అశాస్త్రీయత నిలవదు. ఊహల్లో విహరించడం కంటే, తన శక్తిసామర్థ్యాల్ని గుర్తెరిగి విజయం వైపు పయనించమని ప్రబోధిస్తున్నారు కవి. అదృష్టం, దురదృష్టమంటూ పనిచేయకుండానే ఫలితాన్ని ఆశించడం తగదనే జీవితసత్యం దీనిలో ఉంది. ఇలాంటి తాత్త్వికసత్యాలేన్నో " ఆమని" నిండా ఉన్నాయి. తమ కవితలనే కాకుండా రాష్ట్రవ్యాప్తంగా రెక్కల కవులందరినీ ఒకచోటకు చేర్చినట్లుగా పెద్ద రెక్కలు కవితాసంపుటిల్నే ప్రచురిస్తున్నవారూ ఉన్నారు. అయితే సుగమ్‌బాబు అన్నట్లు మన విమర్శకులు ఇతర కవితా ప్రక్రియలతో పోల్చడం రెక్కలు విషయంలోనూ జరుగుతున్నా, రెండూ భిన్నమైన రూపాలు. దేని శక్తి దానికుంది. అయినా, మినీ కవితా ప్రక్రియలు విరివిగా వస్తున్నప్పుడు వాటిని పోల్చి చెప్పడం కూడి విమర్శకుల బాధ్యతే అవుతుంది. మినికవిత్వంలో గానీ, ఇలాంటి లఘుకవితా రూపాల్లో గానీ ఒకలోపం చాలా స్పష్టంగా కనిపిస్తుంది.

లోకోక్తుల్ని చిన్నచిన్నపదాలుగా విడగొట్టేసి కవిత్వంగా ప్రచురిస్తున్నవాళ్ళున్నారు. అది రెక్కలు కవిత్వ తత్త్వం సరిగ్గా అవగాహన కానివాళ్ళు రెక్కలుగా రాస్తున్నదానిలో ఎక్కువగా కనిపిస్తుంది. ప్రపంచమంత భావనని ఒకరెక్కలోనే ఇమిడ్చేయాలనే అత్యుత్సాహం కూడా కొంతమంది రెక్కలు కవిత్వంలో వ్యక్తమవుతుంది. ఇంతకు ముందు వచ్చిన హైకూ, రుబాయిత్, గజల్స్ వంటి రూపాల్లో నియమాల్ని చెప్పడం వల్ల వాటిని పూర్తిగా కాకపోయినా, వాటిలో కొన్నింటినైనా పాటించే ప్రయత్నం చేయగలిగారు. వచనకవిత్వానికి వచనంలో రాయడమే మొట్టమొదటి లక్షణంగా భావిస్తున్నట్టు, ఆరు పాదాల్లో రాయడంతోనే రెక్కలు కవితారూపం వస్తుందనుకోకుండా, దాని తాత్త్వికతను, పాద లేదా అక్షర నియతినీ నిర్దేశించుకోవడం వల్ల ఈ ప్రక్రియకు స్పష్టత వస్తుంది. ఆ ప్రయత్నాన్ని రెక్కలు కవులూ, రెక్కలపై విమర్శలు రాస్తున్నవారూ గమనిస్తారని ఆశిద్దాం!

# ఆధునిక కవిత్వం– రూపపరిణామం

నూరేళ్లు పైగా సాహిత్యచరిత్ర కలిగిన ఆధునిక తెలుగుకవిత్వం రకరకాల రూపాల్లో వస్తోంది. ఒక ఉజ్జాయింపుగా మనం నూరేళ్ళంటున్నా దీనికి నూరేళ్లు కంటే ఎక్కువ చరిత్రే ఉందని లోతుగా పరిశీలిస్తే తెలుస్తుంది. కవిత్వంలో రూపం గురించి చర్చించేటప్పుడు రూపవాదం, రూపపరిణామాల మధ్య గల భేదాల్ని గుర్తించాలి. వస్తువుని ఎలా చెప్పాలనేది రూపవాదంలో ముఖ్యం. దీనిలో చెప్పే వస్తువుకంటే చెప్పే విధానానికే ప్రాధాన్యం ఉంటుంది. ఆ కవిత్వరూపాలు రావడానికి గల సామాజిక, చారిత్రక, రాజకీయ, ఆర్థిక కారణాలను వివరించి, ఆ కారణాల వల్ల కవిత్వరూపంలో వచ్చిన వివిధ పరిణామాలను విశ్లేషించడం రూపపరిణామం.

సంప్రదాయ తెలుగు కవిత్వాన్నంతటినీ చూసినా ఈ రూప పరిణామం కనిపిస్తుంది. ఈ పరిణామాలు సమకాలీన అవసరాలనుండీ, సాహిత్యాన్ని నిత్య నూతనం చేయడానికి సహకరిస్తాయి. నన్నయ కాలంలో పద్యం, శివకవుల యుగంలో ద్విపద, తర్వాత మళ్ళీ 16వ శతాబ్దం వరకు పురాణేతిహాసాలు 'పద్యరూపం'లోనే వచ్చాయి. తర్వాత రూపపరంగా నవ్యతను తీసుకొచ్చింది ప్రబంధ ప్రక్రియ. సుమారు మూడు దశాబ్దాలవరకు ప్రబంధాల ప్రభావం కొనసాగినా, తర్వాత సమాజంలో వచ్చిన మార్పుల ఫలితంగా సాహిత్యానికి మరింత నవ్యతను తీసుకొచ్చింది ఖండకావ్యం. ఈ మధ్యలో అక్కడక్కడా చిత్రకవిత్వం, దండకం, శతకం, ఖండకావ్యాలు వంటి కవిత రూపాలు వచ్చాయి. అవన్నీ బహిర్నిర్మాణపరంగా చూస్తే ఛందోబద్ధ పద్యంగానే కొనసాగాయని అర్థమవుతుంది.

భావకవిత్వం పేరుతో కనిపించే కవిత్వంలో తెలుగు కవిత్వం వస్తు, రూపాల్లో మౌలికమైన మార్పు కనిపిస్తుంది. తెలుగు సాహిత్యంలో 1909, 1910 సంవత్సరాల నుండీ ఈ రకమైన కవిత్వం కనిపిస్తున్నా సారభూతంగా చూసినప్పుడు దానిలోనూ

సంప్రదాయభావనల వైపే మొగ్గుచూపిందనేది విమర్శకుల అభిప్రాయం. భారతదేశంలోను, తెలుగు సమాజంలోను ఆనాటికి ఇంకా వాస్తవికవాద ఆధునిక సాహిత్య దృష్టి పెరగకపోవడమే దీనికి ప్రధాన కారణంగా పరిశోధకులు భావిస్తున్నారు. యూరపులో వచ్చిన రొమాంటిసిజం ప్రభావంతో తెలుగులో భావకవిత్వం వచ్చినా అది వ్యక్తివాద ధోరణితోనే తప్ప, భారతదేశ సామాజిక, ఆర్థిక పరిస్థితులను బట్టి వచ్చింది కాదనేది కొందరి వాదన. ఎందుకంటే అప్పటికే యూరోపియన్ సమాజంలో 1748లో పారిశ్రామిక విప్లవం (ఇంగ్లండు) వల్ల సమాజనిర్మాణంలో వస్తున్న మౌలికమైన మార్పుల్ని మేధావులు గుర్తించారు. 1789లో ఫ్రెంచి విప్లవం (ఫ్రాన్స్) వల్ల స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం వంటి భావనలు మొదలైయ్యాయి. పాతవిలువల స్థానంలో కొత్తవిలువలు రావడం వంటి వాటి సంఘర్షణ ఫలితంగా అక్కడ కాల్పనికవాదం వచ్చింది. ఇలాంటి పరిస్థితులేవీ తెలుగు సమాజంలో రాకుండానే, ఆంగ్ల సాహిత్యాన్ని చదువుకున్నవాళ్ళ ప్రభావంతో భావకవిత్వం వచ్చినా, కవులు సంప్రదాయవాసనల్ని వదల్లేకపోయారు. అందువల్ల వస్తువులో కొంత నవ్యతలా అనిపించినా, రూపంలో పెద్దగా మార్పురాలేదు. నిజమైన రూపపరమైన పరిణామం, ఆధునికతలనేవి గురజాడ అప్పారావుగారి 'ముత్యాలసరములు' తోనే ప్రారంభమైంది.

మన విమర్శకులు ఆధునికతను రెండు రకాలుగా గుర్తిస్తున్నారు. సమకాలీతనే ఆధునికతగా గుర్తించటం మొదటి రకం. దీని ప్రకారం సమకాలీన సాహిత్య ధోరణులన్నీ ఆధునికతలో భాగమే అవుతాయి. పద్య కవిత్వం, వచనకవిత్వం, గేయకవిత్వం... ఇలా ఏ రూపంలో వచ్చినా అదంతా ఆ కాలాన్ని బట్టి ఆధునిక కవిత్వమే అవుతుందంటారు. ఇక్కడ ఆధునికత కాలవాచిగా కనిపిస్తుంది.

రెండవది, మారిన ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితుల పునాదిగా ఏర్పడిన కొత్త దృక్పథాలను, స్వరూపాన్ని సంతరించుకోవడాన్ని ఆధునికతగా గుర్తించటం. దీన్నే ఆధునికతను తాత్త్విక కోణం నుండి చూడ్డం అంటారు. దీన్ని బట్టి ఛందోబద్ధ పద్యమైనా, వచనమైనా, గేయమైనా ఆ కవిత్వంలో ఆధునికతా లక్షణాలను గుర్తించి, అది ఆధునిక కవిత్వమో కాదో తెలుసుకోవడం జరుగుతుంది. సాహిత్య తత్త్వాన్ని బట్టి అది ఆధునిసాహిత్యమో, సంప్రదాయసాహిత్యమో గుర్తించగలుగుతాం.

ఆధునిక సాహిత్యం లక్షణాల్లో మానవుణ్ణి కేంద్రంగా భావించడం, భావవాదానికంటే భౌతికవాదానికి ప్రాధాన్యాన్నివ్వడం, మూఢవిశ్వాసాలను ఖండించడం, హేతుబద్ధమైన వాటికీ, వైజ్ఞానిక విషయాలకు ప్రాధాన్యాన్నివ్వడం

వంటివన్నీ ఆధునిక సాహిత్యంలో భాగంగా చూస్తున్నారు విమర్శకులు. ఈ లక్షణాలు కలిగిన సాహిత్యం ఛందోబద్ధమైన పద్యమైనా, వచనకవిత్వమైనా, గేయ కవిత్వమైనా దాన్ని ఆధునిక కవిత్వంగానే భావిస్తున్నారు. ఆధునిక సాహిత్యంలో శైలీ, ఆలంకారిక ప్రయోగాలు, తీసుకొనే వస్తువూ, ఆ వస్తువుని అందించే రూపం కూడా ప్రాధాన్యాన్ని సంతరించుకుంటాయి. ఇవన్నీ సంప్రదాయ ఛందోబద్ధకవిత్వం కంటే ఆధునిక కవిత్వంలో ప్రధానంగా కనిపిస్తున్నాయి. ఆధునికతను వివరించుకున్నట్లే విమర్శకుల అభిప్రాయాల్ని బట్టి కవితా రూపం అనేది బహిర్నిర్మాణ, అంతర్నిర్మాణాలకు సంబంధించిందనే వివరణ కనిపిస్తుంది. బహిర్నిర్మాణంలో ఛందోబద్ధపద్యంగాను, వచనకవిత్వంగాను, రాగయుక్తంగా సాగే గేయంగాను వివిధ రూపాల్లో కనిపిస్తుంది. అంతర్నిర్మాణాన్ని బట్టి కవిత్వంలో ప్రయోగించే భాషాశైలీ, ప్రతీకలు, భావచిత్రాలు, వస్తువిస్తరణలన్నీ కవితారూపంలో భాగాలుగానే చూడాలని విమర్శకుల అభిప్రాయం. వస్తు-రూపాలనే విభజన స్థూలమైందే గాని, సూక్ష్మమైంది కాదనే విమర్శకులు కూడా ఉన్నారు.

కవిత్వంలో 'వస్తు-రూపా'ల చర్చ 'సారం-రూపం' పేరుతో అభ్యుదయ కవిత్వం కాలంలో ప్రారంభమై, విప్లవకవిత్వం కాలం నాటికి విస్తృతమైన చర్చోపచర్చలకు కారణమైంది. సుమారుగా 1920 నుండి 1930 వరకు భావకవిత్వ కాలంగా చెప్పుకున్నా, తర్వాత 1930 నుండీ అభ్యుదయ, విప్లవకవిత్వాలయుగాలుగా 1980 వరకు కొనసాగాయి. ఆ తర్వాత కాలం మంతా స్త్రీ, దళిత, మైనారిటీ, ప్రాంతీయ సాహిత్య ఉద్యమాలదే అన్నట్లు కనిపిస్తుంది. ఇక్కడెక్కడా కూడా విప్లవ కవిత్వం పూర్తిగా ఆగిపోవడం జరగలేదు. అలాగే స్త్రీ వాద కవిత్వం, దళితకవిత్వం వంటివన్నీ ఆగిపోవడం వల్లనే తర్వాత ధోరణులు రావడంగా కాకుండా, వాటికి ఆ సామాజిక పరిస్థితుల బట్టి ఆ వస్తువున్న కవిత్వానికి ప్రాధాన్యం పెరిగింది. అందువల్ల ఆ పేర్లతో ఆ కవిత్వాన్ని పిలుస్తున్నారు. వీటన్నింటి మధ్యకాలంలో సమాజపరిణామగతుల్లో పీడితప్రజల్ని పట్టించుకోకుండా, వస్తువుకి ప్రాధాన్యాన్నివ్వకుండా, వచనరూపంలోనే వచ్చినా, కవిత్వంలో 'కవిత్వమే' ప్రధానమంటూ 'శుద్ధకళావాద' దృష్టితో చేతనావర్తనకవిత్వం అనేదొకటి కనిపిస్తుంది. సంప్రదాయ కవిత్వాన్ని రాసే వాళ్ళే చేతనావర్తన కవులుగా, తర్వాత్తర్వాత నవ్యసంప్రదాయవాదులుగా మారిపోయారు.

విప్లవ కవిత్వం తర్వాత ఉద్యమప్రాయంగా వచ్చిన స్త్రీవాద, దళిత కవిత్వాల్లో

కూడా రూపానికంటే వస్తువుకే ప్రాధాన్యాన్నిచ్చాయి. సమజంలో వస్తున్న మార్పుల్ని బట్టి దిగంబరకవిత్వం రకరకాలైన పద్ధతుల్లో భాషను ప్రయోగించి సమాజంలోని వికృతస్వరూపాన్ని బయటపెట్టే ప్రయత్నం చేసింది. స్త్రీ, దళిత, ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమాల్లో లింగవివక్ష, ఆత్మగౌరవప్రకటన, స్థానీయతలనేవి ముందుకొచ్చేసరికి కవిత్వం రాసేవాళ్ళు మరింతజాగ్రత్తపడాల్సి వచ్చింది. ఈ పరిస్థితుల్లో కొన్ని వ్యక్తివాదధోరణుల నుండి కవిత్వంలో ప్రయోగాలు చేస్తూ కొన్ని విదేశీ కవితారూపాల్ని తెలుగులోకి ప్రవేశపెట్టారు. అలా వచ్చిందే హైకూ కవిత్వం. దీనిలో తాత్త్వికతనూ, పదచిత్రాలను, ప్రతీకలను విస్తృతంగా ప్రయోగించి, కవిత్వాన్ని అందని ద్రాక్షగా చేయాలనే ప్రయత్నం చేసిన వాళ్ళున్నారు. కానీ, హైకూ, దాన్ని ఆసరాగా చేసుకొని వచ్చిన మరికొన్ని రూపాలు కవిత్వానికంటే వస్తువుకే ప్రాధాన్యాన్నిచ్చాయి. అప్పుడే హైకూల్లోని ఛందస్సు గురించి చర్చ జరిగింది. మనతెలుగు అక్షరాలకూ జపానీయ సిలబల్స్ కీ చాలా వ్యత్యాసాలుండటం, తెలుగు కవులు వస్తువుపట్లే దృష్టిని కేంద్రీకరించడం వంటివన్నీ జరిగిపోయాయి.

రూపపరంగా బహిర్నిర్మాణంలో ఛందోబద్ధంగా పద్యం కనిపిస్తున్నా, అంతర్నిర్మాణాన్ని చూస్తే సరళమైన శైలిలో, సామాజిక స్పృహతో కూడిన వస్తు వైవిధ్యంతో వచ్చిన పద్య కవిత్వం కూడా కనిపిస్తుంది. అలాగే, సంప్రదాయ పునరుద్ధరణ దిశగా పురాణేతిహాసాలనే వస్తువులుగా స్వీకరిస్తూ సౌందర్య దృక్పథంతో వస్తున్న ఛందోబద్ధపద్యకవిత్వమూ వస్తుంది. వచనకవిత్వంగా రాసినప్పటికీ కవిత్వంలో అస్పష్టత అనే గుణంతో వస్తున్న కవిత్వం కూడా కనిపిస్తుంది. దీన్ని నిరసిస్తూ కూడా కవిత్వం వచ్చింది. అయితే, బహిర్నిర్మాణంలో రకరకాల రూపాల్ని సంతరించుకున్నప్పటికీ గజల్, హైకూ వంటి ఒకటి రెండు కవితారూపాలు తప్ప మిగతా కవితా రూపాలన్నీ సామాజికస్పృహను కలిగినవే. అవి కూడా తెలుగులో ప్రవేశించిన తొలినాళ్లలోనే అలా ఉన్నాయి. తర్వాత కాలంలో వస్తుప్రాధాన్యాన్నే అందిపుచ్చుకున్నాయి. చేతనావర్తన, నవ్యసంప్రదాయకవులు వస్తువుని నిరాకరిస్తున్నట్లు కనిపిస్తూనే 'వస్తువు'తోనే పేచీ పడుతూ దాన్ని కనిపించకుండా కవిత్వసౌందర్యమే ప్రధానమని వాదిస్తుంటారు.

తమ కవిత్వం భావజాలాన్ని పట్టించుకోదంటూనే మార్క్స్ భావజాలాన్ని, అంబేద్కర్ భావజాలాన్ని సమర్థించే విప్లవ, దళిత కవిత్వాలను వ్యతిరేకిస్తుంటారు. ఇప్పటివరకు చెప్పుకున్నవన్నీ అలా కవిత్వాన్ని మరింత సరళతరం చేసి ప్రజలకు మరింత చేరువకావాలనే తపనతో, కాలానుగుణంగా వచ్చిన ప్రజాస్వామిక రూపాలే

తప్పు, చెప్పే అంశంకంటే, చెప్పే విధానానికే ప్రాధాన్యమనే రూపవాద ధోరణితో వచ్చిన కవితారూపాలు కాద్సు కళ కళకోసమనే శుద్ధకళావాదమూ కాదు. ఇవన్నీ ఈ నూరేళ్ళ తెలుగు ఆధునిక కవిత్వ రూపపరిణామంలో కనిపించే విశేషాంశాలు.

సాధారణంగా సమాజంలో ఎలాంటి ప్రత్యక్ష సామాజిక ఉద్యమాలు జరగనప్పుడు- కవులు, కళాకారులు ఎటువైపు వెళ్ళాలో తెలియని ఒక సందిగ్ధ పరిస్థితుల్లో వ్యక్తివాద, రూపవాద ధోరణులు బయలుదేరుతుంటాయి. ఈ నూరేళ్ళ తెలుగు కవిత్వపరిణామాల్ని చూసినప్పుడు కూడా అటువంటి స్తబ్దత ఏర్పడినప్పుడల్లా వ్యక్తివాద ధోరణులు కనిపించాయి. అది భావకవిత్వ యుగంలోనే కనిపించినా, మళ్ళీ జాతీయోద్యమం ఊపందుకోవడంతో రూపవాదధోరణి తగ్గి, అభ్యుదయ కవిత్వం వచ్చింది. మళ్ళీ అభ్యుదయ కవిత్వానంతరం కూడా అధివాస్తవికతాధోరణి రూపంలో వ్యక్తివాద ధోరణులతో రూపవాదం బలం పుంజుకుందనిపించింది. కానీ వెంటనే దిగంబరకవిత్వం, విప్లవకవిత్వం, స్త్రీవాద, దళితోద్యమ, ప్రాంతీయవాద కవితాధోరణులు రూపవాదాన్ని దరిదాపులకు రాకుండా చేయగలిగాయి. అయినప్పటికీ, ఈ మధ్యకాలంలో ప్రపంచీకరణ ప్రభావంతో వ్యక్తివాద ధోరణులతో మళ్ళీ వివిధ రూపాల్లో కవిత్వం వస్తోంది. కానీ, ఇందులో అత్యధికశాతం రూపవాద స్వభావాన్ని కాకుండా సమకాలీన సామాజిక పరిస్థితులను బట్టి మారిన శాస్త్ర, సాంకేతిక రంగాల్ని ఉపయోగించుకొంటూ సామాజిక సమస్యల్ని ప్రతిబింబిస్తూనే వివిధ రూపాలుగా కవిత్వం రావడం గుర్తించాల్సిన ముఖ్యపరిణామం.

ఈ దృష్టితో చూసినప్పుడు ఈ నూరేళ్ళ ఆధునిక తెలుగుకవిత్వాన్ని ఛందోబద్ధపద్యం ఒక నిరంతరస్రవంతిగా కొనసాగడం ఒక పరిణామంగాను; మరో మార్గంలోవచనకవిత్వం-దీర్ఘకవిత, దీర్ఘకావ్యం, మినీకవిత, ఆడియో కవిత (శ్రవ్యగానరూపం), ఇంటర్నెట్ టెక్నిక్ దృశ్య, శ్రవ్యరూపకవిత్వం, కార్టూన్ కవిత్వం, హైకూ, రెక్కలు, నానీలు, నానోలు, ముక్కాణీలు వంటి భిన్న రూపాల్ని సంతరించుకుంటూ దశలు దశలుగా కనిపించడం మరొక పరిణామంగాను కనిపిస్తుంది. వీటి వస్తు, రూపాలను పరిశీలించినప్పుడు ఆధునిక కవిత్వ రూపపరిణామంలో రూపవాద ధోరణులు కొన్ని కనిపించినా, అది రూపవాదంగా రూపొందలేకపోయిందని స్పష్టమవుతుంది.

***(తెలుగుశాఖ, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో జూలై 31, 2014 వతేదీన జరిగిన 'నూరేళ్ళ ఆధునిక తెలుగుకవిత్వం -పునర్వీక్షణం' అనే జాతీయసదస్సులో సమర్పించిన పరిశోధన పత్రసారాంశం)***

# కావ్యాల లోతులు తెలిపే పేటిక బేతవోలు వారి "వ్యాసపీఠిక"

విశేషమైన పాండిత్యం గల ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారు పట్టిందల్లా బంగారంలా చూపగల పరుసువేది లాంటివారు. ఆయన చెప్పేది ఏదైనా స్వారస్యంతో నిండి ఉంటుంది. లోకానుభవం, సమకాలీన సాహిత్య స్వరూప స్వభావాలు, భాష, వ్యాకరణ, ఛందో అలంకారాది విషయాల్లో ఆయనకు గల అధికారం అలాంటిది. అన్నింటికీమించి ఆయన గొప్ప కవీ, సహృదయ విమర్శకులు. ఆయన ఇటీవల"వ్యాస పీఠిక" పేరుతో ఒక గ్రంథాన్ని ప్రచురించారు. దీనిలో పది పరిశోధన వ్యాసాలున్నాయి.

భరతుడు చెప్పిన అభినయాలలో చిత్రాభినయం గురించి ఈ గ్రంథంలో చేసిన వివేచన కళావిమర్శకులను ఆలోచింపచేసేటట్లుగా కొనసాగింది. అభిజ్ఞాన శాకుంతలంలో దుష్యంతుడు రథం మీద వస్తూ లేడిని తరుముకొచ్చే దృశ్యం, స్వప్న వాసవదత్తంలో స్వప్నదృశ్యం వంటి వాటిని నాటకంలో ప్రాంతీయ ముద్రతో అభినయించే వీలుందని ఆ దిశగా కృషి చేసే వారికి ఒక కొత్త మార్గాన్ని సూచించారు. అలాగే వేమన ఛందో ఆలంకారాలలో దాగి ఉన్న కళారహస్యాలను వివరించిన వ్యాసం వేమనను పండితుల దగ్గరకు మరింతగా చేరువ చేస్తుంది. ఈ వ్యాస సంపుటిలో పండిత పామర జనరంజకంగా ఆస్వాదించగల వ్యాసాలు మరికొన్ని ఉన్నాయి. వాటిలో ప్రముఖంగా పేర్కొన దగినది "మృచ్ఛకటికమ్ సామాజికత" అనే వ్యాసం. దీనిలో సాహిత్య పునర్మూల్యాంకనం చేసే పద్ధతిని మరింత సరళీకృతం చేశారు. ఈ నాటకంలో శర్విలకుడు, చారుదత్తుడి ఇంటికి కన్నం వేసిన సందర్భంలో యజ్ఞోప వీతం మీద ఒక చలోక్తి విసురుతాడు. కన్నం కొలుచుకోవడానికి దాన్ని ఉపయోగించు కోవచ్చునేదా చలోక్తి. దీన్ని ఆసరగా చేసుకుని రచయిత అయిన శూద్రకుడు ద్విజుడు కాదనే వాదనలు జరిగాయి. కానీ, దొంతగనం ఆరోపణతో చారుదత్తుడు శిక్ష అనుభవించటానికి వెళ్లే సందర్భంలో తన ఏకైక పుత్రుడు రోహసేనుణ్ణి

వీడ్కోలు పుతూ యజ్ఞోపవీతం గురించి ఉన్నతీకరించే చెప్పాడు. *"ఏమి ఆస్తి ఇవ్వగలను అని ఆలోచించి తన భుజాన ఉన్న జందెం తీసి అతడికి వేస్తాడు. దీనికి ఒక ముత్యం ఉండకపోవచ్చు. ఒక బంగారు పోగు ఉండక పోవచ్చు. కానీ బ్రాహ్మణులకు ఇదే గొప్ప విభూషణం దేవ పితృకార్యాల నిర్వహణకు అతిప్రధానం"* అని కీర్తించటాన్ని బట్టి మరోలా కూడా ఊహించే వీలుందని చెప్తూనే, అక్కరమాషీలకు కావ్య గౌరవం కలిగించిన శూద్రకుడికి జోహార్లన్నారు రామబ్రహ్మంగారు. మరొకటి, సహృదయనిమర్శ ఎలా చేసే అవకాశం ఉందో తెలిపేది మల్లెమాలరామాయణంపై రాసిన వ్యాసం. ఒక లేఖలా, ఒక సంభాషణలా సాగిపోతుంది. దీన్ని పది కాలాల పాటు నిలిచే రచనగా భావించి, భక్తి శ్రద్ధలతో పారాయుణం చేసి, మొహమాటమేమీలేకుండా తన బుద్ధికి తోచినవన్నీ చెప్పిన వ్యాసంగా రామబ్రహ్మంగారే చెప్పుకున్నారు.

ఆయన చెప్పుకోకపోయినా ఇంచు మించు ప్రతివ్యాసం మనసు పెట్టి రాసిందే! కాకపోతే దీనితో పాటు మామిడేల కృష్ణ మూర్తి గారు సంస్కృతంలో రాసిన శ్రీమద్వాల్మీకి మానసమ్ కావ్యానికి ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు రాసిన పీఠికలను రెండు సిద్ధాంత గ్రంథాలనవచ్చు. ఆ వ్యాస స్వరూప, స్వభావాలు అలాగే ఉన్నాయి. రెండూ చదివిన తరువాత పాఠకుల కచ్చితంగా మూల రచనలతో పాటు వాల్మీకి రామాయణాన్ని కూడా చదవాలను కుంటారు. మల్లెమాల రామాయణంలో ఉక్తి వక్రతనూ సోదాహరణంగా వివరించారు. దీన్ని ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారి మాటల్లోనే వింటే బాగుంటుందేమో!''యుద్ధకాండలో రావణాసురుడు రామ శిరస్సునూ ధనుర్బాణాలనూ సృష్టించి సీత ముందు ప్రదర్శింప జేస్తాడు విద్యుజ్జిహ్వుడి సహకారంతో. కాసేపటికి అవి మాయమైపోతాయి. అక్కడ మీ పద్యం

***"అసురనేత యట్టు లరిగేన వెంటనే***
***మాయదారి శిరము మాయమయ్యె***
***నంత ధనువు నమ్ము నాదారినేపట్టె***
***శింశుపమ్ము మనము చివురు దొడిగె"***

చివరి పాదంలో ఈ ఉక్తి వక్రతకు లాల్ సలామ్! మాయదారి శిరము అనడంలో ఉంది మిగతా సొగసంతా. మాయదారి అనేది ఒక వైపున తెలుగు నుడికారం, మరొక వైపున అది మాయా కల్పితం. కనక మాయదారి శిరము. అంతేనా/ మాయ–

దారి అనే రెండింటిలో మొదటి మాయ– మాయమయ్యింది. ఇంక 'దారి' మిగిలింది. శింశుపం చిగురు తొడగదూ/ చెట్టు చిగురిస్తే ఏమయ్యింది. దాని మనస్సు చిగురించింది అనడంలో ఉంది గడుసుదనమంతా'' ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు ఇలా వివరించడంలో కూడా గడుసుతనమే కనిపిస్తుంది.

వీటితో పాటు మృచ్ఛకటిమ్ పైనే మరో వ్యాసం కూడా పేర్కొన దగినది. మృత్తికాశకటం జీవన వాస్తవికతకు, సువర్ణశకటికం స్వాప్నికతకూ ప్రతీకలుగా నిరూపించారు. *"వసంతసేన బంగారపు బండిలో జీవయాత్ర సాగిస్తున్నా, ఆమె అంతరంగం కుల వధూ గౌరవం కోసం పరితపిస్తూనే ఉంది. దాన్ని ఆమెకు బంగారపు బండి సమకూర్చి పెట్టలేకపోయింది. అది వదులుకున్నాక మాత్రమే ఆమెకు ఆ గౌరవం దక్కింది"* అని సమన్వయించారు. ఈ వ్యాస సంపుటిలో రామబ్రహ్మంగారి జీవితానుభవం, లోకానుభవం, సాహిత్య శాస్త్ర పాండిత్యం ముప్పేటలా కనిపిస్తూ, పాఠకులకు కొత్త ఆలోచనలను కలిగిస్తుంది. సంస్కృత, తెలుగు భాషా సాహిత్యాలలో ప్రాచీన, ఆధునిక స్థితి గతులను పునర్మూల్యాంకనంతో అర్థం చేసుకోవడానికి కూడా ఈ వ్యాసాలు ఎంతగానో ఉపకరిస్తాయి. పూర్వ కవులను, కావ్యాలను గౌరవిస్తూనే, ఆధునికంగా జరగవలసిన కృషికి ప్రేరణగానూ ఈ వ్యాసాలు నిలుస్తాయి.

**– ఆంధ్రప్రభ సాహితీగవాక్షం, *14-12-2009***

# కవిజీవిత కావ్యసమన్వయ విమర్శ- 'మా నాన్నగారు" గ్రంథం

సాధారణంగా ఏదైనా ఒక గాఢమైన ముద్రవేయగలిగిన రచనను చదివినప్పుడు, ఆ రచన చేసిన వారి గురించి తెలుసుకోవాలనే ఆసక్తి కలుగుతుంది. వాళ్ళపై వచ్చిన జీవిత చరిత్రలు చదవాలనిపిస్తుంది. కానీ, మన తెలుగు సాహితీవేత్తల జీవిత విశేషాలు, అదీ ముఖ్యంగా ప్రాచీన సాహితీవేత్తలవయితే అసలే దొరకడం గగన కుసుమమే అన్నట్లుంటుంది. అప్పుడు ఆ కవి గురించి రకరకాల "కథలు" ప్రచారంలోకి వచ్చేస్తుంటాయి. కొన్ని రచనల్ని రచయిత వ్యక్తిగత జీవితంతో ముడిపెట్టి వ్యాఖ్యానించేటప్పుడు తప్పుడు నిర్ణయాలకు కారణమవుతుంటాయి. దీనిక్కారణం ఆ కవి జీవిత విశేషాలు కొన్ని కూడా లభించకపోవడమే ప్రధాన కారణం! ఇటువంటి పరిస్థితి కేవలం ప్రాచీన తెలుగు కవులకే కాదు, ఆధునిక సాహితీవేత్తలకూ తప్పట్లేదు. అందువల్ల సాహిత్యాన్ని చదివే వాళ్ళు, ఆ సాహితీవేత్తల జీవిత వివరాలు కూడా తెలుసుకోగలిగినట్లైతే ఆ సాహిత్యాన్ని అవగాహన చేసుకోవడంలో తప్పుడు నిర్ణయాలకు, అభిప్రాయాలకు లోను కాకుండా ఉండేందుకు సహకరిస్తుంది! ఇలాంటి లక్ష్యంతోనే ప్రముఖ విమర్శకుడు డా. ద్వా. నా. శాస్త్రి "మా నాన్న గారు" పేరుతో కీర్తిశేషులైన అరవైరెండుమంది తెలుగు సాహితీవేత్తల జీవిత విశేషాలను ఒక గ్రంథంగా ప్రచురించారు.

సాహితీ ప్రముఖుల వివరాలను వారి కూతురు లేదా కొడుకు నుండి సేకరించినా, అవి వారి మాటల్లోనే వ్యాస రూపంలో ప్రకటించడం ఒక విశేషం. ప్రసిద్ధ పరిశోధకుడు, తొలి తెలుగు పదం "నాగబు" ని గుర్తించిన వేటూరి ప్రభాకర శాస్త్రి గారి గురించి వాళ్ళ కుమారుడు ప్రముఖ పరిశోధకుడు వేటూరి ఆనందమూర్తి అనేక విశేషాల్ని వివరించారు. కందుకూరి వీరేశలింగం ఆంధ్రకవుల చరిత్ర రాసేటప్పుడు ప్రభాకర శాస్త్రి గారు పరిశోధన విధానాన్ని వివరిస్తూ, అనేక పద్యాల్ని

పంపి సహాయం చేశారని పేర్కొన్నారు. సన్మానాలప్పుడు జరిగే పొరపాట్ల వల్ల వయోభారం మీద పడుతున్న కవులు ఎలా అసహనానికి గురౌతుంటారో రాయప్రోలు సుబ్బారావు గారి గురించి శ్రీనివాస్ గారు రాసిన సంఘటన వివరిస్తుంది. తృణకంకణం గొప్ప కావ్యం రాసిన కవి తన భార్యను వంటింటికే పరిమితం చేసిన నిజాల్ని శ్రీనివాస్ గారు వెల్లడించడంలో నిజాయితీ కనిపిస్తుంది. నాటి స్త్రీకున్న స్వేచ్ఛను తెలుపుతుంది. మొక్కపాటి నరసింహశాస్త్రి గారి పేరు వినగానే "బారిస్టర్ పార్వతీశం" నవల గుర్తుకొస్తుంది. దానిలో కథానాయకుడు ఇంగ్లండు వెళ్ళేటప్పుడూ చేసే హంగామా, అక్కడికి వెళ్ళిన తర్వాత పరిస్థితులు నవ్వు తెప్పిస్తుంటాయి. నరసింహశాస్త్రి గారే లా చదవడానికి లండన్ వెళ్ళారేమో ననే సందేహం కూడా వస్తుంటుంది. నిజంగానే రచయిత లండను వెళ్ళాడని ఆయన రాసిన స్వీయ చరిత్ర మనకి తెలియ జేస్తున్నా, ఆ రచనా నేపథ్యం మరింత తెలియాలంటే, వాళ్ళమ్మాయి అడ్డాల లలితాదేవి గారి మాటల్లో వినాల్సిందే. నరసింహశాస్త్రి గారు నవలని చేతితో రాయలేదనీ, తాను చెపుతుంటే వ్రాయసకాండ్రు రాసేవారని ఈ పుస్తకాన్ని బట్టి స్పష్టమవుతుంది.

తెలుగు మాస్టార్లంటే నేటికీ చాలా చోట్ల చులకన భావం ఉంది. ఇతర సబ్జెక్టుల వాళ్ళకిచ్చేంత జీతం తెలుగు వాళ్ళకివ్వడానికి మనస్కరించని స్థితే ఇంకా చాలా ప్రైవేటు విద్యాసంస్థల్లోనేటికీ కనిపిస్తుంది. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారిని ఈ విషయం చాలా ఆలోచింపజేసింది. ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు అధ్యాపకుడుగా పనిచేస్తున్నప్పుడు నాటి వైస్ ఛాన్సలర్ తో మాట్లాడి, ఆంగ్లోపన్యాసకులతో పాటు సమాన వేతనాన్ని తెలుగు వాళ్ళూ పొందేలా చేయడంలో విశేషమైన కృషిచేసిన వారు లక్ష్మీకాంతం గారని వాళ్ళబ్బాయి సుందరం గారు పేర్కొన్న విషయాలను బట్టి తెలుస్తుంది. *ఆంధ్రసాహిత్య చరిత్ర, సాహిత్యశిల్ప సమీక్ష, గౌతమవ్యాసాలు వంటి పరిశోధన, విమర్శ గ్రంథాలు, తొలకరి, సౌందరనందం* మొదలైన కావ్యాలు రాసిన సాహితీ వేత్త కుటుంబంలో ఎవరూ సాహిత్యం పై అభిరుచిని పెంచుకోలేకపోయామని సుందరం స్పష్టం చేశారు. సౌందరనందం కావ్యం రాయడంలో జంటకవులుగా ప్రసిద్ధులైన పింగళి, కాటూరి వారి భాగాలు ఎంతవరకూ ఉన్నాయో తెలియాలంటే పింగళి సుందరం గారు చెప్పిన ముచ్చట్లు చదవాల్సిందే. జంటకవుల పేరుతో రాసిన రచనలను అర్థం చేసుకోవడానికీ వ్యాసం కొంతవరకూ తోడ్పడుతుంది. దీపాల పిచ్చయ్య శాస్త్రి గారి గురించి వాళ్ళబ్బాయి

రాధాకృష్ణ మూర్తి రాస్తూ వాళ్ళ నాన్నగారు కులం కట్టుబాట్లను అధిగమించలేకపోయిన వైనాన్ని తెలిపారు. అలాగని కరడుకట్టిన కులవాది కాదని కూడా తెలిపారు. గుర్రం జాషువా గురించి వాళ్ళమ్మాయి హేమలతా లవణం చెప్పిన అంశాలు కవిని అర్థం చేసుకోవడానికి చాలా తోడ్పడతాయి. కులం పొందిన అవమానాలు హృదయాన్ని చీల్చినా, అందరి హృదయాల్ని కరిగించగలిగిన ప్రేమమూర్తిగా సాగిన వివిధ ఘట్టాల్ని వివరించారు. నిజానికీ వ్యాసం కంటే అంతకు ముందే జాషువా గురించి హేమలతా లవణం గారు అనేక విషయాలు రాసినా, వాటి కంటే కొత్త విషయాల్ని ఇందులో ప్రస్తావించారు. ''*నాన్న గారు తన రచనల్లో ఆస్తిక వాదిగా కనిపిస్తారు. కాని, ఆచరణలో పూర్తిగా నాస్తికుడుగా నాకు కనపడతారు*'' అని హేమలత గారు వ్యాఖ్యానించడాన్ని అర్థం చేసుకుంటేనే జాషువాలోని నాస్తికాస్తికత్వం అవగాహన అవుతుంది. అడవి బాపిరాజు గారి గురించి వాళ్ళమ్మాయి క్రొవ్విడి ప్రేమకుమారి తన ప్రేమనంతా కవిత్వంగా మార్చి రాసినట్లుగా ఎంతో ఆత్మీయంగా ఉంది. కవిది భీమవరం. అయినా ఆయన వృత్తి రీత్యా తెలంగాణాలోనే జీవించి చనిపోయారు. ఆయనతో పెనవేసుకున్న సాహితీ కళా బంధువులంతా తెలంగాణా ప్రాంతంలో అనేక చోట్ల సంతాప సభలు పెట్టారని వివరించారు.

తెలంగాణ ప్రాంతానికి చెందిన సురవరం ప్రతాప రెడ్డి గారి గురించి సుమారు ఏనభైసంవత్సరాల వాళ్ళబ్బాయి ఎస్. ఎన్. రెడ్డి రాస్తూ తెలంగాణ ప్రాంతంలో తెలుగుకి స్థానం లేని కాలంలో తెలుగు భాష గురించి తపించిన మహోన్నత వ్యక్తిగా కీర్తించారు. నిజాం సార్వభౌమాధికారాన్ని కూడా నిరసిస్తూ సంపాదకీయాలు రాసేవారనీ, తెలుగు భాషను కాపాడ్డం కోసం ఆంధ్రవిద్యాలయం స్థాపించారని, కోర్టుల్లో కూడా తెలుగు భాష వాడుక పెరగాలని అప్పుడే సామాన్యుడికి కూడా న్యాయం అందుబాటులోకి వస్తుందని తపించేవారని వివరించారు. తమ నాన్న గారు చాలా పట్టుదల, ఆత్మగౌరవాన్ని అభిలషించిన వ్యక్తి అనీ అందుకనే తెలంగాణలో తెలుగు కవులు లేరన్నవాళ్ళకు సమాధానంగా 354 మంది ప్రసిద్ధ కవుల్ని గుర్తించి గోల్కొండ సంచిక వేశారని పేర్కొన్నారు. నిజానికివన్నీ వివిధ పుస్తకాల్లో దొరుకుతున్న వివరాలే. తండ్రి సాహితీ వ్యక్తిత్వం గురించి వివరిస్తే బాగుండేది.

గడియారం వేంకటశేషశాస్త్రి "శివభారతం" రాసిన ప్రసిద్ధ కవి. రాయలసీమ ప్రాంతం, కడప వాసి. ఆయన తెల్లవారగట్ల రచనలు రాసేవారని ఆయన కొడుకు సుబ్రహ్మణ్యం గారు రాశారు. ఇలా అనేక మంది జీవితాల్లో కనిపించే విశేష ఘట్టాల్ని

ఈ పుస్తకంలో పొందుపరిచారు. ఈ పుస్తకంలో ఆంధ్ర రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు చెందిన అనేక మంది ప్రముఖ కవుల గురించి ఉన్నా, కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల సాహితీవేత్తలే ఎక్కువ మంది కనిపిస్తున్నారు. తెలంగాణా ప్రాంతం నుండి దాశరథి, సుద్దాల హనుమంతు, దేవుల పల్లి రామానుజరావు, వానమామలై వరదాచార్యులు మొదలైన వాళ్ళ గురించి వివరించారు. కళింగాంధ్ర ప్రాంతం నుండి రావిశాస్త్రి, చాసో, బలివాడ కాంతారావు తదితరుల విశేషాల్ని పేర్కొన్నారు. చాలా మంది కవులు వివిధ ప్రాంతాల నుండి వచ్చి తెలంగాణా ప్రాంతంలో స్థిరపడిపోయిన స్థితి కనిపిస్తుంది. అయినా, వాళ్ళని జన్మస్థలం గురించి చెప్పుకునేటప్పుడు వాళ్ళ ప్రాంతం చెప్పడం తప్ప, ఇంచుమించు ఈ ప్రాంతంలోనే స్థిరపడిపోయిన వాళ్ళు ఉన్నారు.

ఒకప్పుడు రాయల సీమలో భాగంగా ఉండే ప్రకాశం జిల్లా నుండి వచ్చిన కేతవరపు రామకోటశాస్త్రిగారు కాకతీయ విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పనిచేసి, ప్రస్తుతం వాళ్ళమ్మాయి కాత్యాయనీ విద్మహే వరంగల్ వాస్తవ్యులుగానే పరిగణన పొందుతున్నారు. అదే జిల్లాకు చెందిన నాయని సుబ్బారావు గారు, వారి కూతురు నాయని కృష్ణకుమారి గారు హైదరాబాదు వాస్తవ్యులైపోయారు. కృష్ణా జిల్లాకు చెందినప్పటికీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తెలంగాణా ప్రాంతానికి చెందిన వారుగానే పేరు ప్రఖ్యాతులు పొందారు. వాళ్ళబ్బాయి ఆనందమూర్తి హైదరాబాదు వాస్తవులే అయిపోయారు. అలాగే చాలా మంది తెలంగాణా ప్రాంతంలోనే స్థిరపడిపోయి, వాళ్ళ పిల్లలు ప్రముఖ సాహితీ వేత్తలుగా ప్రఖ్యాతివహిస్తున్నారు. వీటన్నింటినీ బట్టి కవుల్ని ప్రాంతాల వారీగా విభజించుకుని పరిశీలించడంలో అనేక ఇబ్బందులు ఉన్నాయని కూడా తెలుస్తుంది. సాహిత్యాన్ని ప్రాంతీయ దృక్పథంతో పరిశీలన చేయడం ప్రారంభమైన ఈ సమయంలో ఈ అధ్యయనానికి కూడా ఈ పుస్తకం విలువైన సమాచారాన్ని అందిస్తుంది.

ఈ పుస్తకాన్ని పరిశోధన గ్రంథం గానే భావించవలసిన అవసరం ఉంది. మన సాహిత్య చరిత్ర రచనా పరిణామం కావలి రామస్వామి తెలుగు వాళ్ళ గురించి ఇంగ్లీషులో *The Biographical Sketches of Deccan Poets* పేరుతో 1829లో రాయడంతో మొదలైంది. ఆ తర్వాత గురజాడ శ్రీరామ మూర్తి *"కవి జీవితములు"* (1893), తర్వాత కందుకూరి వీరేశలింగం *"ఆంధ్రకవుల చరిత్రము"* (1917), చాగంటి శేషయ్య *"కవితరంగిణి"* (1946), మధునాపంతుల సత్యనారాయణ *"ఆంధ్ర*

*రచయితలు"* (1950), నిడదవోలు వెంకట్రావు *"తెలుగు కవుల చరిత్ర"* (1953), బులుసు వెంకట రమణయ్య *"ఆంధ్ర కవిసప్తశతి"* (1956), ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ *"ఆంధ్ర కవయిత్రులు"* (1958), ఆరుద్ర *"సమగ్ర ఆంధ్ర సాహిత్యం"* (1965) వంటి వన్నీ కవుల చరిత్రలను వెల్లడించే రచనలు. వీటిలో చాలా వాటిలో కవుల గురించి పుక్కిట పురాణాలు ఉన్నాయి. కవుల్ని అర్థం చేసుకోవడంలో అనేక ఇబ్బందులు ఉన్నాయనిపిస్తాయి. వీటిని సరిదిద్దే మార్గంలో కేవలం సాహిత్యాన్నే పరిశీలించే దిశగా కొన్ని సాహిత్య చరిత్రలు వచ్చాయి.

సాహిత్య చరిత్రల్లో ముఖ్యమైన వాటిలో కింది వాటిని పేర్కొనవచ్చు. వంగూరి సుబ్బారావు *"ఆంధ్రవాఙ్మయ చరిత్ర"* (1929), కవిత్వవేది *"ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము"* (1928), బసవరాజు అప్పారావు *"ఆంధ్ర కవిత్వ చరిత్రము"* (1932) కాశీనాధుని నాగేశ్వరరావు *"ఆంధ్ర వాఙ్మయ సూచిక"* (1929), ఖండవల్లి లక్ష్మీరంజనం *"ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము"* (1949), శిష్టా రామకృష్ణ శాస్త్రి "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము" (1957), దివాకర్ల వెంకటావధాని *''ఆంధ్రవాఙ్మయ చరిత్రము"* (1958), కూర్మా వేణుగోపాల స్వామి *"ఆంధ్ర వాఙ్మయ సంగ్రహ చరిత్ర"* (1958), పింగళి లక్ష్మీకాంతం *"ఆంధ్ర సాహిత్య చరిత్ర"* (1974), జి. నాగయ్య *"తెలుగు సాహిత్య సమీక్ష"* (1983–85), ద్వానాశాస్త్రి *"తెలుగు సాహిత్య చరిత్ర"*(1998) వంటి సాహిత్య చరిత్రలను అవగాహన చేసుకోవడానికి ఇప్పుడు వచ్చిన " మానాన్న గారు " గ్రంథం ఎంతగానో తోడ్పడుతుంది. ఇది విశ్వవిద్యాలయాల్లో ఒక పరిశోధన ప్రాజెక్టుగా రావలసిన గొప్పగ్రంథం. అలాగని ఇందులో ఉన్న విషయాలన్నీ వాస్తవాలే అనుకోవడానికి లేదు. కానీ, చాలా మంది సత్యాలను చెప్పడానికి ప్రయత్నించారని మాత్రం చెప్పవచ్చు. పేరు ప్రఖ్యాతులు పొందిన సాహితీవేత్తలైన తమ వాళ్ళ గురించి యధార్థవిషయాలు ఎంతమంది చెప్పారనేదీ అనుమానమే. వాళ్ళని కీర్తించడమే పనిగా పెట్టుకున్నట్లున్న వ్యాసాలూ దీనిలో చాలానే ఉన్నాయి.

గ్రంథ కర్త ద్వానాశాస్త్రి తన నాన్న గారిలోని బొమ్మా బొరుసులను చూపించినట్లు వివరించారు. ఈ గ్రంథంలో చాలామంది తమకి నచ్చని విషయాలను కూడా చెబితే వారి విశిష్ట వ్యక్తిత్వాలు మరంతగా స్పష్టమయ్యేవి. ఆ దిశగా మిగిలిన అనేక మంది ఉన్న సాహితీ వేత్తల గురించి కూడా తెలియపరిచే రచనలు వెలువడవలసిన అవసరాన్ని ఈ పుస్తకం చాటిచెప్తోంది. నిరంతరం సాహిత్యంతో కుస్తీ పడుతూ,

ఏదొక కొత్త విషయాన్ని లోకానికి అందించాలనే పరిశోధనాసక్తి గల డా. ద్వా. నా. శాస్త్రి తెలుగు సాహిత్య చరిత్ర అధ్యయనానికి కొత్తదారుల్ని చూపే మార్గం వేశారు. అందుకనే కవి జీవిత కావ్య సమన్వయ విమర్శకు ఈ గ్రంథం ఎంతగానో తోడ్పడుతుందన గలుగుతున్నాను. అంతేకాకుండా సాహిత్యాన్ని, కవుల్నీ అవగాహన చేసుకునే మంచి మార్గం వేసిన గ్రంథంగా దీన్ని అభివర్ణించవచ్చు. దీనిలో అరుదైన కవుల ఫొటోలు కూడా ప్రచురించడం మరింత బాగుంది.

***–(సూర్య దినపత్రిక, సాహిత్యానుబంధం : 19-4-2010)***

# దేశి సాహిత్యం–పరిశోధన

దేశిసాహిత్యంలో జరిగిన పరిశోధనలను భాష, వ్యాకరణం, ఛందస్సు, జానపదసాహిత్యం మొదలైన విభాగాలుగా వర్గీకరించుకొని, ఈ రంగంలో జరిగిన పరిశోధనల్ని సమీక్షించుకునే అవకాశం ఉంది. అలాగే వీటిని ప్రధానంగా విశ్వవిద్యాలయాల్లో వివిధ పట్టాల కోసం జరిగిన పరిశోధనలుగాను, ప్రత్యేక ఆసక్తితో జరిగిన పరిశోధనలుగాను విభజించుకోవచ్చు. ఆంగ్లంలో 'రీసెర్చ్' అనే పదానికి తెలుగులో పునరన్వేషణ, పున: పరిశీలన వంటి అర్థాలున్నప్పటికీ 'పరిశోధన' అనే పదమే నిలిచింది. పరిశోధన అంటే ఏమిటనే విషయంలో అనేక నిర్వచనాలున్నాయి. ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం "*విజ్ఞాన పరిధులను విస్తరింపజేసే యత్నంలో నూతన సత్యాలను, సూత్రాలను, సిద్ధాంతాలను కనుగొనడానికి, శాస్త్రీయపద్ధతులతో క్రమబద్ధంగా చేసే గాఢతరమైన అన్వేషణ, పరిశీలన చేసే విధానాన్ని*" పరిశోధన అంటారని నిర్వచించారు. దీని ఉద్దేశాన్ని వివరిస్తూ " *లక్షించిన ఏ అంశాన్నైనా నిర్ధారించడానికి సోపపత్తికంగా సామగ్రిని సేకరించి వాటిని నిశితంగా పరీక్షించడం, ఒకవేళ ఆ సామగ్రీ ద్వారా పూర్వ ప్రవర్తిత సిద్ధాంతాలను గానీ, సమన్వయాలను గానీ, ఫలితాలను గానీ పనర్ నిర్మించవలసి వచ్చినా, చివరకు ఒక వినూత్నాంశాన్ని ప్రతిపాదించవలసి వచ్చినా సత్యాన్వేషణ దృష్టితో, సమన్వయదృక్పథంతో నిర్మాణాత్మకవైఖరితో, వాస్తవాన్ని వ్యక్తీకరించాలన్న దీక్షతో పరిశోధన లక్ష్యమైన వికాసాన్ని సాధించడమే పరిశోధన*" అని అన్నారు. (జీవియస్ వ్యాసాలు, 1993:2) ఆచార్య ఆర్వీయస్ సుందరం పరిశోధన అంటే ఏమిటో వివరిస్తూ" *సత్యాన్వేషణా తత్పరులై తెలియని విషయాల నన్నింటినీ వెదికి, పరిశీలించి, పరిశోధించి అసలు విషయమిది అని చెప్పబూనటమే పరిశోధన*" అని పేర్కొన్నారు. (పరిశోధన పద్ధతులు, 1990:4) ఇలా పరిశోధన అంటే ఏమిటనే విషయంలో అనేక నిర్వచనాలున్నాయి.

వీటన్నింటిని బట్టి పరిశోధనలో తొలిదశలో సామగ్రిసేకరణ కూడా పరిశోధనే అవుతుంది. దాని తర్వాత దశలో సూత్రీకరణ, సిద్ధాంతం చేసేదీ పరిశోధన అవుతుంది. మరింత ముందుకెళ్ళినప్పుడు సిద్ధాంతాన్ని సమన్వయించడం, సిద్ధాంతాన్ని ఖండించి నూతన సిద్ధాంతాన్ని లేదా నూతన సమన్వయాన్ని చేయడం కూడా పరిశోధనే అవుతుంది. ఇలా వివిధ దశల్లో కొనసాగే పరిశోధనలో కొన్ని సార్లు విమర్శ కూడా అంతర్భూతమౌతుంది. అటువంటప్పుడు పరిశోధన, విమర్శల అవినాభావ సంబంధంతో ఫలితాల ప్రకటన జరుగుతుంది. అది మరింత పరిణితి చెందిన పరిశోధనవుతుంది. పరిశోధన–విమర్శ :విమర్శ రచన ఏకాలానిదైనా దాన్ని కొన్ని మౌలికాంశాలతో సమగ్రంగా పరిశీలించి విలువల నిర్ణయం చేస్తుంది. విమర్శలో విశ్లేషణ, తులనాత్మకత, వ్యాఖ్యానం, నిర్ణయం వంటి మౌలికాంశాలు ఉంటాయి. వివిధ పద్ధతుల్లో విమర్శ ప్రధానంగా గుణదోషపరిశీన చేస్తుంది. కొన్ని విషయాల్లో పరిశోధనకీ, విమర్శకీ అవినాభావ సంబంధం ఉన్నట్లే, సత్యప్రకటన విషయంలో పోలుకలు, భేదాలు కనిపిస్తాయి. అందువల్లనే ఈ రెండూ విడదీయరానంతగా కలిసిపోయాయి. దేశీసాహిత్య పరిశోధనలో కూడా ఈ విమర్శ, పరిశోధనల మమేకత కనిపిస్తుంది. దేశీసాహిత్యం పై పరిశోధన చేసిన వాళ్ళు విమర్శకులుగా, దేశిసాహిత్యంపై విమర్శ చేసిన వాళ్ళు దేశీ పరిశోధకులుగాను ప్రసిద్ధిచెందిన వాళ్ళున్నారు. అందువల్లదేశీసాహిత్యం పరిశోధన కూడా విమర్శ, పరిశోధన సంగమంతోనే ఈ పత్రంలో వివరిస్తున్నాను. మార్గ, దేశి నిర్వచనం: దేశి సాహిత్యంలో మార్గకవిత్వం, దేశీకవిత్వం, నిబద్ధదేశి, అనిబద్ధదేశి, పామరదేశి, జాతిదేశి, జానుతెనుగు, జాణ్ణుడి, వస్తుకవిత మొదలైన కొన్ని పారిభాషిక పదాలు కనిపిస్తాయి. వీటిని వివరించేదిశగానే ఇంచుమించు ప్రతి పరిశోధకుడు ప్రయత్నించాడు. దేశీసాహిత్యం పై జరిగిన పరిశోధనల వివరాలను ముందుగా తెలియజేస్తాను. దేశిసాహిత్యంపై జరిగిన పిహెచ్. డి. పరిశోధనలు:ఆంధ్రసాహిత్యంలో దేశి కవిత్వోద్యమం (1968) జి. ఎన్. రెడ్డిగారి పర్య వేక్షణలో తిమ్మావజ్జల కోదండరామయ్యశ్రీవేంకటేశ్వరవిశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. దాక్షిణాత్య దేశి ఛందోరీతులు తులనాత్మక పరిశీలన (1977) జి. నాగయ్యగారి పర్యవేక్షణలో కె. సర్వోత్తమరావు శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ఇది ప్రచురితమైంది. ఆంధ్రాలంకార సాహిత్య చరిత్ర (1977) కె. గోపాలకృష్ణారావు పర్యవేక్షణలోఎస్. జి. రామానుజాచార్యఉస్మానియా విశ్వ విద్యాలయంలో పరిశోధన చేశారు. పుల్లెల శ్రీరామ చంద్రుడు తెలుగులో అలంకార

సాహిత్య చరిత్ర గ్రంథాన్ని రాశారు. ఇది ప్రస్తుతం అందుబాటులో ఉంది. తెలుగులో అలంకార శాస్త్రవికాసం పేరుతో ఆంధ్ర ప్రతాప రుద్ర యశోభూషణం – కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యలపై తులనాత్మక దృష్టి కోణాన్ని 1992 లో శలాక రఘునాథశర్మగారి పర్యవేక్షణలో వి. బాలిరెడ్డి శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ఇది ప్రచురితమైంది. కావ్యాలంకార సంగ్రహం – లక్షణపరిశీలన (2010) బేతవోలు రామబ్రహ్మం పర్యవేక్షణలో పి. శేషకళ హైదరాబాదు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. సిద్ధాంతం – ఆంధ్రుల వరివస్య (1967) ఎస్. వి. జోగారావు ఆధ్వర్యంలో టి. రాధాకృష్ణమూర్తి ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ఇది ప్రచురితమైంది. ఛందశ్శాస్త్రం అవతరణా వికాసం (1965) కె. వి. ఆర్. నరసింహం పర్యవేక్షణలో ఎం. వి. సత్యనారాయణ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ఇది ప్రచురితమైంది. ఆంధ్రభాషలో యతిప్రాస ఛందోవిశేషములు (1982) సి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పర్యవేక్షణలో నడుపల్లి శ్రీరామరాజు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ఇది ప్రచురితమైంది. తెలుగు కన్నడ ఛందస్సుల తులనాత్మక పరిశీన (1982) కె. సుబ్బరామప్ప పర్యవేక్షణలో బి. భావనారాయణ మైసూరు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. తెలుగు ఛందోవ్యాకరణ సమన్వయ సమాలోచన (1986) యార్లగడ్డ బాలగంగాధరరావు పర్యవేక్షణలో కె. గిరిజాలక్ష్మి నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. తెలుగులో దేశి ఛందస్సు – ప్రారంభ వికాసదశలు (1987)లో పి. యశోదారెడ్డిగారి పర్యవేక్షణలో సంగనభట్ల నరసయ్య ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ఇది ప్రచురితమైంది. తెలుగు ద్విపద రామాయణాల తులనాత్మక పరిశీలన (1979) టి. కోటేశ్వరరావుగారి పర్యవేక్షణలో జె. వెంకట సుబ్బారాయుడు శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ద్విపద భారత కావ్యపరిశీలన (1980) కె.వి.ఆర్. నరసింహంగారి పర్యవేక్షణలో డి. రమణమ్మ ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. *జానపదసాహిత్యం దేశి పరిశోధన:* ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర (1957) గంటి జోగి సోమయాజిగారి పర్యవేక్షణలో ఎన్. వి. జోగారావు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. *ఆంధ్రుల జానపదవిజ్ఞానం* పేరుతో ఆర్. వి. ఎస్. సుందరం డిలిట్ కోసం మైసూరు విశ్వవిద్యాలయానికి సమర్పించారుతెలుగు పల్లెపదాల్లో ప్రజాజీవనం (1974) బిరుదురాజు రామరాజుగారి పర్యవేక్షణలో వై. రఝమన్న ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు.

జానపదసాహిత్యంలో దేశీయవైద్యం (1984) రావిభారతిగారి పర్యవేక్షణలో కె. రవీంద్రమణి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. "తెలుగు చాటువు–సాంఘిక జీవన ప్రతిఫలనం (1994) పి. ఆపదరావుగారి పర్యవేక్షణలో కె. మేరీమణిమాల ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. కావ్యావతారికలు – ఆంధ్రదేశ చరిత్రసామగ్రి (1997) బి. వి. కుటుంబరావుగారి పర్యవేక్షణలో ఎం. దీనాదేవి ఉస్మానియా విశ్వ విద్యాలయంలో పరిశోధన చేశారు. తెలుగువారి ఇంటిపేర్లు (1984) తూమాటి దొణప్పగారి పర్యవేక్షణలో తేళ్ళ సత్యవతి నాగార్జునవిశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ఆధునిక తెలుగుసాహిత్య విమర్శ–సాంప్రదాయికరీతి (1978) కె. వి. రామకోటిశాస్త్రిగారి పర్యవేక్షణలో కోవెల సంపత్కుమారాచార్య కాకతీయ విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. తెలుగు కావ్యావతారికల్లో సాహిత్యవిమర్శ (1984) ఐ. కృష్ణమూర్తిగారి పర్యవేక్షణలో సి. హెచ్. సీతాలక్ష్మి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ద్విపదవాఙ్మయం (1966)పై పింగళి లక్ష్మీకాంతంగారి పర్యవేక్షణలో జి. నాగయ్య శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోను, ద్విపదవాఙ్మయం (1968) పైనే కొత్తపల్లి వీరభద్రరావుగారి పర్యవేక్షణలో టి. సుశీల ఢిల్లీవిశ్వవిద్యాలయంలో పరిశోధనలు చేశారు. తెలుగులో భక్తికవిత్వం– సామాజికవిశ్లేషణ (1994) కె. కె. రంగనాథాచార్యులుగారి పర్యవేక్షణలో పిల్లలమర్రి రాములు హైదరాబాదు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. దేశిసాహిత్యంపై జరిగిన ఎం. ఫిల్. , పరిశోధనలు:శుకసప్తతి దేశీయతా చిత్రణ (1979) ఆర్. చంద్రశేఖరరెడ్డిగారి పర్యవేక్షణలో సి. వెంకటరామిరెడ్డి ఎం. ఫిల్. కోసం శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. యతిప్రాసల పెరుగుదలలో సంస్కృతాంధ్ర వ్యాకరణాల పాత్ర (2010) ఆర్. వి. రామకృష్ణశాస్త్రి పర్యవేక్షణలో ఇ. శ్రీనివాస్ హైదరాబాదు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. తెలుగులో ముత్యాలసరం ఛందస్సు – ప్రయోగ పరిశీలన (2010) నడుపల్లి శ్రీరామరాజు పర్యవేక్షణలో రేచర్ల శ్రీలక్ష్మి పరిశోధన చేశారు. సంస్కృత కవితను 'మార్గ' అనీ, దేశ భాషల్లోని కవితను 'దేశి'అని వేదం వెంకటరాయశాస్త్రి, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి మొదలైన పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. (జి. నాగయ్య, పుట:117) కేవలం ఇతివృత్తం, భాష, ఛందోలంకారాది లక్షణాల్నే కాకుండా, రచయిత దృక్పథాన్ని, అతడు అనుసరించిన పాఠకలోకంలోని జాతీయజీవిత విలక్షణాల్ని కూడా ఆశ్రయించుకుని

ఉంటుందని దేశిసాహిత్యంపై పరిశోధన చేసిన జి. నాగయ్య (2009:119) వివరించారు. తెలుగులో కుమారసంభవంలో మార్గ, దేశి పదాల్ని కవిత్వపరంగా మొట్టమొదటిసారిగా ప్రయోగించన కవిగా నన్నెచోడుడు (క్రీ. శ. 1130) అని పరిశోధకులు భావిస్తున్నారు. అయితే వీటిని కన్నడ కవుల కవితా సంప్రదాయం నుండి స్వీకరించి ఉంటాడని నాగయ్య అభిప్రాయం. జి. నాగయ్య 'సంస్కృత భాషాసాహిత్య లక్షణ ప్రభావాన్ని భాసింపజేయుచు, ఉభయభాషా పండితులకు ఉ ద్దేశింపబడి వారి ఆదరాభిమానాల్ని అనివార్యంగా అపేక్షించే ప్రౌఢ కవిత 'మార్గ' కవిత అంటార'నీ; 'ప్రత్యక్ష సంస్కృత ప్రభావాన్ని ప్రతిబింబింపజేయని కథావస్తువు, వర్ణనలు, భావం, భాష, రీతులు, అలంకారాలు, కవిసమయాలు, ఛందస్సు, సాహిత్యప్రక్రియలు మొదలైన వాటిలో దేశీలక్షణాల్ని ఆరోపించుకుని దేశీయ ప్రజాజీవనానికి సన్నిహితంగా జనసామాన్యవ్యాప్తి కోసం ఉద్దేశించిన ప్రజాకవిత 'దేశి' కవిత అని నిర్వచించవచ్చు'నని అన్నారు. వీటిలో మళ్లీ మార్గ, దేశీల్లో కూడా నిబద్ధ, అనిబద్ధ భేదాలున్నాయని వాటిని సోదాహరణంగా వివరించారు. ప్రతి భాషలోను మొదట దేశీకవిత్వం వెలువడుతుంది. ఆ తర్వాతనే మార్గకవిత్వం వ్యాప్తిలోకి వస్తుంది. దీనివల్ల క్రమేపీ దేశీకవిత్వం సంస్కృత సాహిత్య లక్షణాల్ని అనుసరించిన దాన్ని 'నిబద్ధదేశి'గా పిలవవచ్చు. వీటన్నింటి ప్రభావాల్నీ తట్టుకొని దేశీయఛందస్సుల్లో, దేశీయసంప్రదాయాల ఆధారంగానే కొనసాగేది 'అనిబద్ధదేశి' అని అనొచ్చు. ఈ అనిబద్ధదేశి సామాన్యప్రజల్లో వ్యాప్తిలో ఉంటుంది. అనిబద్ధదేశిని కూడా పామరదేశి, జాతిదేశి అని విమర్శకులు విభజించారని నాగయ్య వివరించారు. పల్లెపాటు, వీరగాథలు వంటివన్నీ చదువు, సంధ్యలు లేని వారిలో వ్యాప్తిలో ఉండటం వల్ల వాటిని పామరదేశి అనీ, నాగరిక వర్ణనల్తో బాలబాలికలు, స్త్రీలకు సంబంధించిన వాటిని 'జాతిదేశి' అని నాగయ్య వివరించారు. మార్గ, దేశిలను సంగీతాన్ని ఆధారంగా చేసుకొని పింగళి లక్ష్మీకాంతం వివరించే ప్రయత్నం చేశారు. *"సంగీతానికి శాస్త్ర నిబద్ధతవల్ల మార్గ ఏర్పడుతుందనీ, నియమరహితమై శాస్త్రమునకెక్కని కేవల ప్రజారంజనమునకై రచింపబడినది దేశీ కవిత"* అని అన్నారు. (*గౌతమవ్యాసములు*, 40) దేశి శబ్దానికి వాఙ్మయంలో ఇతివృత్తం, భాష, ఛందస్సు అనే మూడు లక్షణాలు ఉంటాయనీ దేశి శబ్దాన్ని అన్నింటా సార్థకం చేసిన కావ్యాల్లో పలనాటి వీరచరిత్ర మొదటిదీ, మేటిదీ అని నిర్ణయించారు. నన్నయకు పూర్వం నుండీ కొనసాగిన దేశికవిత్వం:నన్నయకు పూర్వం గేయకవిత్వం ఉండేదనీ, అదంతా

దేశీయకవిత్వమేననీ, దీనికి హాలుడు (క్రీ. శ. 1వశతాబ్ది) సంకలనం చేసిన 'గాథాసప్తశతి'లో కనిపించే పాటల్ని సాక్ష్యాలుగా పరిశోధకులు సూచిస్తున్నారు. నన్నయ(క్రీ. శ. 1053) తన కాలంలో వ్యాప్తిలో ఉన్న నాగీగీతాల్ని పేర్కొనడం, నన్నెచోడుడు ఊయలపాటలు, గౌడుగీతాలు మొదలైన వాటిని ప్రస్తావించడం, పాల్కురికి సోమన (క్రీ. శ1160-1240) పండితారాధ్య చరిత్రలో పండితుని శిష్యులు తుమ్మెదపదాలు, నివాళిపదాలు, వాలేశుపదాలు, గొబ్బెపదాలు పాడుకొంటూ వెలనాటిచోడు సభకివెళ్ళారని వర్ణించడం వంటివన్నీ నన్నయకు ముందున్న పదగేయరూపమైన దేశికవిత్వం ఉందనడానికి ఆధారంగా పరిశోధకులు సూచిస్తున్నారు. తెలుగు సాహిత్య చరిత్ర రాసిన ప్రతివాళ్ళు దేశీకవిత్వం గురించి ప్రస్తావించారు. పాల్కురికిసోమన దేశీయమైన భాషాచ్ఛందోరీతుల్లో రచనలు చేశాడు. గోనబుద్ధారెడ్డి (క్రీ. శ. 1260) *రంగనాథరామాయణం*లో నన్నయ మార్గాన్నే పాటించినా, తేటతెనుగు పలుకుబళ్ళు ప్రయోగించడంలోను, ద్విపదఛందస్సులో రాయడంలోను దేశీయవిధానాన్ని అనుసరించాడు. ఊర్మిళాదేవినిద్ర, లక్ష్మణ దేవరనవ్వు వంటి జానపదగేయ కథల్ని తీసుకొని మార్గ-దేశి సంప్రదాయాల జోడింపుగా రామాయణాన్ని వర్ణించాడని పరిశోధకులు (నాగయ్య, 123) వ్యాఖ్యానించారు. ఇలా... తిక్కన, కృష్ణమాచార్యులు, శ్రీనాథుడు *(పల్నాటి వీరచరిత్ర)*, తాళ్ళపాకవులు, కందుకూరి రుద్రకవి మొదలైనవారందరి రచనల్లోను దేశీయకవిత్వం కొనసాగిందని పరిశోధకులు నిరూపించారు. దక్షిణాంధ్రకవిత్వంలో పండితాదరణతో పాటు, రాజాదరణ కూడా లభించిందని అందుకనే యక్షగానాలు అత్యధికంగా వెలువడ్డాయని వ్యాఖ్యానించారు. తర్వాత క్షేత్రయ్య కృతుల్లో కూడా దేశీయత వెల్లివిరిసిందని చెప్పారు. ముఖ్యంగా పాలవేకరి కదిరీపతి *'శుకసప్తతి'*లోను, అయ్యలరాజు నారాయణామాత్యుని *'హంసవింశతి'*లోను దేశీకథలు మార్గపద్ధతిలో వర్ణించారని పరిశోధకులు వివరించారు. ఇటువంటి వాటినే 'నిబద్ధదేశి' రచనలుగా పిలవవచ్చు. ఆధునిక కాలంలో గురజాడ రచనల్లో ఇది పతాకస్థాయినందుకొందని వస్తువులో, భావంలో అత్యున్నతస్థితికి చేరిందని పరిశోధకులు వివరించారు. ఈ పరిశోధనల సారాంశాన్ని నాగయ్య తన 'తెలుగు సాహిత్య సమీక్ష'లో అందించారు. జానుతెనుగు :తెలుగులో జానుతెనుగు, వస్తుకవిత అనే పదాల్ని తొలిసారిగా నన్నెచోడుడే పేర్కొన్నాడని పరిశోధకులు వివరించారు. డా॥చిలుకూరి నారాయణరావు జానుతెనుగులో జాను అనేది చదును శబ్దానికి రూపాంతరమని, చదును చదురుకి

రూపాంతరం అనీ చెప్పి, దీన్ని చతుర శబ్దభవం జానుతెనుగు లేదా చదునైన తెలుగు అని వివరించారు. అంటే లోకవ్యవహారంలో ఉన్న సర్వజన సుబోధకమైన తెలుగుగా '*పండితారాధ్యచరిత్ర*'కు రాసిన పీఠికలో పేర్కొన్నారు. లోకవ్యవహారంలో ఉన్న సంస్కృతాంధ్రపదాలతో కూడినతెలుగుగా చెప్పారు. (నాగయ్య, 2009:128) డా॥ చిలుకూరి నారాయణరావు వాదనతో శ్రీపాద లక్ష్మీపతి ఏకీభవించకుండా పాల్కురికిసోమనాథుని "బలుపొడ తోలు సీరయును..." పద్యాన్ని ఆధారంగా చూపి, *దీనిలో ఉన్నవన్నీ శుద్ధాంధ్ర పదాలే అనీ, అందువల్ల జానుతెనుగు అంటే అచ్చతెనుగు* అని చెప్పారు. బహుజనపల్లి సీతారామాచార్యులు జాను శబ్దం దేశ్యం అన్నారు. నేలటూరి వేంకటరమణయ్య జాను శబ్దం జ్ఞాన శబ్ద భవమనీ, జాణకు తోబుట్టువనీ అన్నారు. (జాను తెనుగు, *వాఙ్మయ వ్యాస మంజరి*: 1967: 362) సి. నారాయణరెడ్డి జాను శబ్దానికి అందం, సౌందర్యం అని శబ్దరత్నాకరంలోని అర్థాల్ని వివరించి, జానుతెనుగు అంటే అందమైన తెనుగు అనీ, ఇంపైన తెనుగు అనీ అన్నారు. దేశి శబ్దాలను, జనవ్యవహారంలో నలిగిపోయిన సంస్కృతశబ్దభవాల్నీ సముచిత ప్రమాణంలో మేళవించినప్పుడే తెనుగుకి జానుతనం సిద్ధిస్తుందని అన్నారు. నిఘంటువుల్ని మాత్రమే ఆశ్రయించి బతికే పదాల్ని ప్రయోగిస్తే ప్రజలకు అవి బోధపడవు. *జనమండలికి సన్నిహితాలైన సుందర సంస్కృతాంధ్ర శబ్దాలను ఏర్చి కూర్చిన రచనారీతి జానుతెనుగు* అని నిర్ధారించవచ్చునని (1989:105 తొలిముద్రణ, 1967) వివరించారు. పింగళి లక్ష్మీకాంతం *జాను తెనుగు అంటే సరళమైన తెలుగు అనీ సర్వసామాన్యమైన* భాష *జాను తెలుగు అనీ, సర్వులు అంటే ఆబాల గోపాల ప్రజలు అని అర్థం కాదనీ వివరించారు. కొద్దోగొప్పో భాషాజ్ఞానం కలిగి, పాండిత్యం లేకపోయినా, ఇతరుల సహాయం తీసుకోకుండానే చదివి అర్థం చేసుకోగలిగిన అక్షరాస్యులని పాల్కురికి సోమనాథుని ఉద్దేశ్యమని* వ్యాఖ్యానించారు. (పుట 80)వస్తుకవిత:నన్నెచోడుడు తనది వస్తుకవిత అన్నాడు. వాల్మీకిని వస్తుకావ్యాబ్జరవి అని కుమారసంభవ కావ్యాన్ని గూఢమయ వస్తు కావ్యమని పేర్కొన్నాడు. ఇవన్నీ కుమార సంభవం కావ్యావతారికలో ఉన్నాయి. దీన్ని కన్నడ సాహిత్యాన్ని ఆధారంగా చేసుకొని గడియారం రామకృష్ణశర్మ వస్తుకమంటే సంస్కృత చంపూ లక్షణాల్ని అనుసరించి రాయబడిన గద్య పద్యాత్మక కావ్యం' అని (పాల్కురికి సోమనాథుడు-చైతన్యలహరి, 120-121) వివరించాడు వస్తుకవిత విస్తర కవితలో అంతర్భాగం కావచ్చునని తిమ్మావజ్ఝల కోదండరామయ్య (కవిరాజశిఖామణి, 55)

భావించారు. భారత భాగవతాది పురాణాల్లా భిన్న వస్తు ప్రతిపాదకం కాకుండా, ఏక వస్తు ప్రతిపాదికమై, కథావస్తు ప్రాధాన్యంతో రాయడం చేత కుమారసంభవం వస్తుకావ్యమనీ, అతనిది వస్తుకవిత అని చెప్పవచ్చు అని తిమ్మావజ్ఝల వారభిప్రాయం. వర్ణనాత్మకమైన ఫణితియే వస్తుకవిత్వం అయిఉంటుందని ఖండవల్లి లక్ష్మీరంజనం 'ఆంధ్రసాహిత్య చరిత్రసంగ్రహం' (పుట: 35) లో పేర్కొన్నారు. కోరాడ రామకృష్ణయ్య కుమారసంభవం పీఠికలో 'భావప్రధానమయిన దానికి భిన్నమై వస్తుప్రాధాన్యాన్ని కలిగి వర్ణనీయ వస్తువుని గురించి చమత్కార (పుట: 194) వర్ణనలతో కూడిన కవిత' అని వివరించారు. అమరేశ్వరం రాజేశ్వరశర్మ వస్తుకవిత అంటే సహజకవిత, నిసర్గకవిత అని చెప్పి, ప్రకృతిని గురించి వర్ణించే కవిత అన్నారు (నన్నెచోడుని కవిత్వం, పుట:17, 19) పేర్కొన్నారు. వస్తుకవిత అంటే ప్రబంధకవితే తప్ప ఇతర కవిత్వమేమీ కాదని వేదం వేంకటరాయశాస్త్రి చెప్పారు. సి. నారాయణరెడ్డి 'ఒక విధంగా ఊహిస్తే వస్తుకావ్యం అంటే ప్రబంధ కావ్యమే' అని అన్నారు. పింగళి లక్ష్మీకాంతం కావ్యంలో ప్రధాన కథకు గుణాలంకార వర్ణనాదులతో రసవంతం చేయటమే కాకుండా తదవయవ స్థానీయాలైన ఇతర కథాంశాల్ని కూడా ఆ విధంగానే పరిశోషించి రసవంతం చేయటమే వస్తుకవిత్వం' అని వివరించారు. జి. నాగయ్య నన్నెచోడుని వస్తుకవిత మృదుల సూక్తులు, మేలిభావాలు, మిటిమిట్లు గొలిపే మెరుగులు, మనోహరకాంతులతో వర్ణనలకెక్కు వర్ణనలు, తళుకొత్తె రసములు, దేశీమార్గాల్ని దేశీయాలుగా, అలంకరించే అలంకారాలు కలిగి, పండితులు మెచ్చేటట్లుగా అష్టాదశవర్ణనలతో ఉండేదని (పుట:136) చెప్పారు. జి. వి. సుబ్రహ్మణ్యం "మార్గ, దేశి, జానుతెనుగు, వస్తుకవిత మొదలైన పారిభాషిక పదాలకు స్పష్టమైన నిర్వచనాలు మనకిప్పటికీ లేవు" అని సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు, 1991:27) అని అన్నారు. సారాంశంలో వస్తుకవిత అంటే అష్టాదశ వర్ణనలతో కూడి దేశీయమైన ఇతివృత్తంతో విలసిల్లుతూ పండితపామర జనరంజకంగా ఉండే కవిత్వంగా అర్థం చేసుకునేవీలుంది. తెలుగు భాషా, సాహిత్యాల్లో 'దేశి' గురించి విశ్వవిద్యాలయాల్లో వివిధ పట్టాలకోసం కొంతమంది పరిశోధన చేస్తే, మరికొంతమంది ఆ అంశాల్ని తెలుసుకోవాలనే ఆసక్తితో అన్వేషించేదిశగా వైయక్తికాభిరుచులతో పరిశోధన చేశారు. తెలుగుభాష చారిత్రికతనీ, ఆ రచనల్లో వెలువడిన దేశీయరచనా శక్తిసామర్థ్యాల్ని వెల్లడించే దిశగా ఈ పరిశోధనలు కొనసాగాయి. దేశీయమైన భాషలో రచనలు కొనసాగినా తర్వాత మార్గ కవిత్వ

ప్రభావం భాషా, సాహిత్యాల్లో విస్తృతమైందనీ, అయినప్పటికీ దేశి సాహిత్యం తన అస్తిత్వాన్ని నిలుపుకొనేప్రయత్నం జరుగుతునే ఉందని పరిశోధన ఫలితాల సారాంశంగా కనిపిస్తుంది. వీటిని స్పష్టంగా గుర్తించాలంటే, భాషా, వ్యాకరణం, ఛందస్సు, వస్తువులను ఆధారంగా వింగడించుకొని దేశిసాహిత్యాన్ని పరిశీలించాల్సి ఉంటుందిదేశిసాహిత్యం క్రీ.శ. 12, 13 శతాబ్దాల్లో వచ్చిన నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు మొదలైన శివకవుల సాహిత్య కేంద్రంగా ఈ పరిశోధనలు జరిగాయి. ఈ శతాబ్దాలతో పాటు దక్షిణాంధ్రయుగంలో కూడా దేశిసాహిత్యం విస్తృతంగా రావడానికి గల కారణాల్ని అన్వేషించే దిశగా కొనసాగింది. దీనితోపాటు జానపదసాహిత్యాన్ని కూడా ఈ దృష్టితో అధ్యయనం చేయాల్సి ఉంటుందని దేశీపరిశోధనల తీరు తెన్నుల పరిశీలన వల్ల తెలుస్తుంది. తెలుగు కావ్యావతారికల్ని ఆధారంగా చరిత్రపరిశోధన కూడా జరిగింది. అలాగే కావ్యావతారికల్లో ఉన్న విమర్శనాంశాల్ని మరికొంతమంది పరిశోధన చేసి దేశీయమైన విమర్శసూత్రాల్ని నిర్మించే ప్రయత్నం జరిగింది. విమర్శలో జానపద సాహిత్య విమర్శ అనే ఒక విభాగం కూడా వచ్చింది. అది తెలుగు కవుల జీవిత చరిత్రల్ని ఆధారంగా చేసుకొని వచ్చింది. మొత్తం మీద దేశి సాహిత్య పరిశోధన అంతా ఇంచుమించు పాల్కురికి సోమనాథునిరచనలనే కేంద్రీకరించుకుని కొనసాగినా, తర్వాత కాలంలో అది వివిధ సాహిత్య ప్రక్రియల్లో అంతర్లీనంగా ప్రవహించిందో కూడా వివరించేదిశగా కొనసాగింది.

***(తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం వారు 13-14 సెప్టెంబరు 2012లో నిర్వహించిన జాతీయ సదస్సులో సమర్పించిన పత్రసారాంశం)***

# కళ–అనుకరణ

ప్లాటో ఆదర్శరాజ్యభావనకు కవుల అనుకరణ దోహదపడకపోగా, ఊహాప్రపంచంలో జీవించేటట్లు చేస్తుందని, నీతిని బోధించని కావ్యాలను రాసే వారిని ఆదరించాల్సిన పనిలేదన్నాడు. అంటే ప్లాటో కావ్యానికీ నీతికి అవినాభావసంబంధంతో అనుకరణను చూశాడు. దాన్నీ ఆధ్యాత్మిక జగత్తుతోనే చూశాడు. ఈ చరాచర జగత్తు అంతా భగవన్నిర్మితమనీ, దానికి అనుకరణరూపమే ప్రకృతిగా భావించాలంటాడు. ప్రకృతిలో ఏదీ శాశ్వతం కాదు. ఆ ప్రకృతిని అనుకరించే కవి కావ్యం కూడా సత్యం కాదంటాడు. మనం చూసే భౌతిక జగత్తు ఆధ్యాత్మిక జగత్తుకి ప్రతిరూపం. ఇది శాశ్వతం కాదు. కాబట్టి ఇది మిథ్య. అసత్యం. అందుకనే లోకంలో తాను చూసిందొకటైతే, చెప్పాలనుకున్నది మరొకటైతే, బయటకొచ్చేది ఇంకొకటి అవుతుంది. కవి తాను చూసినదాన్ని చూసినట్లే రాయడు. రాస్తే బాగుండదు. బాగుండాలని, దానికి తన నైపుణ్యాన్ని చేరుస్తాడు. అంటే మరోరూపంలో చెప్తున్నాడు. ఒక సత్యం మరో సత్యంగా మారిపోయింది. అసలైన సత్యం ఆధ్యాత్మిక సత్యమైతే, ఇప్పుడు పాఠకులకు అందిన సత్యం రెండింతల దూరంలోనే ఉన్నట్లనేది ప్లాటో భావన.

ప్లాటో ఆధ్యాత్మిక ఆదర్శవాది. దైవం పట్ల నమ్మకమున్నవాడు. నిజమైన కవిత్వం దైవావేశంతో వెలువడాలంటాడు. అప్పుడే కావ్యం సత్యవంతమై పౌరుణ్ని ఆదర్శరాజ్యం వైపు నడిపించగలుగుతుంది. అలా కానప్పుడు మాటల గారడీలతో కవులు తాము వర్ణించేదే సత్యమనే భ్రాంతిని కలిగించే ప్రయత్నం జరుగుతుందంటాడు. అందువల్ల ప్లేటో చెప్పిన అనుకరణ కవుల్ని నిరాదరించేలా ఉన్నా, పరోక్షంగా ఆధ్యాత్మిక సత్యం పేరుతో ముందుకొచ్చే కవుల్ని ఒక మెట్టు పైనే ఉంచుతుంది. సామాజికంగా కనిపించే భౌతిక వాస్తవికత కంటే, కనిపించనిదేదో అన్వేషించే దిశగా అనుకరణ సిద్ధాంతం

వెళ్ళిపోయింది! దీన్ని ప్లాటో తర్వాత వచ్చిన అరిస్టాటిల్ తదితరులు నీతికీ, కావ్యానికీ మధ్య వ్యత్యాసాన్ని చూపిస్తూ అనుకరణను వివరించారు. వాటిని మన తెలుగు కవుల భావాలతో సమన్వయించుకుంటే ఎలా ఉంటుందో చూద్దాం. 1977లో ఒక నల్లజాతీయుడు తొలిసారిగా డిగ్రీ పట్టాను తీసుకున్నాడు. అది అమెరికాలోని మిసిసిపి విశ్వవిద్యాలయంలో జరిగింది. ఆ డిగ్రీ తీసుకున్న అతని పేరు జేమ్స్ మెరిడిట్. అంతకు ముందు తెల్లజాతి వాళ్ళకూ నల్ల జాతి వాళ్ళకూ మధ్య ఎన్నో యేండ్లుగా జాతివివక్ష గురించి పోరాటాలు జరిగాయి. అబ్రహాం లింకన్ హత్యకు గురికావడంలోనూ జాత్యహంకారమే ప్రధాన పాత్ర వహించిందని చరిత్ర చెప్తుంది. అటువంటి జాతివివక్షను ఎదుర్కొన్న వాళ్ళు తెల్లవాళ్ళతో సమానంగా చదువుకుని డిగ్రీ సాధించడమంటే మాటలా? ఇది తెలిసిన కవి దాశరథి ఒక పద్యాన్నిలా రాశాడు.

***'నల్లనివాడ, జ్ఞాననయనమ్ముల వాడ! మనస్సులోపలన్***
***తెల్లని వాడ, హింసను వధించిన నల్లనివాడ! శాంతిపై***
***జల్లినవాడ, తెల్లని విషమ్మునకు విరుగైనవాడ! నా***
***ఉల్లములోనివాడ! పదవోయి విశాల విభాపథాలపై"***

దీన్ని చదివిన చాలా మంది పాఠకులకి వెంటనే కృష్ణుణ్ని వర్ణించిన పోతన పద్యం గుర్తుకొస్తుంది కదూ! ఆ పద్యం ఇది:

***"నల్లనివాడు, పద్మనయనమ్ముల వాడు, కృపారసంబు పై***
***జల్లెడు వాడు, మౌళి పరిసర్పిత పింఛమువాడు, నవ్వు రా***
***జిల్లెడు మోము వాడొకడు చెల్వల మానధనంబు దెచ్చెనో***
***మల్లియలార! మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే!'***

అందరికీ కనిపించే వాస్తవాన్ని ఒకరు కవిత్వీకరించగా, మరొకరు కొందరికి మాత్రమే కనిపించే అనుభవాన్ని వర్ణించారు. రెండింటిలోను జీవిత సత్యం ఉంది. రెండింటిలోనూ సత్యం అక్షరరూపంలో అభివ్యక్తికరించి ప్రయత్నం చేశారు. ఇంకా చెప్పాలంటే ఇక్కడ రెండు రకాల జీవితాల్ని అనుకరించడం కన్పిస్తుంది. అయితే ఇది నిజంగా సత్యమేనా?తరతరాలుగా బానిస జీవితం జీవించిన వాళ్ళు, జాతివివక్షను ఎదుర్కొన్న వాళ్ళు ప్రధాన జీవన స్రవంతిలో కలవడానికి చేసే ప్రయత్నంలో సాధించిన సందర్భం నిజంగా ఆ జాతి మహానందానికి కారణమై వుంటుంది. అలాంటిదే భారతదేశంలో ఒక దళితుడో రాష్ట్రపతిగా, స్పీకర్‌గా పదవిని అధిష్ఠించినప్పుడూ ప్రధానంగా ఆ జాతిప్రజలు ఆనందపడ్డారు. అలాంటి ఒక సామూహిక జీవిత

వాస్తవాన్ని అనుభవీకరించుకుని కళాత్మక సత్యంగా మారుస్తున్నాడు కవి! ఇప్పుడు ఆ అనుభవం ఎవరిది! కవిదా? అలా భావించి ఉండొచ్చనుకునే వాళ్ళదా? ఏది సత్యం?

మరో రకం కవి భౌతిక జీవనానంతరాన్ని దర్శించే ప్రయత్నంలో తాను పొందిన అనుభవాన్ని ఆవిష్కరిస్తున్నాడన్నాము. నిజంగా అది కవికి 'కనిపించిన' రూపానికి కళాత్మక ఆవిష్కరణేనా? అంటే ఇది కూడా సత్యమవుతుందా? అనేది చర్చనీయాంశంగానే మారిపోమంది. దాశరథి రాసిన పద్యం ఒకజాతి జీవితానికి అనుకరణని చెప్పొచ్చా లేక పోతన పద్యానికి పేరడీ అనుకోవచ్చా అనేదీ కొంతమందిలో సందేహం రావచ్చు. పేరడీ సాహిత్యంపై కృషి చేసిన ఆచార్య వెలుదండ నిత్యానందరావు దీన్ని పేరడీ కాదన్నారు. పేరడీని తెలుగులో వికటకవిత్వం అనొచ్చని2 మన సాహిత్యకారులు అంటున్నా, దానిని సరిగ్గా సరిపోదని రెండూ వేర్వేరనీ వాటి లోతుల్ని చూసేవాళ్ళకనిపిస్తుంది. పేరడీలో హితవు, సామాజిక హితం ఉన్నా, వాటికంటే అధిక్షేపం, హాస్యచతురతా ప్రాధాన్యాన్ని పొందుతాయి. అనుకరణ బాహ్యరూపంగా కనిపించినా అంత: తత్వం జీవితాన్ని అనుకరించడం కంటే, హాస్యాన్ని కురిపించడమే లక్ష్యమవుతుంది. వీటి మధ్య జీవితమూలాల్ని అన్వేషించడంలో వ్యత్యాసం ఉంటుంది. ఒక పేరడిని చూద్దాం. శ్రీశ్రీ రాసిన మహాప్రస్థానం గీతాన్ని " మరోపిశాచం" పేరుతో కమలాకరంఅనేకవి పేరడీగా రాశాడు.

***"మరో కంచం***
***మరో లంచం***
***మరో మంచం పిలిచిందీ***
***పదండి విందుకు***
***పదండి కాసుకు***
***పోదాం పోదాం పదవుల్లోకి***
***కాళ్ళు మొక్కుతూ***
***కథల్ చెప్పుతూ పదవి కోసం సిగ్గువిడుస్తూ***
***ఎత్తు లేద్దాం***
***చిత్తు చేద్దాం***
***కనపడలేదా***
***తరతరాల పదవీ పిశాచం"***

దీనిలో కవి మౌలికత- శ్రీశ్రీ కవితను అనుకరించడంలోనే ఎక్కువగా కనిపిస్తుంది. అంతర్భాగంగా నేటి రాజకీయ వికృత చేష్టల్ని తూర్పారబట్టడమూ ఉంది. కానీ, ఈ ఖండిక అప్పటికే బాగా ప్రాచుర్యంలోకి రావడం వల్ల దాన్ని హాస్యభరితంగా చెప్పడానికి ఉపయోగపడింది. హాస్యం పాలెక్కువయ్యేసరికి కవి అంతర్గతంగా చెప్పిన 'సత్యం'లోని సీరియెస్‌నెస్ తగ్గిపోతుంది. ఇది కూడా అనుకరణలాగే కనిపిస్తుంది.

ఆ మధ్య కాలంలో దళితసాహిత్యం ఉద్ధ ృతంగా వస్తున్న రోజుల్లో *'చిక్కనవుతున్నపాట'* (1995) ని అనుకరిస్తూ, దానిలోని వాదాన్ని తిప్పికొట్టేప్రయత్నంలో *'పాటచిక్కబడ్తుందా?'* (1996) పేరుతో ఒక కవితా సంకలనం వచ్చింది. రెండూ రెండుకోణాల్లో జీవిత వాస్తవాల్ని చూశారు. ఇంకా చెప్పాలంటే సమాంతరంగా కొనసాగుతున్న రెండు జీవనవిధానాల్ని అనుకరించారు. ఈ అనుకరించడంలో మొదటిదానిలో జీవనానుభవ వేదన ఉంది. జీవితం విధ్వంసమైన వ్యథార్థకథనాల బీభత్సముంది. కవిత్వంలోకి జీవితం అనుకరించబడింది. రెండవదాంట్లోనూ జీవనవ్యథ ఉన్నా మొదటి దానిలోని వ్యథలాంటిది కాదు. అందుకే రెండవదీ అనుకరణగానే వెలువడినా మౌలికంగా నిలవలేకపోయింది. ఒక జీవితాన్ని గానీ, ఒక వ్యవస్థని గానీ అనుకరించి కవిత్వీకరించేటప్పుడు అది భౌతిక వాస్తవమే అయినా, ఇంద్రియవాస్తవమై కళాత్మక సత్యమవుతుంది. 1977న దివిసీమలో వచ్చిన తుఫాను బీభత్సం, తదనంతర పరిస్థితులు చూసిన కవి నగ్నముని తన ధర్మాగ్రహాన్ని కవిత్వరూపంలో ప్రకటించాడు. అదే "కొయ్యగుర్రం" దీర్ఘకావ్యమైంది. అది ఆనాటి సామాజికజీవనాన్ని అనుకరించడమే. ఆ అనుకరణ కవిత్వమై భౌతికవాస్తవాల్ని ఇంద్రియానుభవంతో సత్యంగా మార్చగలిగాడు.

***"కొయ్యగుర్రం భూమ్మీద నడవదు***
***ఇనప నాడాల్తో చెక్క హృదయంతో ధనమదంతో***
***'అలగాజనం' బుజాలమీద స్వారీ చేస్తుంది***
***బరువుకి కుంగిపోతూ తలెత్తితే***
***భీషణంగా సకిలించి అణగదొక్కుతుంది"***

ఇక్కడ సత్యం ప్రతీకాత్మకంగా వెలువడింది. ప్రకృతి విలయతాండవానికి సరైనరీతిలో స్పందించని పాలనా విధానాన్ని దుయ్యబడుతూ, కదులూ మెదులూ లేని " కొయ్యగుర్రాన్ని" కాల్చిపారేసే ప్రత్నామ్నాయ వ్యవస్థ కోసం ప్రయత్నించాలనే

కర్తవ్యాన్ని ప్రబోధిస్తున్నాడు కవి. ఇది నాటి తుఫాను బీభత్సాన్ని మాత్రమే అనుకరించలేదు. అలాంటి విపత్కరపరిస్థితులచ్చినప్పుడు ఆ కావ్య సత్యం పాటకున్ని మళ్ళీ మళ్ళీ ప్రేరణ కలిగిస్తుంది. కావ్యసత్యం త్రికాలాలకు సంబంధించినదవుతూనే జీవనమూలాల్ని తడమగలుగుతుంది. అందుకనే ప్లేటో కంటే అరిస్టాటిల్ అనుకరణ సిద్ధాంతం భిన్నంగా రూపొందింది. ప్రకృతి అందంగాఉంటుంది. దాని కంటే కళ మరింత అందంగా ఉంటుందరించడు. దీన్ని బట్టి ప్రకృతి కొంత మార్పులు చేర్పులకు గురైందన్నమాట.

అనుకరణకు గురైన ప్రకృతే కళాకారుని హృదయంలో మరోరూపు దిద్దుకుని, అనుగుణమైన సత్యంగా వ్యక్తమవుతుందన్నమాట. ఇక్కడ ఆధ్యాత్మిక సత్యం కంటే ప్రకృతి అనుకరణే జీవిత సత్యంగా మారుతుంది. కనిపించే ప్రకృతి నుండే మానవుడు కళాత్మకతను అలవర్చుకుంటూ, దాన్ని అధిగమించి కళకు ఉన్నతత్వాన్ని కలిగిస్తున్నాడని చెప్పడం ద్వారా అనుకరణకు అరిస్టాటిల్ ప్రాధాన్యతనిస్తున్నాడని తెలుస్తుంది. ఆ అనుకరణ నుండే మానవుడిలో ఉండే విషాదం క్షాళితమయ్యే కెథార్సిస్ ప్రతిపాదించాడు. విషాదాంతరూపకాన్ని చూపినప్పుడు ప్రేక్షకుడు ఏడ్వడం ద్వారా తనలో ఉన్న దు:ఖం బయటకి పోయి మనసంతా స్వచ్ఛంగా మారిపోతుందంటాడు. దీనికి మానవుడిలో ఉండే ఏదో ఒక చిన్న లోపం విషాదాంతానికి కారణమవుతుందనేది గుర్తించాలంటాడు. మానవజీవితానుకరణమే విషాదాంత రూపకాల్లో ఉంటుందనేది ఈ ఆలోచనల్లోనుండి వచ్చిందే. కానీ, ఈ భావనల్ని భారతీయులు ఆదరించలేకపోయారు. "మంగళా దీన, మంగళ మధ్యాని, మంగళాంతాని కావ్యాని... . "గానే భావించారు. నాటకం చూడ్డం పూర్తైయ్యేసరికి మానవుడ్ని విజయపథంలోకి నడిపించి, జీవితాన్ని ఆనందమయం చేయగలుగేవేమిటో గుర్తించి, అలాంటి ఆదర్శజీవనాన్ని అలవర్చుకోమనే ప్రబోధాన్ని కలిగిస్తాయి. రెండు దృక్పథాలు అనుకరణకు సంబంధించినవే. వీటిలో ఉత్తమాధమ విలువల్ని నిర్ణయించడమంత సులువుగా తేలేది కాదు. ఇక్కడ అనుకరణలో రెండు కోణాల్ని గమనించాం. ఆధ్మాత్మికం, భౌతికం. ఇవే కావ్యంలో పరస్పరత్వాన్ని పొందుతున్నాయి. ఆ పొందటంలోనూ భిన్నత్వం ఉన్నా, రెండింటిలోనూ సంవేదన ఉంది. కవి వ్యక్తీకరించిన దానితో సమానంగా పాఠకుడు సంవేదనకు గురికావాలి. ఆ సంవేదన తన జీవితానుభవాలనుండి రూపొందిందైనప్పుడు ఆ అనుకరణకు సార్థకత చేకూరుతుంది. అనుభవం జీవితంలోకి రానప్పుడు అది మార్మికమవుతుంది. అప్పుడది

అవాంఛనీయధోరణులకు దారితీస్తుంది.

మన భారతీయ ఆలంకారికుడు ధనంజయుడు ఒక సందర్భంలో "రమ్యమ్ జుగుప్సితముదార మదాపి నీచమ్..." అంటూ రమ్యమైంది కానీ, వికృతమైంది కానీ దేన్నైనా సరే రసవంతం చేయగలిగే నైపుణ్యముంటే ప్రతీదీ రసవంతమే అంటాడు. ఇక్కడ మనం గమనించాల్సిందేమిటంటే, రసవంతమైనదంతా జీవితానికి ఉపయోగపడుతుందనీ చెప్పుకోలేం. దాంతోనే ఉంటే నేలవిడిచి ఆకాశం మీదే విహరించడమో అవుతుంది. అందుకే గోపి గారొక చోట రాసింది గుర్తొస్తుంది. "కలకీ, మెలకువకీ/ ఒక్కటే తేడా/ అది చంద్రశాంతి/ ఇది సూర్యకాంతి". ఇటువంటిదే అనుకరణకీ, వాస్తవానికీ, కళానందానికీ జీవితానందానికీ మధ్య గల తేడా. దీన్ని గుర్తించగలిగితే కవిత్వంలో సత్యాన్ని గుర్తించగలిగినట్లే!

# సాహిత్య విమర్శలో చెరిగిపోని 'చేరా'తలు

పాశ్చాత్య సాహిత్య విమర్శకు శాస్త్రప్రతిపత్తిని నిరూపించిన ముఖ్యమైనవారిలో ఐ. ఏ. రిచర్డ్స్ గురించి చెప్పుకున్నట్లే, ఆధునిక కవిత్వాన్ని భాషాశాస్త్ర భూమికతో విశ్లేషించిన తెలుగు సాహిత్య విమర్శకుల్లో చేకూరి రామారావు (చేరా)ని కూడా ప్రముఖంగా ప్రస్తావిస్తుంటాం. హైదరాబాదులోని అనేక సాహిత్య సభల్లో ముఖ్యఅతిథిగా, ప్రధానవక్తగా ప్రసంగించిన ఆయనే, సామాన్య ప్రేక్షకుడుగా కూడా ఎన్నో సభల్లో పాల్గొనడం చాలామంది గమనించే ఉంటారు. సాహిత్యం పట్ల ఆయనకున్న ప్రేమకది నిదర్శనం. అంత నిరాడంబరుడిగా జీవించిన ఆ సాహితీవేత్త జూలై 24, 2014న మరణించారని తెలిసిన తెలుగు సాహితీలోకం ఒక్కసారిగా విషాదంలో మునిగిపోయింది. ఆయన జీవితాన్ని, రచనలను ఒకసారి గుర్తుచేసుకునేలా చేసింది. ఆయనేదైనా సెలక్షన్ కమిటీలోఉన్నా ఆ అభ్యర్థిపై తన పాండిత్యాన్నంతటినీ ప్రదర్శించకుండా పెద్దమనిషి తరహాగా వ్యవహరించేవారని చెప్తుంటారు. తర్వాత ఎలాంటి నిర్ణయాలు తీసుకున్నా, ఆ ఇంటర్వ్యూ సమయంలో మాత్రం అభ్యర్థిని భయాందోళనలకు గురిచేయని మనస్తత్వమని చాలామంది చెప్తుంటారు. ఈ మాటను స్వీయానుభవంతో కూడా అనగలుగుతున్నాను.

వ్యాకరణం, భాషాశాస్త్రాలను ప్రత్యేకాంశాలుగా చదువుకొని, వాటిలోనే పరిశోధన కూడా చేశాడాయన. 1966-67 మధ్య కాలంలో A Transformational Study of Telugu Nominals పేరుతో సిద్ధాంతగ్రంథాన్ని సమర్పించి 1968లో డాక్టరేట్ పొందారు. Noam Chamsky పరివర్తన సిద్ధాంత ప్రభావంతో 'తెలుగువాక్యం' (1975) గ్రంథంలో అనేక విశేషాంశాలను తెలుగు పాఠకులకు వివరించారు. వివిధ ప్రసిద్ధ పత్రికలు, పరిశోధన సంచికల్లో భాషా శాస్త్రాంశాలను వివరిస్తూ రాసిన వాటిలో కొన్నింటిని 'తెలుగులో వెలుగులు' (1982) మరికొన్ని

గ్రంథాల్లో ప్రచురించారు. తర్వాత కాలంలో కేవలం 'భాష' కి సంబంధించిన గ్రంథాలన్నట్లుగా కొన్ని పుస్తకాలకు పేర్లు పెట్టారు. *'భాషానువర్తనం' (2000), 'భాషాంతరంగం'(2001), 'భాషా పరివేషం'(2003)* వంటివి వీటిలో కొన్ని రచనలు. సాహిత్యం లేకుండా భాష తన పరిమళాల్ని విరజిమ్మలేదని ఈ గ్రంథాల్లోని వ్యాసాల్ని చదివితే తెలుస్తుంది.

*'ముత్యాల సరాల ముచ్చట్లు'(1997), 'వచన పద్యం: లక్షణ చర్చ'(1978)* గ్రంథాలు వచనకవిత్వానికి ఉన్న విశిష్టతను తెలియజేసేదిశగా కొనసాగాయి. వాదోపవాద విమర్శ కూడా వ్యక్తిగత నిందారోపణలకు అవకాశం లేకుండా విషయంపైనే కేంద్రీకరించేటట్లు నేర్పుతాయి. తెలుగు వాక్యం సరళంగా, సుందరంగా, అర్థవంతంగా చేరా చేతిలో అమిరిపోయింది. అయితే ఎందుకో ఆయన కొన్ని పుస్తకాలకు పాఠకులందరికీ వెంటనే అర్థమైయ్యే రీతిలో లేని శీర్షికల్ని కూడా పెట్టారు. 'సాహిత్య వ్యాస *రింఛోళి* '(2001). 'రింఛోళి' అంటే 'గుంపు' అని అర్థం. అలాగే మరో వ్యాస సంపుటి 'సాహిత్యకిర్మీరం' (2002). కిర్మీరం అంటే 'వర్ణాల కలయిక' అని అర్థం. 'చేరాతలు'లో రాసిన కొన్ని వ్యాసాలు కూడా ఈ పుస్తకంలో ప్రచురించారు. కేవలం ఒక భావజాలానికో, ఒక వర్గానికో చెందిన వ్యాసాలను కాకుండా వివిధ రకాల వ్యాసాలను వివిధ అనుభూతులను సమ్మేళనం చేసి అందిస్తున్నట్లుగా ఈ శీర్షికలు పాఠకులకు స్ఫురిస్తుంటాయి. *'ఇంగ్లీష్ తెలుగు పత్రికాపదకోశం'* (1998)లో వాడుకలో ఉన్న కొత్త కొత్త పదాలను చేర్చారు.

*'రెండు పదుల పైన' (1982), 'చేరాతలు సాహిత్య విమర్శ – పరామర్శ' (1991), 'చేరా పీఠికలు' (1994), 'స్మృతికిణాంకం' (2000), 'కవిత్వానుభవం' (2001), 'వచన రచన తత్త్వాన్వేషణ'* (2002) గ్రంథాల్లో చేరా సాహిత్య విమర్శ స్వరూపం మరింత స్పష్టంగా కనిపిస్తుంది. ఆయనలోని సహృదయుడు కనిపిస్తాడు. ఆయన భాషాశాస్త్ర పండితుడు అయినా, ప్రధానంగా సాహిత్య విశ్లేషకుడుగానే కనిపిస్తారు. కవిత్వాన్ని చదువుకోవడమెలాగో బోధిస్తున్న మాస్టారులా వినిపిస్తుంటారు.

చేరా భాషాశాస్త్రంలో లోతైన పరిశోధన చేసినా పండితవర్గంలో ఆ పరిశోధనలకు గుర్తింపు వచ్చినా, సామాన్య పాఠకుడు కూడా గుర్తించేలా చేసింది మాత్రం 'చేరాతలు' అని చెప్పుకోవచ్చు. 1986 అక్టోబరులో 'చేరాతలు' ప్రారంభించి మధ్యలో కొన్నాళ్ళు (1988 ఫిబ్రవరి –1988 సెప్టెంబరు) మానేసినా తర్వాత 1988 అక్టోబరు వరకు రాశారు. వీటిలో కొన్ని వ్యాసాల్ని దేవిప్రియ సంపాదకత్వంలో

ప్రచురించారు. చేరాతలకు ఒక ప్రణాళికను వేసుకోకపోవడం వల్ల వ్యక్తీకరణకిచ్చిన ప్రాధాన్యం, సిద్ధాంతాలకివ్వలేకపోయానని ఆయనే చెప్పుకున్నారు. అందువల్ల చేరాతల్లో సమకాలీన ధోరణులన్నీ వచ్చాయని చెప్పుకోలేం.

గురజాడ అప్పారావు గారి 'పూర్ణమ్మ' కవితాఖండికలను పురిపండా అప్పలస్వామిగారి 'మల్లెమడుగు' నాయని కృష్ణకుమారిగారి 'ఊడలమర్రి'లతో పోల్చి చూపిస్తూనే వీటిని అనుసరణ, అనుకరణలగా కాకుండా ఒక సెట్ గా చదవ్వలసిన కథాకావ్యాలని వ్యాఖ్యానిస్తారు. విమర్శకుడు నిర్ణయాన్ని ప్రకటించేటప్పుడు పాటించాల్సిన సంయమనాన్ని గుర్తించేలా ఉందీ వ్యాఖ్య. త్రిపురనేని రామస్వామి చౌదరి మన సమాజానికిచ్చిన సందేశాన్ని వివరిస్తూ పురాణకథలను గుడ్డిగా నమ్మవద్దనీ, పురాణపురుషులను దేవుళ్లను చెయ్యొద్దనీ, ఏ విషయాన్నైనా హేతువాదదృష్టితో పరిశీలించడాన్ని నేర్పాడని ఆ సారాంశాన్నంతటినీ ఒక్కవాక్యంలో చెప్పేస్తారు. విశ్వనాథ సత్యనారాయణ గారు రాసిన '*అంధభిక్షువు*' గురించి ఒక కథలా స్వీయానుభూతిని వివరిస్తూ విమర్శను రాయడం వల్ల కవిత్వాన్ని కూడా 'కథ'లా చదువుకునేలా చేశారు. ఈ సందర్భంలోనే ప్రాచీన, ఆధునిక కవిత్వానికి మధ్య గల భేదాల్ని వివరిస్తూ ప్రాచీనసాహిత్యంలో వస్తువుని అలంకారాల్లో వర్ణిస్తే, ఆధునిక కవిత్వంలో భావస్ఫూర్తినిచ్చే భావచిత్రాల్లో వర్ణిస్తారని కవిత్వరహస్యాల్ని వెల్లడించారు. (పుట:16) అంధభిక్షువు గొప్పఖండిక. అంధభిక్షువు గురించి విశ్వనాథ "*అతడు పూర్వజన్మమందు ఏ నూతిలోనో చచ్చిపోవు చెంత విలపించి వినువారలే లేక, ఆ పిలుపు ప్రాణ కంఠ మధ్యములయందు సన్నవడి, సన్నవడి నేటి జన్మనతని కనుచు వెదకుచు వచ్చి చేరినది*" అని వర్ణించారు. దీనిలో పూర్వజన్మ గురించి చేరా తర్వాత రాసిన చేరాతల్లో పూర్వ జన్మ ప్రసక్తి ఆధ్యాత్మికత కోసం కాకుండా కవిత్వం కోసం తెచ్చారన్నారు. ''*భిక్షుకుని స్వరహైన్యాన్ని, కనుగూళ్ళ శూన్యాన్ని మన మనసులో ముద్రించటం కోసం కవికి పూర్వ జన్మపనికి వచ్చింది. ఆ స్వరం వింటున్నప్పుడు, కనుబొత్తలు చూస్తున్నప్పుడు అతని పూర్వ జన్మ వృత్తాంత భ్రాంతి కలిగి అతన్ని బావిలోంచి తీద్దామా అన్న త్వరపుడుతుంది కవికి*" (పుట:28) అని కవిత్వానుభవాన్ని వివరించారు. సహృదయ విమర్శకుడు తన రచన ద్వారా మూలరచనను చదివేలా చేయగలగాలని అంటుంటారు. ఆ పనిని చేరా ఎంతోసమర్థవంతంగా చేయగలిగారు. చేరాతలు ఆధునిక తెలుగు కవిత్వాన్ని స్త్రీవాద కవిత్వం వరకూ ఎలా అవగాహన చేసుకోవాలో తెలియడానికి ఎంతగానో సహకరిస్తాయి. చేరాతలు తర్వాత

అంతశక్తివంతంగా మరలా కవిత్వం గురించి రాసి మెప్పించిన వారు జి. లక్ష్మీనరసయ్య. చేరాతలు స్త్రీవాదకవిత్వం వరకు రాస్తే, దాని తర్వాత కవిత్వాన్ని జి. లక్ష్మీనరసయ్య కొనసాగించినట్లనిపిస్తుంది.

చేరా శైలి రెండు రకాలుగా కనిపిస్తుంది. భాషాశాస్త్ర వ్యాసాలు పూర్తిగా లిఖితసంప్రదాయంలోను, సాహిత్యవిమర్శవ్యాసాలు కొంత మౌఖిక సంప్రదాయంలోను ఉన్నట్లుంటాయి. సాహిత్య విమర్శ శైలిని గమనిస్తే, దాన్ని చెప్తుంటే ఎవరో రాయసగాడు రాసినట్లుండే మౌఖిక సంప్రదాయంలో ఉన్నట్లనిపిస్తుంది. కొన్ని విమర్శ వ్యాసాల్ని చదువుతుంటే అనుభూతివాదిగా కూడా కనిపిస్తుంటారు. అందువల్ల ఈయన శైలిని ప్రత్యేకంగా గమనించాలి. చేరా చిన్నవ్యాసం రాసినా దానిలో కూడా ఏదొక ప్రతిపాదనగానీ, సమన్వయం గానీ లేకుండా ఏ వ్యాసాన్నీ రాయరనీ నాకు అనిపిస్తుంది.

చేకూరి రామారావుగారి భాష, సాహిత్యం, అధ్యాపకత్వం, బోధన తదితరాంశాలతో పాటు ఆయన వ్యక్తిత్వం గురించి బహుముఖంగా ప్రస్తావించుకోవాల్సిన అంశాలెన్నో ఉన్నాయి. అన్నింటినీ ఇప్పుడే స్మరించుకోలేం. ఆయా రంగాల్లో నిష్ణాతులు, ఆయనతో అత్యంత ఆత్మీయ అనుబంధం గల వాళ్ళు వాటన్నింటినీ పంచుకుంటారు. చేరా గార్ని రకరకాలుగా చూసే అవకాశం ఉన్నా, నాకు ఆయనొక ఆధునిక సాహిత్య విమర్శకుడుగానే కనిపిస్తారు. రాబోయే యువవిమర్శకులకు మార్గదర్శిగానే అనిపిస్తారు. ఆయనకు విమర్శలోకమంతా నివాళి అర్పించాల్సిన సమయం. దీనిలో భాగమే ఈ చిన్ని వ్యాసం.

***-(సూర్య దినపత్రిక, 28-7-2014)***

# అంతర్జాలంలో పిల్లల పత్రికలు

శాస్త్ర, సాంకేతికరంగాల్లో వస్తున్న పరిణామాలకు అనుగుణంగా పత్రికల్లోను అనేక మార్పులు చోటుచేసుకుంటున్నాయి. ప్రింట్ అండ్ ఎలక్ట్రానిక్ మీడియాల్ని కూడా తనలో లీనం చేసుకోగలిగిన అంతర్జాలం అరచేతిలో స్వర్గంలా మారింది. నేడు ప్రతి ఒక్కరు తమకేమికావాలో అవన్నీ అంతర్జాలంలో వెతుక్కొనే పరిస్థితి కనిపిస్తుంది. అటువంటి అవకాశమే పిల్లలకు కూడా అంతర్జాలం కల్పిస్తుంది. అంతర్జాలంలో ముద్రణలో లభిస్తున్న వాటితో పాటు కేవలం అంతర్జాలంలో అందించడానికి మాత్రమే రాస్తున్న రచనలు కూడా అంతర్జాల పిల్లల పత్రికల్లో కనిపిస్తున్నాయి. నేడు పిల్లలు మొబైల్, ల్యాప్ టాప్, ఈ బుక్స్ చదువుకోవడానికి ట్యాబ్స్ వంటి రకరకాల సాధనాలు అందుబాటులోకి రావడంతో అంతర్జాలంలో రచనలకు ప్రాధాన్యం పెరిగింది.

గ్రంథాలయాలకు, పుస్తక విక్రయకేంద్రాలకు వెళ్ళి తమకు కావలసిన పుస్తకాలను తీసుకొని లేదా కొనుక్కొని చదువుకొనే పరిస్థితులు తగ్గిపోతున్నాయి. దీనికి బదులు సులభంగా అంతర్జాలంలో తమకు కావలసిన పుస్తకాలను వెతుకుతున్నారు. అంతే కాకుండా తమకు కావలసిన ఒక పదాన్ని బట్టి కూడా అంతర్జాలంలో ఎక్కడుందో తెలుసుకోగలుగుతున్నారు. దీనివల్ల ఎంతో సమయం కలిసొస్తుంది. దీనికి యూనికోడ్ లో తమకు కావలసిన పదాన్నిబట్టి గానీ, గేయం, కథ, కవిత, సామెత, పొడుపుకథ, రచయిత, పత్రిక వంటి వాటిని సెర్చ్‌బాక్స్ లో టైపు చేసి వెతికి పట్టకోవచ్చు. ఇది అంతర్జాలంలో నిముషాల్లో జరిగిపోతుంది. అందువల్ల కూడా అంతర్జాలంలో పిల్లల రచనలకు ప్రాధాన్యం పెరిగింది.

పత్రికలను కూడా ఇప్పటికే చాలామంది ఈ పత్రికలుగా చదివి, తమకు కావలసిన అంశాలుంటే వాటిని కాపీ చేసుకొని లేదా దిగుమతి చేసుకొని (డౌన్లోడు)

దాచుకుంటున్నారు. అందువల్ల ముద్రణలో లభిస్తున్న పత్రికలు కూడా వివిధ ఫార్మేట్స్ లో అంతర్జాలంలో అందిస్తున్నారు. ఆవిధంగా చందమామ, బాల వంటి ముద్రిత బాలల పత్రికలను కూడా అంతర్జాలంలో అందుబాటులోకి తీసుకొస్తున్నారు. కేవలం కొత్తవాటినే కాకుండా, పాతవాటన్నింటినీ అంతర్జాలంలోకి తీసుకొచ్చేప్రయత్నం చేస్తున్నారు. పిల్లలకోసం ప్రస్తుతం అంతర్జాలంలో కింది వెబ్ సైట్స్, బ్లాగులు అందుబాటులోఉన్నాయి. వాటి స్వరూప స్వభావాలను తెలుసుకుందాం. ప్రస్తుతం అంతర్జాలంలో పిల్లల రచనలు అందిస్తున్న వెబ్సైట్లు ఐదు రకాలుగా కనిపిస్తున్నాయి. వాటిని ఇలా వర్గీకరించవచ్చు. అవి: వాటిని ఇలా వర్గీకరించవచ్చు. అవి: 1. ప్రత్యేకించి పిల్లలకోసమే నిర్వహిస్తున్న వెబ్సైట్లు, 2. ప్రత్యేకించి పిల్లల కోసమే నిర్వహిస్తున్న బ్లాగులు, 3. కమ్యూనిటీ వెబ్సైట్లు, 4. ముద్రిత పత్రికలనే వివిధ ఫార్మేట్స్‌లో అందిస్తున్న వెబ్సైట్లు, 5. పిల్లల కోసం కూడా కొన్ని శీర్షికలు నిర్వహించే వెబ్సైట్లు. వీటిలో మొదటి రెండింటి ద్వారానే అత్యధికంగా పిల్లల సాహిత్యం లభ్యమౌతుంది. వాటి గురించి వివరంగా తెలుసుకుందాం.

## ప్రత్యేకించి పిల్లలకోసమే నిర్వహిస్తున్న వెబ్సైట్లు:

అంతర్జాలంలో కేవలం పిల్లలకోసమే కొన్ని వెబ్సైట్లు నడుపుతున్నారు. తెలుగు అక్షరాలను నేర్చుకోవడం నుండి చిన్న చిన్న కథలు, గేయాలు, సామెతలు, పొడుపుకథలు వంటి వాటి వరకు అనేక ప్రక్రియల్లో పిల్లల కోసం సాహిత్యాన్ని అందుబాటులోకి తీసుకొస్తున్నారు. దీని వల్ల తెలుగు భాష, సాహిత్యాల పట్ల పిల్లలకు నేర్చుకోవాలనే, తెలుసుకోవాలనే ఆసక్తి పెరుగుతుంది. ప్రత్యేకించి పిల్లలకోసమే ఇవి రూపొందించడం వల్ల అంతర్జాలం అలవాటైన పిల్లలు ఇతర వెబ్సైట్లలోకి వెళ్ళకుండా తమకు కావలసినవన్నింటినీ ఒకేచోట నేర్చుకొనే వీలుకలుగుతుంది. అటువంటి వెబ్సైట్లలో కిందివి ముఖ్యమైనవి.

### 1. తెలుగు4కిడ్స్ :http://telugu4kids. com/

రండి రండి పిల్లలూ! అమ్మను నాన్నను పిలవండి! తేట తెలుగు వినండి! మళ్ళీ మళ్ళీ వస్తుండండేం! అని స్వాగతం పలుకుతుందీ వెబ్ సైటు. ఈ వెబ్ సైట్ లక్ష్యాలను ఇలా ప్రకటించారు. “This site is for parents around the world who want to entertain their kids while introducing and teaching Telugu

to them. I created this site with the help of my family.

Telugu Rhymes, Telugu stories, Telugu vocabulary, excerpts from some of the best children's literature in Telugu, Telugu padyalu, podupu kathalu and more, are presented as short movies.

There are also other attractions like simple interactive games in Telugu, printable activities and articles. These activities are temporarily unavailable as changes are being made to the website. They will be added in the coming days. New activities and videos will also be added from time to time.

It is easier for you to give your feedback and offer suggestions now as there is a provision for comments on each page. So please do let us know how this website can better serve its goal. ''

నిర్వాహకులు ప్రకటించినట్లుగానే తెలుగులోను, అవసరమైన పదాలను, కొన్ని వివరణలను ఆంగ్లంలో అందిస్తున్నారు. వీటి వల్ల సెర్చ్ చేసేటప్పుడు వాటిని సులభంగా పట్టుకోవడానికి వీలవుతుంది. అయితే, చాలా వాటికి యూట్యూబ్ నుండి హైపర్ లింక్స్ ఇస్తున్నారు. అయితే కొన్ని లింకులు సరిగ్గా ఓపెన్ కావడంలేదు. హైపర్ లింక్స్ ఇవ్వడంలో కొంత జాగ్రత్త వహిస్తే బాగుంటుంది. ఈ వెబ్ సైటులో కింది శీర్షికలు ఉన్నాయి.

అ). ప్రార్థన పద్యాలు, పాటలు: ఈ శీర్షికలో కింది అంశాల్ని అందిస్తున్నారు. తొండమునేకదంతము, తల్లీ నిన్ను దలంచి, చేత వెన్న ముద్ద, ఎవ్వనిచే జనించు మొదలైన ప్రార్థనా పద్యాలు ఉన్నాయి. ఇవన్నీ పిల్లలు కంఠస్థం చేయదగినవి. వీటిని ఎలా చదవాలో, ఎలా ఆలపించాలో వీటిని డౌన్ లోడ్ చేసుకొని లేదా అంతర్జాలంలోనే వినడం ద్వారా పిల్లలు నేర్చుకోవచ్చు.

ఆ). మొదటి పాఠాలు: ఈ శీర్షికలో కింది అంశాల్ని అందిస్తున్నారు. ''*చిట్టీచిలకమ్మా, ఉడతా ఉడతాఊచ్, చుక్ చుక్ రైలు, ద్రాక్ష పళ్ళు, పైసకి రెండు, గుమ్మాడమ్మా గుమ్మాడి, వానా వానా వల్లప్పా, ఏనుగు ఏనుగు నల్లన* మొదలైన గేయాల్ని అందిస్తున్నారు. ఇవి చక్కగా ఏనిమేషన్‌తో రూపొందించిన గేయాలు. తెరపై అక్షరాలు కూడా వస్తుండడం వల్ల వినేది చదువుకోవడానికి కూడా అనువుగా ఉంటుంది.

ఇ). తెలుగు మాటలు: *దీనిలో బొమ్మలు చూస్తూ మాటలు నేర్చుకుందాం, నెమ్మదిగా కొన్ని వాక్యాలు అలవాటు చేసుకుందాం. అంటూ కింది రాత్రి, పగలు, దిక్కులు, రంగులు, ఆకాశం నుండి సముద్రం వరకు,* అడవి జంతువులు మొదలైన వాటిని వీడియోల ద్వారా చిత్రీకరించి చక్కగా వివరిస్తున్నారు.

ఈ). కథలు: *కాకమ్మా, కథ చెప్తావా?, అమ్మా, అమ్మా, ఇంకో కథ చెప్పవా? కంచికి వెళ్ళిన కథలను కలిసి వద్దాము, కలసి ఇద్దరమూ మళ్ళీ మళ్ళీ విందాము అంటూ కూరగాయల కథ, నాన్నా! పులి!, పుటుక్కు, జర జర, డుబుక్కు, మే, ఏడు చేపల కథ, కాకి కథ, ఐకమత్యం, కుందేలు, తాబేలు, అందని ద్రాక్షపళ్ళు* పుల్లన మొదలైన కథల్ని పెట్టారు.

ఉ). నీతి పద్యాలు : *అనగననగ రాగం, వినదగు నెవ్వరు* చెప్పిన, *అల్పు డెపుడు పలుకు, తన కోపమె తన శత్రువు,* అనువు గాని చోట, లావు గల వానికంటెను మొదలైన నీతి పద్యాలకు సంబంధించిన వాటిని ఆంగ్ల భాషలో కొద్దిగా పరిచయం చేస్తూ అందించారు. ఈ వెబ్ సైటు పిల్లలకు ఎంతగానో ఉపయోగపడే అనేకాంశాల్ని అందిస్తుంది. ఈ వెబ్సైటుని లలిత నిర్వహిస్తున్నారు.

**2. కొత్తపల్లి (మాసపత్రిక), :** http://kottapalli.in/

ఇది 2008 ఏప్రిల్ నుండి వస్తుంది. దీని లక్ష్యాలు కింది విధంగా ఉన్నాయి. "*బానిసత్వంగానీ, అంకుశాలుగానీ లేని పిల్లల ఊరు ఉంటే బాగుండు. ఆ కొత్త పల్లిలో పిల్లలు స్వేచ్ఛగా విహరిస్తుంటారు– ఆకాశాన ఎగిరే పక్షుల మాదిరి. స్వతంత్ర గీతాలు పాడుతుంటారు– కోయిలల మాదిరి. సంతోషంగా ఎగురుతుంటారు, ఇష్టంగా నేర్చుకుంటారు– పిల్లి పిల్లల్లాగాను, పులి బిడ్డల్లాగానూ. ఆ ఉత్సాహపు జల్లులు వెల్లువలై, కాలువలై, ఏర్లై, నదులై, మహా సముద్రాలైతే వాటి ఆనంద తరంగాలు ప్రపంచంలో పిల్లలందర్నీ చేరి, మేమున్నాం, మీరూ రండి*" అని పిలుస్తై.

అందులోనూ పెద్దలుంటారు– పిల్లలకు దాస్యం చేస్తుంటారు. వాళ్ల సంతోషాల్లోంచి రాలే ముత్యాలని ఏరుకుంటూంటారు. వాళ్లు అడిగితే, తమకు తెల్సిన కబుర్లు చెప్పి, వాళ్లకు సాయం చేస్తూ, అలా తమకు తాము మేలు చేసుకుంటారు. వాళ్లు అడక్కపోతే, అడిగేలా మాయచేసేందుకు ప్రయత్నిస్తారు, ఫలితం లేకపోతే తమ బ్రతుకు తాము బ్రతుకుతారు. అన్ని జంతువుల పిల్లల్లాగే మనిషి పిల్లలుకూడా వారికి అర్థవంతంగా ఉండేవాటిని ఇష్టపడతారు. ఏవైనాసరే,

అర్థమవ్వాలి, ఒత్తిడి కలిగించకూడదు, మరీ ఎక్కువ ప్రశ్నించి గందరగోళ పరచకూడదు, నేర్పాలి; పరీక్షించకూడదు, ఉన్నతత్వాన్ని చూపాలి; కానీ వారిని చిన్నబుచ్చుకూడదు. కథల్లో, ఆటల్లో, పాటల్లో ఈ గుణాలన్నీ ఉంటాయి– అందుకనే కొత్త పల్లిలో ఇవన్నీ సజీవంగా ఉంటాయి. బొమ్మల్లో ప్రాణం పోసుకుంటాయి. పలకటం నేర్పుతాయి, వినటం నేర్పుతాయి, బొమ్మలు వేయటం నేర్పుతాయి, చదవటం నేర్పుతాయి, చూడటం నేర్పుతాయి, మాట్లాడటం నేర్పుతాయి, భాషని ఇష్టపడటం నేర్పుతాయి. చందమామని చేతికి అందిస్తాయి. పులకించని మది పులకించేలా చేస్తాయి... అనే ఒక ఊహాప్రపంచాన్ని నిర్మించే ప్రయత్నంలో పిల్లల కోసం ఒక కొత్త పల్లి ఏర్పడాలని కలగన్నట్లు, ఆ కలల ఫలితంగానే కొత్త పల్లి కొత్తపల్లి (వ)మాసపత్రిక రూపందాల్చి మీముందుకొస్తోంది" అని నిర్వాహకులు ప్రకటించారు.

ఈ వెబ్ సైటుని పెద్దలు, పిల్లలు కలిసి నిర్వహిస్తున్నారు. ప్రచురణల కర్త: డాక్టర్సుబ్బరాజు, ప్రధాన సంపాదకుడు నారాయణ. విద్యార్థినీ విద్యార్థులు దీన్ని నిర్వహించడంలో పాలుపంచుకుంటున్నారు. వాళ్ళందరి వివరాలను వెబ్ సైట్లో ఫోటోలతో సహా పరిచయం చేశారు. ఈ పత్రికను యూనికోడ్, పిడిఎఫ్, వ బుక్ ఫార్మేట్స్లో అందిస్తున్నారు. అందువల్ల నెలకోసారి పత్రిక మొత్తాన్ని ఒకేసారి డౌన్ లోడ్ చేసుకొని ఇంటర్నెట్ తో సంబంధం లేకుండా కూడా ఇంటర్నెట్లోనే చదువుకుంటున్న అనుభూతితో చదువుకునే వీలుకలుగుతుంది. అలాగే దీన్ని ఆన్ లైన్లో బుక్ గా కూడా మనకి కావలసిన పుటల్ని పుస్తకంలా చదువుకునే వీలు కలుగుతుంది. పత్రికలో పిల్లలకు నచ్చే, మెచ్చే పద్ధతిలో రంగురంగుల బొమ్మలతో ఆకర్షణీయంగా తీర్చిదిద్దుతున్నారు. ఈ పత్రికలో ప్రచురితమైన రచనలను తర్వాత తమ తమ బ్లాగులో కొంతమంది పునర్ముద్రించుకొంటున్నారు.

దీనిలో కింది శీర్షికలు ఉన్నాయి. పిల్లలు రాసిన కథలు, పెద్దలు రాసిన కథలు, ధారావాహికలు (నీతిచంద్రిక), పాటలు (చిట్టి పాటలు), అవీ–ఇవీ (చిలిపి ప్రశ్నలు – తిక్క జవాబులు), (ఇందు బిందు), (పదరంగం), (సమీక్ష), (బొమ్మకు కథ రాయండి!), జోకాభిరామాయణం, (చిక్కు ప్రశ్నలు, జోకులు, పద్యాలు)

కొత్తపల్లి పత్రిక ఏప్రియల్ 2012 సంచిక పై శ్రీమతి మాలతీ కృాఎష్ణ, విద్యార్థి సృాఎజన కుటీర్, విజయవాడ. ఒక సమీక్షలో ఇలా పేర్కొన్నారు. "బొమ్మకు కథకు *మూడు స్పందనలు రావటం మంచి పరిణామం.... 'విషాదయాత్ర', 'సాహసయాత్ర'*

*కథల్లో జయదీప్, కార్తీక్‌ల భాష, శైలి, పకడ్బందీగా సాగిన కథనం వారి వయస్సుకు తగ్గ (ఓ పిసరు ఎక్కువే నేమో)పరిణతిని ప్రతిఫలించాయి. జయదీప్ రచనలో ఆంగ్ల సాహిత్యపు వాసనలు కాస్త ఘాటుగానే అనిపించాయి. కార్తీక్ శైలి చిన్నప్పటి తెలుగు డిటెక్టివ్ నవలలని గుర్తుకు తెచ్చింది. రాజేశ్వరి ప్రయత్నం బావుంది – వయసుకు తగ్గ అమాయకత్వంతో...' ఇష్టంతో చేస్తే' కథాంశం, భాష, కథనం – మూడూ కూడా నాలుగో తరగతి పిల్లవాడికి చాలా పై స్థాయివిగా అనిపించాయి. కథ బాగుంది –అందులో సందేహం లేదు... చాలా కథలకు ఈసారి బొమ్మలు బాగున్నాయి.*

కొత్తపల్లి పత్రిక వ పత్రికగా వస్తున్నా, ఏనిమేషన్ వంటి సాంకేతికతను ఉపయోగించుకోవడం కంటే ముద్రించే పత్రిక పద్ధతిలోనే కొనసాగుతుంది. ఫరనాసక్తిపైనే పత్రికా నిర్వాహకులు దృష్టి పెట్టినట్టు అనిపిస్తుంది. పత్రికను ముద్రించి కూడా అమ్ముతున్నారు. 66 పుటలున్న ముద్రిత ప్రతి ఒక్కంటికి: 20 రూపాయల చొప్పున అందిస్తున్నారు.

**జాబిల్లి (మాసపత్రిక), :** http://jabilli.in/

జాబిల్లిని తయారుచేసి నిర్వహిస్తున్నవారు శివ బండారు. దీనికి www.webzillatech.com వారు ఉచిత సాంకేతిక సహకారం, హోస్టింగ్, డొమైన్ తదితర సేవలు అందిస్తున్నారు. *జాబిల్లి బాలల పత్రిక ఒక లాభాపేక్షలేని సేవ* అని ప్రకటించారు. చిన్నపిల్లలకు తెలుగు, మన మూలాలు, మన సంస్కృతి, సాహిత్యాలపై ఆసక్తిని పెంచటానికి బాల సాహిత్యాన్ని వారికి అందుబాటులో ఉంచాల్సిన బాధ్యత మనదేననీ, అందుకు మనకి అందుబాటులో ఉన్న టెక్నాలజీ ఉపయోగించి ఒక వేదికను తయారు చేసామనీ, దీని నిర్వహణలో చిన్నలు, పెద్దలు, రచయితలు అందరూ పాల్గొనాలని పిలుపునివ్వడంలో వీరి లక్ష్యాలు తెలుస్తున్నాయి. తెలుగు యూనికోడ్‌లో ఈ పత్రికను నిర్వహిస్తున్నారు. దీని తొలి సంచిక 2009 మే నెలలో వెలువడింది. డిసెంబరు, 2012 వరకు సంచికలు వెలువడ్డాయి. మధ్య మధ్యలో కొన్ని సంచికలు వెలువడలేదు. ఈ పత్రికలో ఈ కింది శీర్షికలు నిర్వహిస్తున్నారు. పుల్లావేమారం పనులు చెయ్యకు అని పెద్దవాళ్ళు అంటూ ఉంటారు కదా.. అసలు అ జాతీయం ఎలా పుట్టిందో చూద్దాం.. "*పూర్వకాలంలో పుల్లయ్య అనే మంచి పనివాడు ఒక రైతు దగ్గర పనిచేస్తుండేవాడు. రైతు చెప్పిన పనల్లా వెంటనే పూర్తిచేసి రైతు మెప్పు పొందేవాడు. బాగా చురుగ్గా కలివిడిగా ఉండటంతో అందరికీ పుల్లయ్య*

అంటే ఎంతో ఇష్టం.

ఒక రోజు సాయంత్రం రైతు తన భార్యతో పుల్లయ్యను రేపు వేమవరం పంపించాలి అని అనటం మన పుల్లయ్య విన్నాడు. అంతే ఇంకేముంది. రేపు వేమవరం వెళ్ళాలి కదా ఇప్పుడే వెళ్ళి వచ్చేద్దాం అని మనోడు రాత్రికి రాత్రే కాలినడకన వేమవరం వెళ్ళి వచ్చేసాడు. తెల్లారి రైతు పుల్లయ్యని వేమవరంలో పనిఉంది నువ్వు వెళ్ళాలి అంటే పుల్లయ్య రైతుతో నిన్న రాత్రి మీ మాటలు విని వేమవరం వెళ్ళి వచ్చేసానండయ్యా.. అనడంతో రైతు అవాక్కయ్యి ఆ తరువాత పుల్లయ్య అమాయకత్వానికి నవ్వుకున్నాడు. అప్పటినుండి పనికిమాలిన, పని చేసినా ఫలితం లేని, ఉపయోగం లేని పనులను పుల్లయ్యావేమవరం పనులు అంటున్నారు.. పుల్లయ్యావేమవరం పనులు చివరికి పుల్లావేమారం పనులుగా వాడుకలోకి మారింది. ” ఇది ప్రసిద్ధమైన కథే అయినా, మళ్ళీ దీనిలో పెట్టడం ద్వారా అందుబాటులోకి తీసుకొచ్చారు. ఇటువంటి కథలు, గేయాలు, వ్యాసాలు దీనిలో చాలా ఉన్నాయి.

### 4. ఫర్ కిడ్స్ (మాసపత్రిక), : http://forkids. in/

“చిన్నారులకు అవసరమైన ప్రతి ఒక్కటి ఇక్కడ కూర్చి పెట్టాలనేదే లక్ష్యం. ఇక్కడి కథలు కబుర్లు పిల్లలకి చెప్పండి. చిట్టిపొట్టి పాటలు నేర్పండి. ఆటలతో వాళ్ళని ఉత్సాహపర్చండి. కథలు, ఆటపాటలలోంచి పిల్లలు వికసిస్తారు. వారి ఎదుగుదలలో కథకున్న ప్రాధాన్యత అంతా ఇంతా కాదు. లోకం పోకడలు తెలుస్తాయి. ఊహాశక్తి, కల్పనా సామర్థ్యం పెరుగుతుంది. విచక్షణ, వ్యవహార దక్షత అలవర్చుకుంటారు. సాహిత్యం పై మక్కువ పెంచేది కథ. వాక్యనిర్మాణం, పదజాలాభివృద్ధి కూడా మెరుగుపడతాయి. కథలు విన్నాక, చదివాక పిల్లలు ఊరుకోరు. వాళ్ళు కొత్త కథలు చెపుతారు. వాళ్ళ ఊహల్ని కథలుగా మలిచేలా ప్రోత్సాహించండి. వాళ్ళు విన్న, కన్న, ఊహించిన వాటిని కథలుగా వ్యాసాలుగా ప్రాణం పోసుకోనివ్వండి. ఏదిచూసినా దానిపై చిట్టిపొట్టి వ్యాసాలు రాసేలా ప్రోత్సాహించండి. మీరూ వాళ్ళకోసం రాయండి. చిన్నారులకోసం ఆటపాటల్ని, కథల్నీ పోగేద్దాం.

చిన్నారులు కథలు, ఆటపాటలు, వ్యాసాలు, కబుర్లు ఇలా ఏదైనా మీ సృజనాత్మకసృష్టిని ఇక్కడ పంచుకుంటూ తద్వారా మీ ఆలోచనలనూ, అభిప్రాయాలను, కల్పనా శక్తినీ వికసింపజేసుకోవచ్చు. భావితరానికి సాహితీప్రియులనీ, రచయితలనీ

*అందించాలనే ఆకాంక్షకి మీ అందరి ఆశిస్సులు, అభిమానం ఎంతో అవసరం వాటిని అందిస్తూ మాతో పాలు పంచుకోమని కోరుతున్నా"*మని నిర్వాహకులు Kr geetika, Himabindu Tirunagari, పాఠకులను కోరుతూ ఫర్ కిడ్స్ (http://forkids.in/) కి స్వాగతం పలుకుతూ ఈ వెబ్సైట్ లక్ష్యాలను వివరించారు. దీనిలో ఏనిమేటెడ్ పిక్చర్స్ తో చక్కని కథలున్నాయి. వీడియో, ఆడియో రూపంలో కూడా ఇవి లభ్యమౌతున్నాయి. వీటిలో"*తెల్లని ఏనుగు, ఏనుగు నల్లన ఎందుకని?, మిరపకాయ్ పొట్టోడి కథ!, ప్రపంచంలోకెల్లా అత్యంత తియ్యనైనది ఏది? గాడిదల పంపకం, పట్టిందల్లా బంగారం, పేను నల్లి, ఒక దొంగ పిల్లి కథ, బ్రహ్మ జెముడు*" మొదలైన కథలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి.

పిల్లలలో పదశక్తినీ, ఆలోచనా శక్తినీ పెంచే పదవిన్యాసాన్ని కైపు ఆదిశేషారెడ్డి నిర్వహిస్తున్నారు. అలాగే తమాషా లెక్కలు శీర్షికతో లెక్కలంటే భయాన్ని పోగొట్టే టెక్నిక్స్ ని వివరించే రచనలను కూడా ప్రచురిస్తున్నారు. ఆట పాట (ఆటలు, పాటలు, బాలలు పాడిన పాటలు), ఆడియో, కథలు, జానపద కథలు, తెనాలి రామకృాఎష్ణుడి కథలు, నీతి కథలు, పంచతంత్రం, పురాణ కథలు, బాలలు వ్రాసిన కథలు, చేసిచూద్దాం, జంగిల్ బుక్, చెట్లు, నాటకం, భట్టి విక్రమార్క కథలు, రివ్యూ, పుస్తకం, సినిమా, విజ్ఞానం, తమాషా లెక్కలు, పద విన్యాసం, మీకు తెలుసా!, వ్యాసాలు, వివిధ, పండగలు, వ్యక్తిత్వవికాసం, హాస్యం, వీడియో మొదలైన పేర్లతో ఈ వెబ్సైట్లో చాలా శీర్షికలు ఉన్నాయి. ఉదాహరణకు లెక్కల గురించి ఆసక్తిగా వివరించిన ఒక రచనను చూద్దాం.

తమాషా లెక్కలు

రచన : రమ్య గీతిక

పిల్లలు మీకు మ్యాథ్స్ అంటే భయమా! మ్యాథ్స్ అంటే భయపెట్టే సబ్జెక్టే కాదు.

సులువయిన పద్దతులు మరియు తమాషా లెక్కలు కూడా ఉంటాయి.

కొన్ని గుణకారాలకు సులువయిన పద్దతి మనమిప్పుడు చూద్దాం.

మనకందరికి 10 టేబుల్ ఇష్టం కదా. ఎందుకంటె అది సులువు కాబట్టి.

10×4 అనగానే 40 అని చెప్పేస్తాం. 4 పక్కన 0 పెడితె సరిపోతుంది.

అలా ఎంత పెద్దదయినా చెప్పొచ్చు.

అలాగే 11 టేబుల్ కూడా సులువుగా చెప్పేయ్యవచ్చు.

ఉదా: 11×21 అడిగితె ఎంతో సమయము కావాలి. గుణకారం చేసుకోవాలి. కాని ఈ పద్దతి లో కొన్ని సెకన్స్ లో చెప్పవచ్చు. ఇక్కడ 11 తో 21 గుణకారం కావున 2 1 మధ్యలో ఖాళి వేసుకోవాలి. దానిలొ2+1 వేసుకోవాలి. అంటే జవాబు 231

అలాగే

11×43

4 (4+3) 3

473

ఇలా అన్నమాట. ఇంకా చాలా మందికి 10 టేబుల్ వరకు ఈసీ గా వస్తాయి. దానిపైన మల్టిప్లికేషన్.. అంటే చాలా సమయం పడుతుంది కదా.

దానికి ఓ సులువైన పద్దతి ఉంది.

16×14 అడిగారనుకోండి.

అదంతా మనసులో మల్టిప్లికేషన్ అంటే కొద్దిగా కష్టం

మనకు 10 టేబుల్ ఈజి కాబట్టి దానితో సులువుగా చేయవచ్చు.

ఉదా:

మొదటి సంఖ్య16×10=160

రెండవ సంఖ్య లోని 4×10=40

మొదటి, రెండవ సంఖ్యలోని రెండవ అంకెలు 6×4=24

-------

224

-------

అని మనసులో వేసుకొని కొన్ని సెకండ్స్ లో చెప్పవచ్చు. అలాగే మరికొన్ని వివరించారు.

18×12

18×10= 180

2×10 = 20

8×2 = 16 దీన్ని కలిపితే

వచ్చేమొత్తం=216

ఇలా ఈ వెబ్సైట్ లో రకరకాల శీర్షికలతో పిల్లల రచనలను అందిస్తున్నారు.

ఇది తెలుగు, ఆంగ్లం, తమిళభాషల్లో ఉంది. తెలుగుకి సంబందించిన అనేకాంశాలు దీనిలో ఉన్నాయి. ఆంగ్ల లిపిలో తెలుగు శీర్షికలు రాశారు. లెర్నింగ్ పేరుతో తెలుగు అక్షరాలను రాయడం, పలకడం ఎలాగో వీడియో ద్వారా నేర్పుతున్నారు. తెలుగు భాషలో సంబంధించిన అక్షరానికి తెలుగు పదాన్నీ, ఆంగ్లంలో దాని అర్థాన్నీ కూడా వివరిస్తున్నారు. ఉదాహరణకు అ అనే అక్షరంపై క్లిక్ చేస్తే దాన్ని పలకపై ఎలా రాయాలో బొమ్మరూపంలో చూపిస్తూనే అమ్మ ఎముఅరాఎశ్రేష్ఠవత్ణి అనీ వివరస్తూ ఆ పదాలను కూడా రాస్తున్నారు. ఇలా మొత్తం తెలుగు అక్షరమాల అంతా సులభంగా నేర్పడానికీ, నేర్చుకోవడానకీ ఇది ఎంతగానో ఉపయోగపడుతుంది.

నిత్యజీవితంలో అవసరమైన చాలా వాటిని ఆంగ్ల పదాలతో పాటు తెలుగుని బోధిస్తున్నారు. జంతువులు, పక్షులు వాటి అరుపులు, దిక్కులు, రంగులు, రోజులు, నెలలు, ఆహారపదార్థాలు, పండ్లు, మనోభావాలు, పువ్వులు, అత్యుత్తమ భారతీయ భారతీయ గురువులు, గొప్ప పరిశోధకులు, తెలుగు కవులు, రవాణా వ్యవస్థ మొదలైన అంశాలన్నింటినీ ఇ లెర్నింగ్ ద్వారా పిల్లలకు అందుబాటులో పెట్టారు. వీటిని ఉచితంగా డౌన్లోడు చేసుకోవడానికి కుదరదు. కావాలంటే వాటి సి.డి.లను ఈ వెబ్ సైటులో ఉన్న ఆన్ లైన్ స్టోరు ద్వారా రప్పించుకోవచ్చు. ఇంకా దీనిలో లాలిపాటలు, ఆటలు, కథలు మొదలైనవన్నీ అందుబాటులో పెట్టారు. పిల్లలకు, తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు ఎంతో ఉపయోగకరమైన వెబ్సైటుగా దీన్ని అభివర్ణించవచ్చు. http://www. telugukidstories. com/ దీనిలో కూడా తెలుగు నేర్చుకోవడం, లాలిపాటలు, కథలు వంటి వాటిని అందిస్తున్నారు.

http://www. lalithagodavari. com/guNimtalu006. html పేరుతో ఉన్న వెబ్ లో అ నుండి అన్ని అక్షరాలను, గుణింతాలను పలికే విధానాన్ని శ్రవ్యరూపంలో అందిస్తున్నారు. గుణింతానికి సంబంధించిన అక్షరాలను తెరపై ఇచ్చి, ఆ అక్షరంపై క్లిక్ చేస్తే ఆ అక్షరానికి సంబంధించిన ఒక పదం వస్తుంది. ఉదాహరణకు క అనే అక్షరం పై క్లిక్ చేశామనుకోండి కథ అనే పదం వస్తుంది. అలాగే ఆ పదాన్ని ఎలా పలకాలో ఆడియో రూపంలో అందిస్తున్నారు. పిల్లలకు తెలుగు నేర్పడానికి ఈ వెబ్ సైటు ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

http://www. telugubidda. in/ ఇది పిల్లలకోసం రూపొందించిందని ప్రకటించకపోయినా దీనిలో వేమన, నీతి శతకాలను యూనికోడ్‌లో అంది తాత్పర్యసహితంగా అందిస్తున్నారు. అలాగే తెలుగు జాతీయాలు, సామెతలను

వివరిస్తున్నారు. ఇవి పిల్లలకు కూడా ఉపయోగపడే అంశాలే. వివిధ పత్రికలలో వచ్చిన తెలుగుకవుల, దేశభక్తులపై వ్యాసాలను దీనిలో పునర్ముద్రిస్తున్నారు. గురజాడ, కందుకూరి, విశ్వనాథ, జాషువ, సర్వేపల్లి, డా. భోగరాజు పట్టాభి సీతారామయ్య, దాశరథి, గిడుగురామమూర్తి, ప్రకాశం పంతులు తదితరుల గురించి వ్యాసాలున్నాయి. ఇటువంటి వెబ్సైట్లు మరికొన్ని ఉన్నాయి. ఇవన్నీ కేవలం పిల్లల కోసమే కాకపోయినా, పిల్లల సాహిత్యాన్ని ఎక్కువగానే అందిస్తున్నాయి. కింద అటువంటి వాటిని కొన్నింటినిచూడొచ్చు. http://www. maganti. org/newgen/index1. html

1. దీనిలో – పిల్లల కథలు – సాహిత్యము పిల్లల కథలు – ఆడియో పిల్లల పాటలు – ఆడియో పిల్లల పాటల సాహిత్యము సాహితీవేత్తలు శతక సాహిత్యము చాటు కవిత్వ భండారము సమస్య – పూరణ సాహిత్య భండారము అపూర్వ సాహిత్యము జానపద సాహిత్యము జానపద కళలు వీడియో జానపదం – ఆడియో జానపదులు – ప్రముఖులు చిత్రలేఖన విద్య – చిత్రాలు రంగస్థలనటులు – ఆడియో రంగస్థల ప్రముఖులు పండుగ పాటల సాహిత్యము వేదాంత పాటల సాహిత్యము లలిత సంగీత సాహిత్యము లలిత సంగీతం ఆడియో శాస్త్రీయ సంగీతము శాస్త్రీయ సంగీతం ఆడియో కీర్తనలు – కృతులు ప్రసార ప్రముఖులు ఆకాశవాణి – నాటికలు ఆకాశవాణి – పరిచయాలు ఆకాశవాణి – రూపకాలు ఆకాశవాణి – బాలలు ఆకాశవాణి – భక్తిరంజని ఆకాశవాణి – శాస్త్రీయసంగీతం ఆకాశవాణి – ఇతర ఆకాశవాణి – హరికథలు ఆకాశవాణి – జానపదం ఆకాశవాణి శ్రవ్యతరంగాలు స్తోత్రమాలిక పురాణాలు – ఆడియో హరికథలు – ఆడియో ఆలయములు వ్యాసావళి మీగడ తరకలు అక్షర చిత్రాలు సంస్థానములు ముఖాముఖి ఆడియో బుక్స్ రాష్ట్రపతులు ప్రముఖుల చిత్రాలు అదీ – ఇదీ మొదలైన శీర్షికలతో పిల్లలకు ఉపయోగపడే శీర్షికలు ఉన్నాయి.

## ప్రత్యేకించి పిల్లలకోసమే నిర్వహిస్తున్న బ్లాగులు

ప్రభవ: (2009) :http://prabhavabooks. blogspot. in/ ఇది 14, 2009 ప్రారంభమైంది. వేసవి సెలవులు, వివిధ పండుగ సెలవుల్లో పిల్లలకు కథలపోటీలు నిర్వహించి, ఆ వివరాలను ఈ బ్లాగులో పొందుపరుస్తున్నారు. పిల్లల్లో సృజనాత్మకతను పెంపొందించే కళల్ని, రచనల్ని ప్రోత్సహిస్తున్నారు. ఈనాటి పిల్లల అవసరాలకు అనుగుణమైన సాహిత్యాన్ని వారే సృజియించుకోగలిగితే..?

అన్న చిన్న ఆలోచన గట్టి నమ్మకమై, పిల్లల కలాలకు ఒక చిరునామా కావాలనే భావనతో ఈ ప్రభవ ను ప్రముఖరచయిత్రి చంద్రలత http://chandralata. blogspot. com/) నిర్వహిస్తున్నారు. దీనిలో కింది అంశాలు ఉన్నాయి.

పిల్లలకోసం కథలపోటీలు నిర్వహించి, వాటిని ఈ బ్లాగులో ప్రచురిస్తున్నారు. ఆ పోటీల్లో పాల్గొన్న వారి ఫోటోలను కూడా బ్లాగులో ప్రచురిస్తున్నారు. దేశభక్తుల జయంతులకు, వర్ధంతులకు వివిధ కార్యక్రమాలు నిర్వహించినప్పుడు వాటిని ఫోటోలు తీసి ప్రచురిస్తున్నారు. 5 నుండి 10 వతరగతి పిల్లలు రాసిన గేయాలు, కథలు ఈ బ్లాగులో ప్రచురిస్తున్నారు. గేయం, కథలకు తగిన చక్కని ఫోటోలను ప్రచురిస్తున్నారు. ప్రభవ పిల్లల పండుగ సందర్భంగా జే జే -2008 నిర్వహించిన పోటీలో ప్రథమ బహుమతి పొందిన డి. గురు ప్రసన్న (8 వ తరగతి. నెల్లూరు. 9-11-2008) మాఅత్తమ్మ అనే కథను ప్రచురించారు. దీనిలో అత్త ఆరళ్ళు భరించలేక ఆత్మహత్య చేసుకున్న ఒక యువతి కథను కరుణ రసభరితంగా వర్ణించింది. ఈ బ్లాగు తెలుగు, ఇంగ్లీషు రచనలను ప్రచురిస్తుంది. పిల్లల రచనలను, వారి ఫోటోలను, కొన్ని పుస్తకాలను పరిచయం చేస్తుంది. అత్యధికశాతం పిల్లల రచనలకు, వారి సృజనాత్మకతకు ప్రాధాన్యమినిస్తున్నారు.

బాల కథా మాలిక్ణ నెల్లూరు నుండి కైపు ఆదిశేషారెడ్డి అనే ఒకఉపాధ్యాయుడు నడుపుతున్న బ్లాగు http://audiseshareddy. blogspot. in/ దీనిలో బుజ్జాయి, బాలమిత్ర తదితర బాలల పత్రికల్లో తాను రాసిన కథలను స్కాన్ చేసి ప్రచురిస్తున్నారు. 2011వరకు మాత్రమే తన కథలను ప్రచురించారు. తర్వాత దీనిలో కొత్త రచనలు పోస్టు చేయడం లేదు.

http://balasahityam. blogspot. in/

http://sakhamurisreenivas. blogspot. in/

వీటిలో కొన్ని బాలల కథలు, పిల్లల్ని చైతన్యపరిచే కొన్ని వ్యాసాలు ఉన్నాయి.

http://chandamamatho. blogspot. in/

http://telugudanam-blog. blogspot. in/

ఇవి పిల్లల కోసం నడుపుతున్న బ్లాగులు కాకపోయినా, పిల్లలకు పనికొచ్చే అనేకాంశాలను వీటిలో ప్రచురిస్తున్నారు. ఉపాధ్యాయదినోత్సవంతో పాటు, పండుగల ప్రత్యేకతలను, వాటిపూర్వాపరాలను అందిస్తున్నారు. అలాగే పిల్లల గేయాలను, కథలను కూడా ప్రచురిస్తున్నారు. దేశభక్తిగీతాలు, జాతీయనాయకుల గురించీ

వివరిస్తున్నారు.

తెలుగులో విభక్తుల గురించి కథ రూపంలో చక్కగా రాశారు.

అది ఇలా ఉంది.

విభక్తులు

దశరథుడు అయోధ్య నగరాన్ని పాలించిన సూర్యవంశపు రాజు. ఆయనకు ఒక దిగులు పుట్టింది. అతనికి సంతానము లేదు. చివరకి ఆయన పుత్రకామేష్ఠి యాగం చేయగా, ఆ యాగ ఫలం చేత, రామ, లక్ష్మణ, భరత, శతృఘ్నులు పుట్టారు. వారి యందు రాముడు పెద్దవాడు. సంతానం కొఱకు తపించిన దశరథుడు తన పిల్లలను చూసుకొని ఆనందించేవాడు. పుత్రుల వలన వంశం నిలుస్తుంది. పుత్రుని కలిగినవాడి *కంటె* అదృష్టవంతులు లేరు అని ఆ కాలంలో అనుకునేవారు. పై వాక్యాలలో రంగు మారిన, గీత గీసిన పదాలను గమనించండి.

వాక్య నిర్మాణంలో వాటికెంతో ప్రాధాన్యత ఉంది. వాక్యములోని వేర్వేరు పదములకు అన్వయము కలిగించు ప్రత్యయములను, పదములను విభక్తులందురు. ఇవి రెండు పదముల మధ్య సంబంధము కలిగించును అని విభక్తికి సంబంధించిన అక్షరాన్ని ప్రత్యేకమైన కలర్ లో పెట్టారు. ఈ విభక్తులు ఎనిమిది. అవి:

http://amritaveena. wordpress. com/

ప్రత్యయాలువిభక్తి పేరు

డు, ము, వు, లుప్రథమా విభక్తి

నిన్, నున్, లన్, గూర్చి, గురించిద్వితీయా విభక్తి

చేతన్, చేన్, తోడన్, తోన్తృతీయా విభక్తి

కొఱకున్ (కొరకు), కైచతుర్థీ విభక్తి

వలనన్, కంటెన్, పట్టిపంచమీ విభక్తి

కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్షష్ఠీ విభక్తి

అందున్, నన్సప్తమీ విభక్తి

ఓ, ఓరీ, ఓయీ, ఓసీసంబోధనా ప్రథమా విభక్తి

దీనిలో కొన్ని పిల్లల గేయాలున్నాయి. తొక్కుపలుకులు గురించి ఇలా ప్రస్తావించారు. ఒక పదం చివర నొక్కి పునరక్తితో మరో పదం సృష్టించడం ద్వారా తొక్కు పలుకులు ఏర్పడతాయి. కొత్త పదాలు త్వరగా నేర్చుకోవడానికి, పలకడానికి తద్వార భాషా విజ్ఞానం పెంచుకోవడానికి ఇవి ఎంతగానో వినియోగిస్తాయి.

బాలసాహిత్యం (http://balasahityam. wordpress. com/) పేరుతో బ్లాగు రిజిస్టరై ఉంది. కానీ దీని పేరు మాత్రం తెలుగు మాటలు దీనిలో ఆడియో, వీడియోల రూపంలో కథలున్నాయి. కథను చదువుతుంటే ఏనిమేటెడ్ చిత్రాలు ఆ వీడియోలో వస్తుంటాయి. అలాగే ఆ దృశ్యానికి సంబంధించిన కథ తెరపై తెలుగు వాక్యాల్లో వస్తుంది. ఈ వీడియోలకి కదిలే బొమ్మలతో మాటలు అనే శీర్షికను పెట్టారు. ఈ వీడియోలన్నింటినీముందుగాయూట్యూబ్‌లో పెట్టి దాన్ని ఈ బ్లాగుల ద్వారా అందిస్తున్నారు. రామ గుమ్మడి, రత్న గుమ్మడి, చంచలామణి, పద్మలోచన అనే కథని ఆడియోలో పెట్టారు. దీనిలో నక్క దొంగబుద్ధితో కోడిపిల్లల్ని తినేయాలని ప్రయత్నిస్తే దాని నుండి తల్లి కోడి ఎలా రక్షించి, నక్కనెలా శిక్షించిందో చక్కని గొంతుతో రాగయుక్తంగా కథని వినిపించారు. కథని డౌన్ లోడ్ చేసుకొనే వీలుని కూడా కల్పించారు.

అంతర్జాలంలో పిల్లల కోసం తెలుగులో చాలా వెబ్సైట్స్, బ్లాగులు ఉన్నాయి. పిల్లలకు మంచి రచనలను అందించాలనే ఉత్సాహంతో చాలామంది వెబ్సైట్స్‌ని రూపొందిస్తున్నా, ఇన్ని వెబ్సైట్లు ఉన్నాయని తెలియక కొంతమందీ, తెలిసీ, అవి అసమగ్రంగా ఉన్నాయని భావించి మరికొంతమందీ పిల్లలకోసం కొన్ని వెబ్సైట్స్ ని రూపొందిస్తున్నారు. అందువల్ల చాలా విషయాలు పునర్ముద్రణ అవుతుంది. వీటితో పాటు చందమామ వంటి పత్రికలు సొంతంగా వెబ్సైట్లు పెట్టి పాత పత్రికలను కూడా అందిస్తున్నారు. అలాగే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు కూడా వివిధ సంస్థల ఆధ్వర్యంలో పాతపత్రికలన్నింటినీ డిజిటైజేషన్ చేయించి అందుబాటులోకి తీసుకొస్తున్నారు. మొత్తం మీద ఒక పదాన్ని గానీ, ఒక గేయాన్ని గానీ, కథ పేరుగానీ సెర్చ్ లో టైపు చేస్తే వెంటనే అందుబాటులోకి వచ్చే విధంగా అంతర్జాలంలో పిల్లల సాహిత్యం అందుబాటులోకి వస్తుంది. రాబోయే కాలంలో అంతర్జాలంలో పిల్లల సాహిత్యం మరింత అందుబాటులోకి వచ్చే అవకాశం ఉంది.

***(సెంట్రల్ ఇనిస్టిస్ట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్, మైసూరు వారి ఆర్థిక సహాయంతో తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం వారు నిర్వహించిన తెలుగులో బాలసాహిత్యం వివిధ ప్రక్రియలు అనే అంశంపై ది 03 -12-2012 నుండి 12-12-2012 వరకు జరిగిన వర్క్ షాప్ లో సమర్పించిన వ్యాసం)***

# గిడుగు రామమూర్తి భాష, సాహిత్యం, సామాజిక దృక్పథం

గిడుగు వేంకట రామమూర్తి పేరు చెప్పగానే తెలుగు వ్యావహారిక భాషోద్యమాన్ని నడిపిన వాళ్ళలో ఆయన ఒక ప్రముఖుడిగా, సవర భాషా సంస్కృతులపై విశేషమైన కృషి చేసిన వ్యక్తిగా గుర్తుకొస్తాడు. అయితే, ఆనాడు గ్రాంథిక భాష ప్రాచుర్యంలో ఉండగా వ్యావహారిక భాష కావాలని వాదించడంలో గల సామాజిక పరిస్థితులు, ఆయనపై చూపిన ప్రభావాలను గుర్తించాల్సి ఉంది. అలాగే ఆయన బ్రాహ్మణ కులంలో పుట్టి పెరిగినా, సవరల గురించి పరిశోధనలు కొనసాగించడంలో గల ఆంతర్యాన్నీ తెలుసుకోవాలనిపిస్తుంది. అసలు ఆయన ప్రాపంచిక దృక్పథం ఏమిటి? ఆయన భాషకే పరిమితమైయ్యారా? లేక సృజనాత్మక సాహిత్యం కూడా రాశారా? సాహిత్యం పట్ల ఆయన అభిప్రాయలేమిటి? ఆయన రాసిన సాహిత్యంలో కనిపించే సమాజం ఎవరిది? మొదలైన ప్రశ్నలకు కొన్ని సమాధానాల్ని అన్వేషించేదిశగా ఈ పత్రం కొనసాగుతోంది.

## గిడుగు జీవితం – దృక్పథం:

గిడుగు రామమూర్తిగారి కొడుకు (గిడుగు సీతాపతి) రాసుకున్న స్వీయ చరిత్ర (1962), ఆయనే రాసిన *గతకాలపు స్మృతులు* వ్యాసం (1964), *గిడుగు వారి స్మారక సంచిక (1940), భారతి,* కృష్ణాపత్రిక తదితర పత్రికల్లో వచ్చిన వ్యాసాలు, సవర భాషపైనా, వ్యావహారిక వాదాల సందర్భంగా రాసిన వ్యాసాలు, వీటిపైనే ఆధారపడి ఇతరులు రాసిన మరికొన్ని వ్యాసాలు, ఉత్తరాలు, చేకూరి రామారావు, నడుపల్లి శ్రీరామరాజులు సంకలనం చేసి సంపాదకత్వం వహించి డెట్రాయిట్ తెలుగు లిటరరీ క్లబ్ (2005) ప్రచురించిన *మరోసారి గిడుగు రామమూరి (వ్యాసాలు, లేఖలు)* పుస్తకం ప్రధానంగా గిడుగు వారి జీవితాన్ని, ఆయన దృక్పథాన్ని

తెలుసుకోవడానికి ఆధారాలుగా కనిపిస్తున్నాయి. గిడుగు రామమూర్తి గారి పూర్వీకులు నేటి తూర్పు గోదావరి జిల్లా అమలాపురం దగ్గర్లోని ఇందుపల్లి వాస్తవ్యులు. తర్వాత కాలంలో విజయనగరం దగ్గర్లోని పర్వతాల పేటకు వలస వెళ్ళారు. అక్కడే వెంకమ్మ, వీర్రాజులకు ఆగస్టు 29, 1863లో రామమూర్తి జన్మించారు[1] నేటికీ ఇందుపల్లి ప్రాంతంలో వీరి కొబ్బరితోటలు ఉన్నాయని రామమూర్తిగారి కొడుకు సీతాపతి ఒక వ్యాసంలో ప్రకటించారు[2]. ఆయన పుట్టి పెరిగింది బ్రాహ్మణ కుటుంబంలోనే. అంతేకాకుండా ఆయనకు దైవం పట్ల నమ్మకం ఉందని వీరేశలింగంగారికి రాసిన లేఖను బట్టి తెలుస్తుంది[3]. కాబట్టి భావవాదమే ఆయన ప్రాపంచిక దృక్పథమైనా భాషా వ్యవహారంలో మాత్రం సామాజిక వాస్తవాన్ని గుర్తించగలిగిన వ్యక్తిగా కనిపిస్తున్నారు. ఎందుకంటే, ఉద్యోగరీత్యా సవరలు అధికంగా నివసించే పర్లాకిమిడి ప్రాంతంలో తన జీవితాన్ని చాలాభాగం గడిపారు. ఆ అవసరాలు, అప్పటికే సంస్కరణవాది అయిన గురజాడ అప్పారావుగారితో పరిచయం ఉండటం వంటివన్నీ భాష పట్ల ఆయనకు ఒక సామాజిక దృక్పథాన్ని కలిగించి ఉండొచ్చు. ప్రాచీన కావ్యాల్లో కూడా వ్యావహారిక భాషను చూపించే ప్రయత్నం చేసి, ప్రజల వాడుకలో ఉంటేనే భాష నిలుస్తుందనేది ఆయన వాదం. మనం మాట్లాడుకునే భాషలోనే రచనలు కూడా వస్తే బాగుంటుందనీ, ఎక్కువమందికి విజ్ఞానం అందుబాటులోకి వస్తుందనేది ఆయన ఆశయం. అందుకోసం ఆయన చాలా ప్రయత్నాలు చేశారు. ఆ ప్రయత్నాలను అతిశయోక్తితో పొగిడేసినవాళ్ళున్నారు. ''*గిడుగు రామమూర్తి వ్యావహారిక భాషావాదం లేవనెత్తడంతో తెలుగు కావ్యభాషాస్వరూపం మారిపోయింది*'' అని శ్రీశ్రీ అన్నారు[4]. నిజానికి గిడుగు వారు వ్యావహారిక భాషావాదానికి కృషి చేసినా, ఆయన జీవించిన కాలంలోనే అది సంపూర్ణంగా విజయవంతం కాలేదు. ఆ విషయాన్ని గిడుగు వారే స్వయంగా చెప్పుకున్నారు కూడా. కానీ, ఆ ప్రయత్నాలు తర్వాత కాలంలో విజయవంతం కావడానికి తోడ్పడ్డాయనుకోవచ్చు. ఇవన్నీ పరిశీలించినప్పుడు ఆధునిక వ్యావహారిక భాషను పరీక్షల్లో రాయగలిగే అవకాశం ఉంటే సామాన్య, మధ్యతరగతి వారికి కూడా విద్యావకాశాలకు అవకాశం కలుగుతుందనేది భాషా వ్యవహారానికి సంబంధించిన ఆయన దృక్పథమని గుర్తించవచ్చు.

సవరలను అత్యంత దగ్గరగా పరిశీలించడంతో వారి గురించి లోకానికి తాను గమనించిన వాస్తవాల్ని తెలపాలనే జిజ్ఞాసే ఆయనను సవరలపై పరిశోధనకు

పురిగొల్పి ఉంటుంది. అయితే, సవరలపై పరిశోధన చేయడానికి ఆయనకున్న మానవతాదృష్టే ప్రధానకారణంగా చేకూరి రామారావు వ్యాఖ్యానించారు[5]. సవర భాష నేర్చుకుంటేనే, వారితో బాగా కలిసిపోవచ్చు అనుకున్నారు[6]. ''*హరిజనోద్ధరణ జరగడానికి 40 సంవత్సరాల ముందే 1894 ప్రాంతంలోనే గిరిజనులైన సవరలు (శబరులు) వాళ్ళలో మళ్ళీ అంటరానివాళ్ళని తన ఇంటి దగ్గర పెట్టుకొని, దగ్గరగా కూర్చొని సవరభాష నేర్చుకున్నారు*''అని సంస్కర్తగా గిడుగువారిని అడపా రామకృష్ణారావు అంచనా వేశారు[7]. ఇవన్నీ పరిశీలించినప్పుడు గిడుగు రామమూర్తి అగ్రస్థానంలో సామాజిక గౌరవానికి నోచుకున్న వర్గం నుండి వచ్చినప్పటికీ, తన జీవితావసరాల రీత్యా సమాజంలో అట్టడుగు వర్గాల వారితో జీవించాల్సిన పరిస్థితుల్లో ఆయన జీవిత దృక్పథంలో మార్పు వచ్చిందని అనుకోవచ్చు. అదే ఆయన భాషాదృక్పథాన్నీ ప్రభావితం చేసి ఉంటుంది. "*పేదవాళ్ళకి, పసిపిల్లలకు, స్త్రీలకు వాళ్ళకు అర్థమైన భాషలో విజ్ఞాన బోధ రామమూర్తిగారికి వ్యావహారిక భాషా వాదానికి లక్ష్యం. అదే ఆయన జీవితాశయం*" ఆయన భాషా దృక్పథం ప్రధానంగా A memorandum on Modern Telugu (1913) లో కనిపిస్తుంది. గురజాడ వారు మద్రాసు విశ్వవిద్యాలయం వారికి సమర్పించిన డిసెంటు పత్రం (అసమ్మతి పత్రం)లో ఉన్నటు వంటి వాదనే గిడుగు వారి వాదనలోనూ కనిపిస్తుందని భాషావేత్తల అభిప్రాయం[8]

## సాహిత్య దృక్పథం:

కవిత్రయమహాభారతం అంటే గిడుగు వారికి చాలా ఇష్టం. కథలు కూడా చదివే వారు. వాటి గురించి నిర్మొహమాటంగా మాట్లాడేవారు. ఈసఫ్ కథలను సవరభాషలోకి అనువాదం చేశారు[9]. 1919లో "తెలుగు" పత్రికను స్థాపించి, కేవలం భాషకు సంబంధించినవే కాకుండా సృజనాత్మక సాహిత్యానికి కూడా ప్రాధాన్యాన్నిచ్చేవారు. గ్రాంథిక వాదుల ఆక్షేపణలను తిప్పికొట్టాలని ఈ పత్రికను నడిపారు. 1914లో "నిజమైన సంప్రదాయం" పేరుతో చిన్న పుస్తకాన్ని రాశారు. 'వచన సాహిత్యం వ్యావహారిక భాషలో రాయడమే నిజమైన సంప్రదాయం'అని వాదించడమే ఈ రచన లక్ష్యం. 1932లో 'అప్పకవీయ విమర్శనము' తాళపత్రకావ్యాలను పరిశీలించి రాసిన గ్రంథాన్ని బట్టి సాహిత్యాధ్యయనం విస్తృతంగానే చేసేవారని తెలుస్తుంది. చిన్నయసూరి 'నీతిచంద్రిక' రెండవ ముద్రణను

రామమూర్తిగారే ప్రచురించడం వల్ల సాహిత్యం ద్వారా భాషావ్యాప్తి కలుగుతుందని భావించారు. 'ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజం' 'బాల కవిశరణ్యం' పుస్తకాల్లోని భావాలను ముందుగా "తెలుగు" పత్రికలోనే ప్రచురించారు. ''వ్యావహారిక భాషలో *వ్రాసినపుడు కావ్యమెంత రసవంతంగా వుంటుందో నీకు అనుభవం మీద కాని తెలియదు. ఏదీ నీ కలాన్ని ఒక్కసారి అటువైపు తిప్పు"* అని పర్లాకిమిడి పాఠశాలలో పనిచేసేటప్పుడు యల్లాపంతుల జగన్నాథం గారితో చెప్పడం వంటివన్నీ చూస్తే, సాహిత్యం వ్యాప్తికి కూడా వ్యావహారిక భాషను ఒక సాధనంగా వాడుకున్నారని తెలుస్తుంది. ఆ తర్వాత జగన్నాథం రాసిన " గాదెల గండడు" అనే బొబ్బిలిపాట వరుసలో రాసిన గేయప్రబంధానికి 'పీఠిక' కూడా రాశారు. "ముఖలింగ క్షేత్రమాహాత్మ్యం" కావ్యం ఆధారంగాను, శాసనాల ఆధారంగాను 'ముఖలింగనగర ప్రాచీనత'ను గుర్తించారు. ముఖలింగక్షేత్రం' 'బెనారస్' లాంటిదని క్షేత్రమాహాత్మ్యం వర్ణించిందని, ఆ ఆధారంతో పరిశోధించి, దీన్నే ప్రాచీనకాలంలో "జయంతి పురం" అని పిలిచేవారని నిరూపించారు. నేటి తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం దగ్గర్లోని కొంకుదురు గ్రామంలో కొన్ని శాసనాలు దొరికాయి. దానిలో ఒకటి కొంకుదురు శాసనం. అది 1887 లో దొరికింది. దాన్ని మద్రాసు మ్యూజియంలో భద్రపరిచారు. వాటిని పరిష్కరించడానికి రామమూర్తిగారికి పంపితే, దానిలో పేర్కొన్న అంశాలను శ్రీనాథుని "భీమఖండం" ఆధారంగా పరిశీలించారు. అందులోని అంశాలు అమలాపురం దగ్గర్లోని వెదిరేశ్వరం, పలివెల, ముమ్మిడివరం అనే గ్రామాలకు చెందినవని గుర్తించారు. నాటి సామాజిక స్థితినీ, దానవిశేషాల్ని కావ్యవిశేషాలతో పోల్చి చెప్పారు. సవరలకు సంబంధించిన "సవరపాటలు" సేకరించారు. దీనిలో 32 పాటలున్నాయి. వాటిలో 30 పాటల్ని సేకరించారు. 20 స్వయంగా రాశారు[10]. సవరల పాటల సేకరణకు చాలా కష్టడ్డారు. వాళ్ళ సంస్కృతిని రక్షించే ప్రయత్నం చేశారంటే, కింది వర్గాల సంస్కృతి పట్ల ఆయనకున్న గౌరవం వ్యక్తమవుతుంది. సవరలపై పరిశోధన చేయాలనుకోవడమే ఆయన సామాజిక దృక్పథాన్ని తెలుపుతుంది. ఆయన రాయాల్సిన విషయాలన్నీ ఆయన కుమారుడు సీతాపతి వ్యాసంగా రాశారు. సవరలను నేడు గిరిజనులుగా గుర్తిస్తున్నారు. వారి గురించి ఐతరేయబ్రాహ్మణం నుండి అనేక కావ్యాల్లో పేర్కొన్న అంశాలను, సమాజంలో ఉన్న వాస్తవస్థితిగతుల్ని వివరిస్తూ గొప్ప పరిశోధన చేశారు. సవరలు గంజాం, విశాఖజిల్లాల్లోను, ఒరిస్సా, బెంగాల్, సంబల్ పూర్ మొదలైన ప్రాంతాల్లో ఉండేవారని

పేర్కొన్నారు. మహాభారతం, శాంతిపర్వంలో వీరి ప్రస్తావన కనిపిస్తుంది. విశ్వామిత్రుడు శపించిన వారిలో ఒకరిగా పేర్కొన్నారు. రామాయణంలో శబరి నేటి సవరలకు సంబంధించిందే అన్నారు. భారతం, హరివంశం మొదలైన కావ్యాల్లో వీరి గురించి ఉన్న విషయాల్ని పేర్కొన్నారు. యజ్ఞంలో నరబలి ఉండేదట. రామాయణం (బాల 62 సర్గ) లో... అంబరీషుడు యజ్ఞం చేయడం- పశువు పారిపోవడం, దాన్ని వెతుక్కొంటూ రుచీకుడనే మునిదగ్గరకు వెళతాడు. యజ్ఞ పశువుగా రుచీకుని రెండవ కొడుకుని కొనడం, అప్పుడు ఆ రుచీకుడు విశ్వామిత్రుడి దగ్గరకు వెళ్ళి శరణు కోరతాడు. విశ్వామిత్రుడు తన కొడుకుల్ని యజ్ఞ పశువులుగా వెళ్ళమంటే వాళ్ళు నిరాకరించడం, అప్పుడు శపించడం వంటివన్నీ సవరులను ఆర్యులుగా తెలిపే కథనాలు. శబరులు వేటలో ప్రవీణులనీ, స్వతంత్రజీవనాన్ని కొనసాగించారని తెలిపారు. ఇలా అనేక అంశాలను పరిశోధించారు. మొత్తం మీద కింది వర్గాల పట్ల, వారి సంస్కృతి-చరిత్రల పట్ల గౌరవభావాన్ని ప్రకటించిన విశిష్ట వ్యక్తిత్వం గిడుగు వారిదని సవరలపై ఆయన చేసిన మొత్తం పరిశోధన కృషి తెలుపుతుంది. వ్యావహారిక భాషోద్యమంలో ఆయన చేసిన వాదాలు, ఉద్యమాలు భాషలోని శక్తిని అందరికీ అందేలా చేసిన ప్రయత్నంగా స్పష్టమవుతుంది. ఇవన్నీ ఆయన సామాజిక దృక్పథాన్నీ తెలియజేస్తున్నాయి.

**సూచికలు:**

1 గిడుగు రామమూర్తి పుట్టిన తేదీ విషయంలో వివాదాలు ఉన్నాయి. 1862లో పుట్టినట్లు ఆరుద్ర (శాసన పరిశోధకుడుగా గిడుగు-గురజాడ' (వ్యాసం)లో చెప్పగాజి. వి. రామమూర్తి 1863 ఆగస్టు 29 అని రాశారు. గిడుగు సీతాపతి ఒకచోట1862 గాను, మరో చోట 1863గానూ పేర్కొన్నారు. వీటన్నింటినీ పరిశీలించి ఆగస్టు 29, 1863 అని గిడుగు రామమూర్తి జీవితం-రచనలపై పరిశోధనచేసిన డా. దాశరథుల నర్సయ్య (2009: 2) నిరూపించారు.

2 సీతాపతి, గిడుగు. 'రామమూర్తి పంతులుగారి జీవిత చరిత్రలోని చిత్ర విచిత్రఘట్టాలు' (వ్యాసం), మరోసారి గిడుగు రామమూర్తి, సంపాదకులు: చేకూరిరామారావు, నడుపల్లి శ్రీరామరాజు, డెట్రాయిట్ తెలుగు లిటరరీ క్లబ్ బ్లూమ్‌ఫీల్డ్ హిల్స్, మిచిగన్ ప్రచురణ: 2005 : 2

3 వీరేశలింగంగారికి 10-4-1917లో రాసిన లేఖలో '' తమకు

పరమేశ్వరుడాయుస్సుఆరోగ్యముతో కూడా ఇచ్చుగాక అని త్రికరణశుద్ధిగా నేను ప్రార్థించుచున్నాను" అని గిడుగు వారు కోరుకున్నారు.

4 చిలుకూరి నారాయణరావు "నాగురువుగారు" (వ్యాసం, ప్రతిభ, సంపుటి, 41940)లో "ప్రభుత్వ విద్యాశాఖలలోను, యూనివర్సిటీలలోను ఆయన ఉద్దేశముసరిగా కొనసాగడానికి ఆయన జీవిత కాలములో అవకాశము చిక్కలేదు" అనిరాశారు.

5 రామారావు, చేకూరి. ''రామమూర్తిగారు వ్యావహారిక భాషావాది ఎందుకయ్యారు?" (వ్యాసం), మరోసారి గిడుగు రామమూర్తి, పుట: 103.

6 నర్సయ్య, డి. గిడుగు రామమూర్తి జీవితం-రచనలు, పుట: 12

7 రామకృష్ణారావు, అడపా. "సంఘసంస్కర్తగా గిడుగు" పుట:112

8 దక్షిణామూర్తి, పోరంకి. "గిడుగు మెమొరాండం: గురజాడ డిసెంటు పత్రం" (వ్యాసం), మరోసారి గిడుగు రామమూర్తి, పుటలు: 129, 133.

9 నర్సయ్య, డి. గిడుగు రామమూర్తి జీవితం-రచనలు, పుట: 15

10 పైదే:. పు: 63

# విమర్శకుడిగా కొలకలూరి ఇనాక్

సృజనాత్మక రచయితల కలం నుండి విమర్శ వెలువడ్డం, విమర్శకుల కలం నుండి సృజనాత్మక రచనలు వెలువడ్డం తెలుగుసాహిత్యంలో కొత్తేమీ కాదు. కొంతమంది ఈ రెండింటిలోను చక్కని ప్రతిభను ప్రదర్శించిన వాళ్ళున్నారు. ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు కూడా ఈ రెండింటిలోను రచనలు చేసి, సృజనలోను, విమర్శలోను తనదైన ముద్రను సంపాదించుకున్నారు. ఈ పత్రంలో ఇనాక్‌గారి విమర్శను విశ్లేషించే ప్రయత్నం చేస్తాను. ఇప్పటికే చాలామంది విమర్శకుడిగా ఆచార్య కొలకలూరి ఇనాక్ గారి కృషిని చాలావరకు విశ్లేషించారు. వారి కృషిని గుర్తిస్తూనే నాదైన దృక్పథంతో వివరించే ప్రయత్నం చేయాలనుకుంటున్నాను.

విమర్శకుడిగా ఆచార్య ఇనాక్‌గారి గురించి చెప్పాలంటే ఎవరైనా ఈయన రాసిన ముఖ్యమైన సిద్ధాంత గ్రంథాలు అభివర్ణించదగినవిగా ఈ మూడింటిని వెంటనే చెప్తారు. అవి: *ఆధునిక సాహిత్య విమర్శసూత్రం* (1996), *శూద్రకవి శుభమూర్తి వసుచరిత్ర వైశిష్ట్యం*(1996), *జానపదుల సాహిత్య విమర్శ* (2010). వీటితో పాటు ఈయన పరిశోధన గ్రంథం *తెలుగు వ్యాస పరిణామం(1980)* కూడా మరికొంతమంది ప్రస్తావిస్తుంటారు. కానీ, సృజనరంగంలో కథలు, నవలలు, నాటకాలు రాసినట్లే ఈయన సాహిత్యవిమర్శ కృషికూడా కొనసాగింది. ఈయన సృజనరచనల ప్రాచుర్యానికిచ్చిన ప్రాధాన్యం విమర్శకు పెద్దగా ఇవ్వలేదోమోననీ అనిపిస్తుంది. కానీ, ఈయన వివిధ కలంపేర్లతోను, ప్రత్యక్షంగా తనపేరుతోను రాసిన విమర్శరచనలను ఒకచోటికి చేర్చి చూస్తే సాహితీవేత్తలు అబ్బురపాటుకి గురవుతారు. ఆయనలో దాగిఉన్న విమర్శకుడు, పరిశోధకుడు, సిద్ధాంతకర్త, దార్శనికుడు మనల్ని సంభ్రమాశ్చర్యాలకు గురిచేస్తాడు. కొందర్ని ఆనందపరుస్తాడు. మరికొందర్ని భయపెడతాడు. దళితులు, బహుజనులు, సామాజిక ప్రగతిని

ఆకాంక్షించేవాళ్ళు ఎంతగానో సంతోషిస్తారు. సమాజం ఆధిపత్యాల, పీడనల సంఘర్షణలతోను కొనసాగాలనుకునేవారికి ఆందోళనను కలిగిస్తాడు. సాహిత్యానికీ, కళకీ గల ప్రయోజనాన్ని స్పష్టంగా విశదీకరిస్తాడు. గతంలో చాలామంది ఇనాక్‌గారి విమర్శకదృష్టిని ప్రస్తావించారు. కనుక, పునరావృత్తికి పోకుండా ముఖ్యాంశాలను వివరించుకొంటూ, విమర్శకుడిగా ఇనాక్‌గార్ని ఎలా అర్థం చేసుకోవాలో నాకు అర్థమైన రీతిలో వివరించేప్రయత్నం చేస్తాను.

ముందుగా, ఇనాక్ గారు రాసిన విమర్శరచనలను పరిచయం చేసుకుందాం. *తెలుగువ్యాసాలు* (1974), *సాహిత్యదర్శిని(1984), సమీక్షణం (1987)* లతో పాటు ఆయన చేసిన పరిశోధనలు కూడా విమర్శకుడిగా ఇనాక్‌గారి దృక్పథాన్ని వివరిస్తాయి. *ఆధునిక సాహిత్యంలో స్త్రీ (1975), ఆధునిక సాహిత్యంలో హరిజనులు (1976), తెలుగులో పునరుక్తి (1977), వైరిసమాసం(1978), కావ్యప్రయోజనం (1979-81), తెలుగుసాహిత్యంలో ముస్లిములు (1979-81), జస్టీస్ పార్టీ ఉద్యమం-సాహిత్యం (1982), అంబేద్కర్ జీవితం,లక్ష్యం (1985), నవయుగకవిచక్రవర్తి(1988). తెలుగు నవల తీరుతెన్నులు (1990), ఆధునిక కవిత్వం సామాజిక సంబంధాలు(1992), దళితసాహిత్యం అధ్యయన ఆవశ్యకత (1993-95), దండోర-సామాజిక దృష్టి (1996).* ఇవన్నీ ఈయన ప్రాజెక్టులుగా చేసిన కొన్ని పరిశోధనాంశాలు. వీటిని పరిశోధన చేయాలనుకోవడంలోనే ఒక దార్శనికత కనిపిస్తుంది. ఈయన విమర్శదృక్పథం కూడా తెలుస్తుంది. సమాజపరిణామంతో పయనించిన విమర్శ పరిణామం గోచరిస్తుంది. అన్నింటినీ మించి సాహిత్యానికున్న ప్రయోజనాన్ని వివరించాలనే ఆకాంక్ష వెల్లడవుతుంది. ఈయన ఇటీవల తాను గతంలో రాసిన వ్యాసాలు, సమీక్షలు పుస్తకాలుగా బయటకు తీసుకొస్తున్నారు. ఇవన్నీ ఈయన సాహిత్య విమర్శకున్న విస్తృతి బయటకొస్తుంది. వీటిని ఇక్కడున్న పరిధి, పరిమితులను దృష్ట్యా పరిచయం చేసుకుందాం.

### సాహిత్య సమీక్ష (2013) :

దీనిలో 1964 నుండి 1978 మధ్యకాలంలో వివిధ పత్రికల్లో కొలకలూరి, కె.ఇనాక్, మనోరాణి, రవి, జ్యోతి మొదలైన కలం పేర్లతో సమీక్షలు చేసిన వ్యాసాలున్నాయి. ఇవి కవిత్వం, కథానిక, నవల, నాటకం, వ్యాసం, అనువాదం ప్రక్రియలకు చెందినవి. ఈ సమీక్షలన్నీ ఇనాక్‌గారి విమర్శదృక్పథాన్ని, ప్రక్రియా

దృష్టినీ వివిధ విమర్శ పరిణామాల్ని అవగాహన చేసుకోవడానికి సహకరిస్తాయి. ఇనాక్‌గారు 1967 నవంబరు భారతిలో 'మనోరాణి' పేరుతో సినారె పుస్తకంపై ఒక సమీక్షరాశారు. నెహ్రూ జీవితాన్ని సినారె 'జాతిరత్నం' పేరుతో కావ్యంగా రాశారు. దీనిలో కథానికా విధానం ఉందనీ, కావ్యాన్ని చదివిన వారికి నిరాశ కలగకపోవచ్చుగానీ, అత్యంతానందం మాత్రం కలగదనీ (పుట:12) అని తన నిర్ణయాన్ని ప్రకటించారు. 'రవి' అనే కలంపేరుతో బోయిభీమన్నగారి 'అకాండతాండవం' కావ్యాన్ని లాక్షణిక దృష్టితో విమర్శించారు. ఇలా ఒక్కో ప్రక్రియకు, ఆ ప్రక్రియానుగుణ విమర్శను చేశారు.

### పత్రత్రయి (2013) :

*'పరిశోధన, విమర్శరంగాలలో నేటికీ కూడా మారని అభిప్రాయాలు ఈ వ్యాసాల్లో ఉండటం వల్ల'* వీటిని ఒకచోటకి చేర్చి ప్రచురిస్తున్నట్లు ఇనాక్‌గారు ఈ గ్రంథానికి రాసుకున్న తన ముందుమాటలో పేర్కొన్నారు. దీనిలో మూడు వ్యాసాలు ఉన్నాయి. తెలుగులో జానపద సాహిత్య పరిశోధనం (1842-1982), తెలుగు వ్యాసపరిణామం (1947-1972), సాహిత్య విమర్శనం (1966-1976) అనేవి ఈ మూడు వ్యాసాలు. ఒకటి తన పిహెచ్.డి., సిద్ధాంతగ్రంథానికి సంబంధించింది. మిగతావన్నీ జానపద, విమర్శల పరిణామాల్ని వివరించే వ్యాసాలు. ఒక విహంగవీక్షణంగా ఈ వ్యాసాలు కొనసాగించినప్పటికీ. సాహిత్యవిమర్శ, పరిశోధన పరిణామాల్ని, వికాసాన్ని గుర్తించడానికి ఆకరాలుగా గుర్తించదగిన వ్యాసాలుగా చెప్పవచ్చు. కొండల్ని అద్దంలో చూపిన రీతిలో ఈ వ్యాసాలన్నీ కనిపిస్తాయి.

### సాహిత్య పరామర్శ (2013) :

ఇందులో 24 మంది రచయితలు ప్రచురించుకున్న పరిశోధనలు, విమర్శ గ్రంథాలకు రాసిన ఇనాక్ గారు రాసిన అభిప్రాయాలు, ముందుమాటలున్నాయి. తెలుగు సాహిత్యంలో ప్రతిఫలిస్తున్న సంస్కృతికి సంబంధించిన అనేక నూతన ఆలోచనలు ఉన్నాయి.

### సాహితీపరిచయం (2013) :

కవిత్వంపై ఇనాక్‌గారి అభిప్రాయాల్ని ప్రతిఫలించే గ్రంథంగా కనిపిస్తున్నా,

కవుల్ని ప్రోత్సహించే ఇనాక్ గారి సహృదయతత్త్వం దీనిలో అత్యధికంగా కనిపిస్తుంది. సుమారు 24 మంది కవుల కవితా సంపుటాలకు ఇనాక్‌గారు రాసిన అభిప్రాయాల మాలిక.

### తెలుగు వెలుగులు (2013) :

వివిధ సందర్భాల్లో ప్రముఖ కవులు, రచయితలు, సాహిత్యపరిణామాలపై చేసిన ప్రసంగాలు, పరిశోధన పత్రాల సంపుటి ఈ గ్రంథం. భాష, సాహిత్యంపై ఈ వ్యాసాలు దృష్టి కేంద్రీకరించినప్పటికీ, మునివాహనుడు నాటకంలోని 'కథ వెనుక కథ' అందరూ చదివి తీరాల్సిన వ్యాసం. అలాగే మాలవాంఁడ్రపాట, వలసరచయితల గురించి రాసిన వ్యాసాల్లో నూతన ప్రతిపాదనలు కనిపిస్తున్నాయి. కానీ, 'మాలమాంఁడ్ర పాట'లో హైందవ తాత్త్వికతను దళితుల్లో స్లోపాయిజన్‌గా ఎక్కించే గుణాన్ని కూడా విస్మరించకూడదు. అంతేకాకుండా 'మాలవాంఁడ్రపాట' కర్తృత్వంపై అనేక సందేహాలున్నాయి. కానీ, దాన్ని రాసిన కవి దళితుడేనని ఇనాక్ గారు అంటున్నారు. ఇక్కడ ఒకటి ఆలోచించాలి. నాటి కాంగ్రేస్ పార్టీ చాలా వ్యూహాత్మకంగా హరిజనులను కలుపుకుపోవాలని గాంధీ పిలుపుతో ముందుకొచ్చింది. అంబేద్కర్ నాయకత్వాన్ని విశ్వసిస్తున్న దళితుల్ని తమపార్టీ వైపు ఆకర్షించుకోవడానికి అనేక ప్రయత్నాల్ని చేసింది. అందుకనే బ్రాహ్మణకవులు, కథారచయితలు కూడా హరిజన సమస్యపై రాసేవారు. మాలవాంఁడ్రపాట భారతి పత్రికలో వచ్చింది. ఆ పత్రిక నిర్వాహకుడు కాంగ్రెసు నాయకుడు. కాబట్టి హరిజనులను కాంగ్రేసువైపుకి తిప్పడానికి సాహిత్యాన్ని కూడా ఒక సాధనంగా ఉపయోగించుకున్నారు. ఏది ఏమైనా మాలవాంఁడ్రపాట కర్తృత్వాన్ని పరిశోధన చేయాల్సి అవసరం ఉంది.

### తెలుగు నవల (2013) :

తెలుగు నవలల గురించి ఇంతవరకు వచ్చిన విమర్శగ్రంథాలకంటే ఇది భిన్నంగా ఉంది. తొలితెలుగు నవలగా నరహరిగోపాలకృష్ణమచెట్టి రాసిన *శ్రీరంగరాజ చరిత్రము* (1872)ను గుర్తించారు. ఉన్నవ వారి 'మాలపల్లి'ని, విశ్వనాథ సాహిత్య దృక్పథాన్ని ఇనాక్‌గారు విశ్లేషించిన తీరు నూతన విమర్శ ద్వారాల్ని తెరుస్తుంది. ఇంతవరకు వచ్చిన విమర్శల మూసధోరణిలో కాకుండా మాలపల్లి నవలను ప్రత్యేకంగా విశ్లేషించారు. జస్టిస్ పార్టీ, దాన్ని ప్రచారం చేసేవాళ్ళ నుండి

మాల,మాదిగలను దూరం చేయడానికి జరిగిన కుట్రగా, బ్రాహ్మణాధిపత్యాన్ని కొనసాగించడానికి, కాంగ్రెస్ పార్టీని కాపాడ్డానికి ఉన్నవవారు వ్యక్తిగా ఉంటూనే ఒక వ్యవస్థ చేసిన పనిగా విశ్లేషించారు. మాలపల్లి అని పేరు పెట్టినంత మాత్రాన దానిలో మాలమాదిగలను ఉన్నతీకరించిన స్థితిలేదనీ, దాన్ని గమనించాలనీ సూచించారు.

విశ్వనాథ సత్యనారాయణను గొప్పసాహిత్యశిల్పమర్మజ్ఞుడుగా ప్రసంశిస్తూనే, వస్తుపరంగా సంప్రదాయాన్ని పునరుద్ధరించాలనే తపనను కనబరిచారనీ వ్యాఖ్యానించారు. కొడవటిగంటి కుటుంబరావునీ, గోపీచంద్ సాహిత్యతత్త్వాన్ని కూడా చాలా లోతుగా వివరించారు. స్త్రీ ఆర్థిక స్వయంప్రతిపత్తి అవసరాన్ని కుటుంబరావు ప్రోత్సాహించారన్నారు. అబ్రాహ్మణ స్త్రీ పాత్రల్ని, ఆర్థికదృష్టినీ గోపీచంద్ రచనల్లో కనిపిస్తుందనీ వివరించారు. చలంతో పాటు మిగతా వాళ్ళని అంచెనావేయడంలో నవలాసాహిత్య క్రమ పరిణామాన్ని అవగాహన చేసుకునే తీరుని సూచించారు. కందుకూరి వీరేశలింగం తన పేరు చివరనున్న 'పంతులు' అనే కులసూచికను విసర్జించిన తర్వాత చాలా మంది ఆయన్ని 'కందుకూరి వీరేశలింగం' అనే రాస్తుంటారు. కానీ, ఇనాక్‌గారు మాత్రం 'కందుకూరి వీరేశలింగంపంతులు' అనే రాస్తున్నారు. కందుకూరి రాసిన *శ్రీరాజశేఖరచరిత్రము (1878), వికార్ ఆఫ్ ది వేక్ ఫీల్డ్* నవలకు అనుసరణ అనీ, దానిలో తెలుగుతనాన్ని నింపారనీ చెప్పారు. కానీ, లంబాడీ జీవితేతివృత్తాన్ని '*శ్రీరంగరాజచరిత్రము*'లో వర్ణించడం వల్లనే అది తొలితెలుగు నవలగా గుర్తిస్తున్నారేమో అని ఇనాక్‌గారి విమర్శదృక్పథాన్ని బట్టి అనిపిస్తుంది.

## తెలుగు కథానిక (2013) :

ఇవిప్రధానంగా ప్రసంగవ్యాసాలు. అనుబంధంలో తెలుగు కథానిక పుట్టుపూర్వోత్తరాలను ప్రస్తావిస్తూనే, కథానికా శిల్పాన్ని వివరించారు. తొలి తెలుగు కథానికగా బండారు అచ్చమాంబ రాసిన '*ధనత్రయోదశి' (1903)*ని గుర్తిస్తున్నట్లు మొదట్లో చెప్పినా, అనుబంధంలో మళ్ళీ గురజాడ 'దిద్దుబాటు' (1910)ని సమర్థిస్తున్నట్లు అనిపిస్తుంది. కానీ, ఈ అనుబంధంలోని విషయాలను పుస్తకరూపంలో ప్రచురించేటప్పుడు ఈ గందరగోళాన్ని సరిదిద్దే ప్రయత్నం చేస్తే బాగుండేది. పుస్తకంలో తొలితెలుగుకథానిక గురించి చెప్పేటప్పుడు కాలం అత్యంత ముఖ్యమైన ఆకరం.

కాలాన్ని 1803 (ధనత్రయోదశి), 1810 (దిద్దుబాటు) అనే ముద్రణాదోషాన్ని (తెలుగుకథానిక, 2013, పుట: 10,11) ప్రూఫ్ రీడింగ్ లో చూసుకోవాల్సింది. అయితే ధనత్రయోదశిలో కథానాయకుడు కృష్ణమూర్తి చొక్కాలో ఎవరో బంగారాన్ని పెడితే, దాన్ని పరుల సొమ్ము తీసుకుంటే పాపం వస్తుందనే దృష్టితో యజమానికి తిరిగి ఇచ్చేస్తాడు. దీనిలో 'పాపం' వస్తుందేమో అనేది ఆధునిక దృష్టి అవుతుందా? ఆధునికతకు తాత్త్విక పునాది మానవుడా? మానవేతరశక్తుల ప్రభావమా? గురజాడ రాసిన 'దిద్దుబాటు'లో సంస్కరణదృష్టి ఉంది. పాపపుణ్యాల ప్రశక్తిలేదు. ఇనాక్ గారు రాసిన ఆధునిక విమర్శ సూత్రంలో కూడా ఈ విషయం మీద సుదీర్ఘమైన చర్చ ఉంది. ఆధునికతలో పాపం అనేమాటను చాలా జాగ్రత్తగా ప్రయోగించారు. గురజాడ ఇతర రచనల్లోను ప్రధాన కేంద్రం మానవుడే. కానీ, అచ్చమాంబ ఇతర రచనల్లో కూడా దైవం, మూఢత్వానికి సంబంధించిన విషయాలు అనేకం కనిపిస్తాయి. కేవలం స్త్రీ రాయడం వల్లనో, దిద్దుబాటుకంటే ముందుగా రాయడం వల్లనో అది మొదటి కథానిక అయిపోతుందా? దీనికీ ఒక వాదాన్ని ఇనాక్ గారు ప్రతిపాదించారు. ఆంగ్లంలో ఓహెన్రీ రాసిన katya of the Frogmore Flats or The Passing Repentance of John Perkins(the Pendulam) అని (తెలుగు కథానిక, 2013, పుట: 11) ఆధారాన్ని చూపుతున్నారు. తొలితెలుగు కథానిక గురించి ఆలోచించేవారికి ఇది ఒక కొత్త అంశమే. అయితే కథానికల గురించి వెలువడిన ఈ పుస్తకం ప్రసంగాల్ని కూర్చడం వల్ల వీరి విమర్శలో కనిపించే భిన్న కోణాల్ని గుర్తించడానికి కొంతవరకే సహకరిస్తుంది.

### తెలుగు వ్యాస పరిణామం (1980) :

పరిశోధన ఉండాల్సిన సత్యాన్వేషణకీ, వ్యాసాన్ని ప్రక్రియగా గుర్తించడానికి కావలసినన్ని ఉపపత్తుల్ని సమకూర్చగలిగింది. నేడు సృజనాత్మకవిమర్శ అనే ఒక భావన కనిపిస్తుంది. దీనికి ప్రాతిపదికలు కూడా ఈ గ్రంథంలో కనిపిస్తున్నాయి. సృజనతత్వం గల వ్యాస రచనకి ప్రాముఖ్యతనిచ్చిన గ్రంథంగా విమర్శకులు కొండిపర్తి శేషగిరిరావు పేర్కొన్నారు. (ఆచార్య కొలకలూరి ఇనాక్ షష్టిపూర్తి సన్మాన సంచిక, పుట: 198)

సాహిత్య విమర్శకుడిగా ఇనాక్‌గారి గురించి ప్రస్తావించేవారెవరైనా ఈయన రాసిన *ఆధునిక సాహిత్య విమర్శసూత్రం*, శూద్రకవి శుభమూర్తి వసుచరిత్ర వైశిష్ట్యం,

జానపదుల సాహిత్య విమర్శ గ్రంథాలు గురించి ఇంతకుముందే ప్రస్తావించాను.

## ఆధునిక సాహిత్య విమర్శసూత్రం (1996):

దీనికి 'సూత్రవృత్తి'పేరుతో రాసుకున్న ముందుమాటలో గ్రంథలక్ష్యాన్ని వివరించారు. ఆధునిక సాహిత్యం ప్రాచీనం కంటే భిన్నం. ప్రాచ్యదృక్పథం ఈ సాహిత్యానికి సంపూర్ణంగా వర్తించదు. అలాగే, ఆధునిక సాహిత్య విమర్శకు పాశ్చాత్య పద్ధతి అన్వయమవుతున్నా, ప్రాచ్య ప్రభావాన్ని గుర్తించి, అనువర్తించడం కుదరదు. ఇది ఆంధ్రదేశ సాహిత్యం కనుక ఒక ప్రత్యేక విమర్శసూత్రం అవసరం అన్నారు. విమర్శకులు రూపలక్షణాలను గుర్తించినంతగావస్వంశాలను దర్శించడం లేదు. కనుకనే ఈ కోణంలో భిన్న కాలాల్లో భిన్న సామాజిక నేపథ్యాలను, భిన్నదృక్పథాలను సమన్వయించే దిశగా సిద్ధాంతీకరించబడిందనీ ప్రకటించారు. ద్వితీయ ముద్రణ (2010)లో మరికొన్ని అంశాలను చేర్చినా,ఇంతకు ముందున్న విషయాలను తొలగించలేదు. ఈ విషయాలను ముందుమాట'ఆనందసూత్రం'లో పేర్కొన్నారు.

తెలుగుసాహిత్యవిమర్శను వివిధ వాదాలుగా వర్గీకరించి విశ్లేషించారు. ఆధునికతను కాలవాచిగా చూసేటప్పుడు 1857 తర్వాత సాహిత్యంగా చెప్తూనే, ఆధునికత అవగాహనకు సంబంధించిందనీ, దీని మౌలిక భావన హేతు ప్రధానమైన భౌతిక దృష్టిలో ఉంటుందని వివరించారు.ఆధునిక విమర్శసూత్రంలో కవిదృష్టిప్రధానంగా భావించారు.ఒక దృక్పథం లేకుండా ఉత్తమసాహిత్యం వెలువడదన్నారు.నిబద్ధత,నిమగ్నత, నిబిడిత అనే మూడు సూత్రాల్ని సమన్వయం చేసుకుంటూ ఆధునిక సాహిత్యం, విమర్శ ఉండాలనేది ఇనాక్‌గారి అభిప్రాయం."నిబద్ధత, నిమగ్నతల్లో విషయం, వస్తువు రచయిత చుట్టూ వుంటుంది. నిబిడితలో వస్తువు రచయిత ఒకటే. ఆరెండింటి కంటే నిబిడిత గాఢత కలిగి ఉంది. ఇది నేటి సాహిత్య సూత్రంగా ఉంది. అందువల్ల నిబిడిత దర్శించే ప్రయత్నం నుంచి సాహిత్య తత్త్వం విశదమవుతుంది.నేటి సాహిత్య విమర్శ సూత్రం నిబిడిత." (ఆధునిక సాహిత్య విమర్శసూత్రం, 2010 పుట: 25) అనేది ఇనాక్‌గారు చేసిన దీన్ని గుణత్రైయిసిద్ధాంతం అనిపిలవవచ్చు. దీని వల్ల అంతవరకు నిబద్ధత, నిమగ్నతలు, సామాజిక స్పృహల గురించి చర్చించిన వాళ్ళు- జీవితానుభవాల ప్రాధాన్యతను సిద్ధాంతీకరించేటప్పటికి తమ అస్తిత్వాలను వెతుక్కోవలసిన పరిస్థితి ఏర్పడింది. అలాగే ఈ గ్రంథంలో మరోబలమైన ప్రతిపాదన కూడా ఉంది. దాన్ని

సార్వికత్రయంగా పిలిచారాయన. సాహిత్యం సార్వకాలికం, సార్వదేశికం, సార్వజనీనంగా ఉండాలనే వాదాన్ని తిరస్కరించారు. (పుట:165) ప్రతిదేశానికీ, జాతికి, భాషకీ స్వీయఅస్తిత్వమనేది ఉంటుంది. అది లేకపోతే వైవిధ్యమే ఉండదనేది ఈ వాదనలోని సారాంశం. ఇలా ఈ సూత్రాలతో ఆధునిక విమర్శను సమన్వయించాలని ప్రతిపాదించడమే కాకుండా, తెలుగుసాహిత్యంలో కనిపిస్తున్న వాదాలు, ధోరణులను వీటికి అన్వయించి చూపారు. దళితసాహిత్యానికి దేశీయ సాహిత్య విమర్శవిధానం ఉందన్నారు.

'జానపదుల సాహిత్య విమర్శ' సిద్ధాంత గ్రంథంగా పేర్కొన్నారు. తెలుగు సాహిత్యాన్ని అంతటినీ జాగ్రత్తగా పరిశీలించినప్పుడు కవులు కొన్ని కల్పనలు చేస్తుంటారు. అవి విశేషప్రాచుర్యాన్ని పొందుతుంటాయి. అది లిఖితం చేసిన కవికి సొంతంకాదు. అది జానపదుల ఆలోచన. ఆ ఆలోచనలో ఛమత్కారం, పాండిత్యం, సమయస్ఫూర్తి, విశ్వసనీయత వంటి లక్షణాలున్నట్లు అనిపిస్తాయి. అవన్నీ పాఠకులకు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. కవులను రక్షిస్తాయి. ఆ భావాలన్నీ జానపదుల సాహిత్యవిమర్శలో భాగంగా సిద్ధాంతీకరించేప్రయత్నం చేశారు.

## ఇనాక్‌గారి విమర్శపై విమర్శకుల వ్యాఖ్యలు:

సమకాలీన సాహిత్య విమర్శకులు ఇనాక్‌గారి విమర్శ గురించి కింది విధంగా వ్యాఖ్యానించారు. 'సాహిత్య విమర్శ ఏకకాలంలో సామాజికాంశాల మీదా, కళాంశాల మీద సాగే విమర్శ అయినప్పుడు నిండుతనాన్ని సంతరించుకుంటుంది. విమర్శకుడిగా ఇనాక్ – విమర్శకు సంబంధించిన ఈ నిండుతనాన్ని గుర్తించాడు. దాని అవసరాన్ని గౌరవించాడు" అని జి. లక్ష్మీనరసయ్య వ్యాఖ్యానించారు. (ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యంపై విమర్శనం, పుట: 61)

"ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం' హేతువాద దృక్పథంతో తర్కబద్ధంగా సాగిన విశిష్ట విమర్శాగ్రంథం...ఇనాక్ గారి విమర్శాదృక్పథం ఈ వస్తు విశ్లేషణ చుట్టే తిరిగింది." – యస్వీరామారావు, ఆచార్య కొలకలూరి ఇనాక్ షష్టిపూర్తి సన్మాన *సంచిక*, పుట: 63, 64

"డాక్టర్ ఇనాక్ గారు కథలలో ఎంత నిమగ్నులై వస్తువు నిర్మిస్తారో, విమర్శలో కూడా అంతగా నిమగ్నులై సమన్వయాన్ని సాధిస్తారు"– జి. వి. సుబ్రహ్మణ్యం, ఆచార్య *కొలకలూరి ఇనాక్ షష్టిపూర్తి సన్మాన సంచిక*, పుట:42

"వసుచరిత్ర మీద ఆచార్య ఇనాక్‌గారి విమర్శ సంప్రదాయబద్ధంగా వచ్చిన ఆలంకారిక విమర్శకాదు. అగ్రవర్ణాల అధిక్షేపాలకు ఆగ్రహించి, వారి కవితా సృష్టికంటే అన్నివిధాలా అగ్రగణ్యంగా ఉండే ప్రబంధాన్ని సృష్టించాలని శూద్రకవి అయిన శుభమూర్తి (భట్టుమూర్తి/ రామరాజభూషణుడు) రచించిన కావ్యంగా దానిని వర్గదృక్పథంతో సమన్వయించి చూపించారు."జి.వి.సుబ్రహ్మణ్యం,ఆచార్య కొలకలూరి ఇనాక్ షష్టిపూర్తి సన్మాన సంచిక, పుట: 43

" తెలుగులో కట్టమంచి, రాళ్ళపల్లి, విశ్వనాథ మొదలైనవారు తెలుగు విమర్శను తెలుగులోనే ఆలోచిస్తూ రచించే దేశివిధానం ప్రవేశపెట్టారు. దాని జిగిబిగిని రక్షించారు ఆచార్య ఇనాక్ గారు." జి.వి.సుబ్రహ్మణ్యం, *ఆచార్య కొలకలూరి ఇనాక్ షష్టిపూర్తి సన్మాన సంచిక*, పుట: 43

Prof.Enoch's criticism is a signature of the Dalit rsentment on the sankritised 'Poetics', and 'Rasa theory' which cannot evaluate the 'human' nature of modern literature based not on 'God' but on 'society'. - H.S.Brahmananda, *ఆచార్య కొలకలూరి ఇనాక్ షష్టిపూర్తి సన్మాన సంచిక*, పుట: 171

ఆచార్య కొలకలూరి ఇనాక్ విమర్శనీ, సమకాలీన విమర్శకుల వ్యాఖ్యలను పరిశీలించిన తర్వాత ఈయన ఒక కొత్త అంశాన్ని గానీ, కొత్త సమన్వయాన్ని గానీ, కొత్త సిద్ధాంతాన్నిగానీ చెప్పకుండా సాహిత్యవిమర్శ కొనసాగించరని స్పష్టమవుతుంది. ఇనాక్‌గారిది ప్రధానంగా దళిత, బహుజనసాహిత్యవిమర్శదృక్పథంగా చెప్పవచ్చు. ఇనాక్‌గారి విమర్శలో దళితులు, స్త్రీలు, బలహీనవర్గాలు, మైనారిటీలు, వెనుకబడిన ప్రాంతాలవారి పక్షాన నిలబడి వాదించే దృక్పథం ఉంటుందనుకుంటున్నాను. సాహిత్యంలో వస్తువుకే ప్రాధాన్యాన్నివ్వాలనే వాదనతో పాటు, రూపవాదం పట్ల వ్యతిరేకత కూడా ప్రదర్శితమవుతుంది. అలాగని పూర్తిగా పాశ్చాత్య సాహిత్య విమర్శదృక్పథాన్నే కొనసాగిస్తున్నారనీ అనుకోవడానికి వీల్లేదు.పరోక్షంగా నవ్య మార్క్సిజాన్ని సమర్థిస్తున్నట్లు అనిపిస్తుంది. దాన్నీ లోతుగా చూస్తే వర్గదృక్పథాన్నీ వ్యతిరేకిస్తూనే చారిత్రక, గతితార్కిక భౌతికవాద పునాదులపై నిలబడి మాట్లాడుతున్నట్లు తెలుస్తుంది.

దళిత, బహుజన సాహిత్యదృక్పథానికి కూడా పునాది భౌతివాదం ఉన్నా, దీనికి కులం తోడవుతుంది. ఉపరితలంలో కనిపించే సమస్యలకు పునాదిలో ఉండే

వర్గం ఒక ప్రధానకారణంగా భౌతికవాదం భావిస్తే, దళిత, బహుజన సాహిత్య వాదం కులాన్ని, భౌతిక వాస్తవికతను పునాదిగానే భావిస్తుంది(ఆచార్యకొలకలూరి ఇనాక్ సాహిత్యంపై విమర్శనం, పుట: 167). ఈ దృష్టే ఇనాక్‌గారి విమర్శ దృక్పథంలోఅత్యంతప్రాధాన్యాన్ని సంతరించుకుంది. సాహిత్య ప్రపంచంలో అప్పటికే ఉన్న వాదాలను, సిద్ధాంతాలను సమన్వయిస్తూనే వాటిని దళిత, బహుజనులు తీసుకోవాల్సినవాటినీ, తీసుకోకూడని వాటినీ కుండబద్ధలుకొట్టినట్లు చెప్పగల నిర్భయం ఈయన విమర్శశైలి. కొన్నిసార్లు సాహిత్యవిమర్శలో కూడా విమర్శపారిభాషను సామాన్యీకరించేస్తుంటారు. బ్రాహ్మణీయ సిద్ధాంతాల్ని తగిన ఉపపత్తులు చూపుతూ, తన వాదనాపటిమతో దాన్ని తిరస్కరిస్తూనే దళిత, బహుజన సైద్ధాంతిక విమర్శకుడిగా ముందుకొస్తారు. బహిరంగంగాను, అంతరంగికంగాను ఏకపక్షంగా సాగిన బ్రాహ్మణీయకుట్రల్ని విశదీకరించడం వల్ల ఈయన్ని నిలువెల్లా బ్రాహ్మణీయతను నింపుకున్న సాహితీవేత్తలు, విమర్శకులు అంగీకరించడానికి మనస్కరించలేరను కుంటున్నాను. కానీ, దళిత, బహుజన సృజనకారుల్ని, విమర్శకుల్ని, పరిశోధకుల్ని హెచ్చరిస్తూనే, వీరు కొత్తదారుల్లో వెళ్ళాల్సిన సిద్ధాంత మార్గాల్ని చూపుతుంటారు. ఉత్తమ విమర్శకుడికి సత్యాన్వేషణతో పాటు నిర్భీతి అనేది అత్యంతముఖ్యం. అది ఈయనలో నూటికి నూరుపాళ్ళు కనిపిస్తుంది. సాహిత్యాన్ని ఒక బాధ్యతాయుతమైన, సామాజిక పరివర్తనలో భాగంగా గుర్తించాలని ఆకాంక్షించే స్వభావం ఈయన విమర్శలో కనిపిస్తుంది. ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య విమర్శల్ని సమన్వయిస్తూనే తెలుగు సాహిత్యాన్ని విమర్శించే దేశీయవిమర్శసూత్రాన్ని, సిద్ధాంతాన్నీ ప్రతిపాదించారు. అందుకే ఈయన్ని సైద్ధాంతిక దళిత, బహుజనసాహిత్య విమర్శకుడుగా అభివర్ణించవచ్చునని అనుకుంటున్నాను.

**ఆధారాలు:**


1. ఇనాక్, కొలకలూరి. ఆధునిక సాహిత్య విమర్శసూత్రం, తిరుపతి: జ్యోతి గ్రంథమాల, 2010. (మొదటి ప్రచురణ: 1996)
2. ఇనాక్, కొలకలూరి. *శూద్రకవి శుభమూర్తి వసుచరిత్ర వైశిష్ట్యం* (1996), తిరుపతి: జ్యోతి గ్రంథమాల, 2010. (మొదటిప్రచురణ: 1996)
3. ఇనాక్, కొలకలూరి. *జానపదుల సాహిత్య విమర్శ*, తిరుపతి: జ్యోతి గ్రంథమాల, 2010.

4. కృపాచారి, గుజ్జర్లమూడి., వి.సింగారావు, నాగభైరవ ఆదినారాయణ, కందిమళ్ళ సాంబశివరావు, గుమ్మా సాంబశివరావు (సంపాదకమండలి),ఆచార్య కొలకలూరి *ఇనాక్ సాహితీ సమాలోచనం (పరిశోధన పత్రసమాహారం),* తిరుపతి: జ్యోతి గ్రంథమాల, 2011.
5. చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం., కొళ్ళాగుంట ఆనందన్, (సంపాదకులు), *ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యంపై పరిశోధనం,* తిరుపతి: జ్యోతి గ్రంథమాల, 2009.
6. చెన్నకేశవరెడ్డి,జి. (ప్రధానసంపాదకుడు). *ఆచార్య కొలకలూరి ఇనాక్ షష్టి పూర్తి సన్మానసంచిక,* హైదరాబాదు: ఆచార్య కొలకలూరి ఇనాక్ షష్టి పూర్తి కమిటి, 1999.
7. మధుజ్యోతి, కొలకలూరి. (సంపాదకురాలు), ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యంపై *విమర్శనం,* తిరుపతి: జ్యోతిగ్రంథమాల,2009.

***(దళితసార్వత్రిక విశ్వవిద్యాలయం, గుంటూరు, ఆంధ్రప్రదేశ్ వారు నిర్వహించిన 'పద్మశ్రీ ఆచార్య కొలకలూరి ఇనాక్ గారి జీవితం-సాహిత్యం' అనే అంశంపై 12, 13 జూలై 2014 తేదీల్లో నిర్వహించిన జాతీయసదస్సులో సమర్పించిన పరిశోధన పత్రం)***

# రచయిత
# డా॥ దార్ల వెంకటేశ్వరరావు పరిచయం

శ్రీమతి పెదనాగమ్మ, లంకయ్య దంపతులకు ఉపాధ్యాయ దినోత్సం నాడు (05-09-1973) తూర్పుగోదావరి జిల్లా, చెయ్యేరు అగ్రహారంలో జన్మించిన వెంకటేశ్వరరావు, కోనసీమలోనే ప్రాథమిక విద్యను అభ్యసించారు. శ్రీబానోజీరామర్స్ కళాశాల, అమలాపురం (1995)లో ఇంటర్మీడియట్ నుండి బి. ఏ., (స్పెషల్ తెలుగు) వరకు చదువుకున్నారు. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు (సెంట్రల్ యూనివర్సిటి) లో ఎం.ఏ., తెలుగు (1997); ఎం. ఫిల్., (1997); పిహెచ్.డి., (2003) చేశారు. ఆచార్య ఎస్. శరత్ జ్యోత్స్నారాణిగారి పర్యవేక్షణలో *''జ్ఞానానందకవి ఆమ్రపాలి - పరిశీలన''* పేరుతో చేసిన పరిశోధనకు ఎం.ఫిల్.; *''పరిశోధకుడిగా ఆరుద్ర''* పేరుతో చేసిన పరిశోధనకు పిహెచ్.డి., పట్టాలను అందుకున్నారు. నిజాం కళాశాల (ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి అనుబంధకళాశాల)లో సంస్కృతంలో డిప్లొమా (1997), తెలుగు లింగ్విస్టిక్స్ అండ్ లాంగ్వేజ్ టీచింగ్‌లో పి.జి. డిప్లొమాని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం (2000) లో చేశారు. వీటితో పాటు డా॥బి. ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం (2005)లోఎం.ఏ., (సోషియాలజీ) చేశారు.

ఆంధ్రవిశ్వవిద్యాలయం పరిధిలో బి.ఏ., స్పెషల్ తెలుగు ఫస్ట్ర్యాంకు సాధించిన వారికిచ్చే కళాప్రపూర్ణ జయంతిరామయ్య పంతులు స్మారక బహుమతిని, కందుకూరి వీరేశలింగం, శ్రీమతి రాజ్యలక్ష్మి స్మారక బహుమతుల్ని వెంకటేశ్వరరావు అందుకున్నారు. వీటితో పాటు శ్రీ కోనసీమ భానోజీరామర్స్ కళాశాల వారు డిగ్రీ మూడేళ్ళలో కాలేజీ ఫస్ట్ వచ్చిన వారికిచ్చే నండూరి వెంకటరామయ్య, కుటుంబలక్ష్మి స్మారకబహుమతుల్ని సాధించారు. విద్యార్థిగా మెరిట్ స్కాలర్ షిప్పుతో పాటు, యు.జి.సి., రీసెర్చ్ ఫెలోషిప్‌ని పొందారు. పరిశోధన చేస్తుండగానే పోటీపరీక్షలద్వారా

ప్రభుత్వ జూనియర్, డిగ్రీ కళాశాలల్లో ఏకకాలంలో (2001) అధ్యాపకుడుగా ఎంపికయ్యారు. ఆ తర్వాత (2004 నుండీ) హైదరాబాదు సెంట్రల్ యూనివర్సిటీలో అసోసియేట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. విద్యార్థి దశ నుండే వివిధ పత్రికల్లో కవితలు, వ్యాసాలు రాసే అలవాటున్న వెంకటేశ్వరరావు, హైదరాబాదు సెంట్రల్‌యూనివర్సిటీలో చేరిన తర్వాత ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం, యువవాణి విభాగంలో కొంతకాలం పాటు క్యాజువల్ (క్యాంపియర్) ఎనౌన్సర్‌గా పనిచేశారు. ఆనాటి నుండి నేటి వరకు ఆకాశవాణిలో అనేక కవితలు, సాహితీ ప్రసంగాలు చేస్తున్నారు. పరిశోధన విద్యార్థిగా ఉన్నప్పుడే సివిల్ సర్వీసెస్ అభ్యర్థులకు తెలుగు సాహిత్యంలో శిక్షణనిస్తూ, దూరదర్శన్‌లో కూడా ప్రసంగాలిచ్చారు.

వెంకటేశ్వరరావు వివిధ విశ్వవిద్యాలయాల్లో జరిగిన జాతీయ సదస్సుల్లో సుమారు 54 పరిశోధన పత్రాలను సమర్పించారు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి *"వాఙ్మయి"*, తెలుగు అకాడమీ వారి *"తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక"*, ద్రావిడ విశ్వవిద్యాలయం వారి *'ద్రావిడి'* వంటి పరిశోధన పత్రికలు, ప్రత్యేక సంచికలు, దినపత్రికల్లో సుమారు 54 పరిశోధన, విమర్శ పత్రాలు ప్రచురితమైయ్యాయి. ఇప్పటివరకు కవిత్వం, విమర్శ, పరిశోధనలకు సంబంధించి పది పుస్తకాలను ప్రచురించారు.

*మాదిగచైతన్యం* (1997) సంపాదకత్వం
*సాహితీ మూర్తుల ప్రశస్తి* (1998) సహ సంపాదకత్వం,
*జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన(1999)*
*దళితతాత్త్వికుడు* (2004)
*సృజనాత్మక రచనలు చేయడం ఎలా?* (2005)
*సాహితీసులోచనం* (2006)
*ఒక మాదిగస్మృతి –నాగప్పగారి సుందర్రాజు* (2007)
మోనోగ్రాఫ్ *దళితసాహిత్యం: మాదిగదృక్పథం* (2008)
*వీచిక* (2009)
*పునర్మూల్యాంకనం* (2010)
*బహుజన సాహిత్య దృక్పథం* (2012)

మొదలైన గ్రంథాల్ని ప్రచురించారు. మరో నాలుగుగ్రంథాలు ప్రచురణలో ఉన్నాయి. ఈయన కవిత్వం త్వరలో ఆంగ్ల, కన్నడ హిందీ భాషల్లో వెలువడనుంది. చిన్ననాటి నుండే సాహిత్యాభిలాష గల వెంకటేశ్వరరావు వ్యాసరచన పోటీలో భారతీయ సాహిత్య పరిషత్ రాజమండ్రిలో జరిగిన రాష్ట్ర స్థాయి మహాసభల్లో ప్రథమ బహుమతి (1996) ని అందుకున్నారు. ఈయన చేస్తున్న సాహిత్య కృషికి గుర్తింపుగా భారతీయ దళిత సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ వారు 2007లో డా॥బి॥ఆర్॥ అంబేద్కర్ పురస్కారంతో సత్కరించారు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు వారిచ్చే కీర్తిపురస్కారాన్ని 2012 సంవత్సరానికిగాను తెలుగు సాహిత్య విమర్శ రంగంలో ఈయనకిచ్చి గౌరవించారు.

ఆచార్య పరిమిరామనరసింహంగారి సూచనలతో యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదులో ఎం.ఏ., తెలుగు విద్యార్థులకు దళితసాహిత్యాన్ని ఒక ఆప్షనల్ కోర్సుగా పాఠ్య ప్రణాళికను రూపొందించి 2005 నుండీ బోధిస్తున్నారు. వీటితో పాటు తెలుగు సాహిత్య విమర్శ, సౌందర్యశాస్త్రం, తులనాత్మక కళాతత్త్వశాస్త్రం కోర్సులను చెప్తున్నారు. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు వారు దూరవిద్య ద్వారా బోధించే జర్నలిజం అండ్ మాస్ కమ్యూనికేషన్స్ కోర్సు పి.జి. డిప్లొమా విద్యార్థుల కోసం రెండు పాఠ్యాంశాలను రాశారు. వీటితో పాటు మహాత్మాగాంధీ విశ్వవిద్యాలయం డిగ్రీ విద్యార్థులకు కూడా ఒకపాఠ్యాంశాన్ని రాశారు. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదులో ఐదు సంవత్సరాల ఎం.ఏ. కోర్సు (ఇంటిగ్రేటెడ్ మాస్టర్స్ డిగ్రీ) తెలుగు విభాగం కోఆర్డినేటర్గా సేవలందించారు. తెలుగు సాహిత్యంలో *మాదిగల సామాజిక, సాంస్కృతిక అధ్యయనం"* అనే అంశంపై యు. జి. సి వారి మేజర్ రీసెర్చ్ ప్రాజెక్టు పూర్తిచేశారు. ప్రస్తుతం యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు, తెలుగుశాఖలో అసోసియేటు ప్రొఫెసరుగా పనిచేస్తున్న డా॥వెంకటేశ్వరరావు పర్యవేక్షణలో ఇప్పటి వరకు రెండు పిహెచ్.డి., పరిశోధనలు, పద్నాలుగు ఎం.ఫిల్., పరిశోధనలు పూర్తయ్యాయి. ప్రస్తుతం ఈయన పర్యవేక్షణలో తొమ్మిదిమంది పిహెచ్.డి., ఇద్దరు ఎం.ఫిల్., పరిశోధనలు చేస్తున్నారు

**–సొసైటీ & ఎడ్యుకేషన్ ట్రస్టు**

సాహితీ మూర్తులు - స్ఫూర్తులు డా॥ దార్ల వెంకటేశ్వరరావు




సాహిత్య విమర్శ రంగంలో కృషి చేసినందుకు గాను 28-11-2013 వ తేదీన డా॥ దార్ల వెంకటేశ్వరరావుని కీర్తిపురస్కారంతో సత్కరిస్తున్న పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్ ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, రాజీవ్ ఎడ్యుకేషన్ అండ్ ఎంప్లాయ్‌మెంట్ మిషన్ చైర్మన్ ఆచార్య కె.సి.రెడ్డి, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్ ఆచార్య కె.ఆశీర్వాదం, తెలంగాణ ప్రభుత్వ సాంస్కృతిక సలహాదారు డా॥కె.వి.రమణాచారి తదితరులు చిత్రంలో ఉన్నారు.

దార్ల వెంకటేశ్వరరావు వర్తమాన సాహిత్యంతో కలిసి క్రమం తప్పక నడుస్తున్న విమర్శకుడు. ఆ కృషినీ ఈ మధ్య తెలుగు విశ్వవిద్యాలయం గుర్తించింది. ఉత్తమ విమర్శకుడి పురస్కారమూ సమర్పించింది. అస్తిత్వవాద భావజాలాన్ని బలమైన కంఠస్వరంగా విన్పిస్తున్న వారిలో దార్ల కూడా ఒకరు.

అంతరార్థ రామాయణంపై రాసిన పెయ్యేటి లక్ష్మీ కాంతమ్మగారిని లోకానికి పరిచయం చేశాడు. తరిగొండవెంగమాంబ, బండారు అచ్చమాంబ రచనలలోని కవితా మాధుర్యాన్నీ, స్త్రీ చైతన్యాన్ని తూకం వేశాడు. గురజాడ కవిత్వంలోని సంస్కరణదృక్పథం, గిడుగు సాహిత్యంలోని సామాజిక దృక్పథం వంటి వ్యాసాలు మనల్ని పునరాలోచనలో పడవేస్తాయి.

ఆధునిక కవిత్వం, ఆధునిక సాహిత్య ప్రక్రియలు, కళాతత్త్వశాస్త్రం, అంతర్జాలం.... ఇలా విషయ వైవిధ్యంతో కూడిన వ్యాసాలు సాహితీ విద్యార్థులకు చక్కగా పాఠం చెప్తున్నట్లుగా సరళమైన భాషలో అందించటం విశేషం. దార్లలోని విద్యార్థిమిత్ర విమర్శకుడిని అభినందిస్తున్నాను.

-ఆచార్య చేతవోలు రామబ్రహ్మం


9 788190 896344